జాతీయ జీవిత గ్రంథమాల

# చైతన్య

రచన
దిలీప్‌కుమార్ ముఖర్జీ

అనువాదం
డా॥ అయాచితుల హనుమచ్ఛాస్త్రి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయసూచిక

# చారిత్రకం

చైతన్యులు సర్వశ్రేష్ఠ హిందూ సాధు పురుషులలో ఒకరు. వంగ దేశమూ, యావద్భారతము కనిన కన్నాకు సంతానంలో మేలు బంతికి చెందినవారు. వైష్ణవ నవోదయం కొద్దిశతాబ్దాల క్రింద పెంచిన మహావృక్షాగ్రంపై, చైతన్యుల జీవితమూ, వ్యక్తిత్వమూ, పరిమళ భరితాలై పుష్పించాయి. ఆనాడు ఆయన వ్యక్తిత్వంనుంచి నిస్రుతమై ప్రసారితమైన సౌగంధ్యం, వందల యేండ్లు గడిచినా, నేటికీ హిందూ హృదయాలను పరిమళింప చేస్తూనే వుంది. చైతన్య మహాప్రభువు లేక గౌరాంగ భగవానుల ప్రసిద్ధ సందేశం, ఆయన విచారసరణి, నేటికీ వైష్ణవ హృదయాలను – ఆనందం, ఆప్త ప్రేమ – వీటితో ప్రేరితము లయ్యేటట్లు చేస్తు వున్నాయి.

చైతన్యులు ప్రాదుర్భవించడానికి కొంచెం పూర్వమే, కొన్ని శతాబ్దులుగా భారతీయ చరిత్ర అస్తవ్యస్తమై, అల్లకల్లోలమై, నిలకడ, నెమ్మది లేకుండా కొట్టుమిట్టాడుతూ వుంది. హిందూ కుష్ పర్వతశ్రేణిని దాటి వచ్చి, విదేశీయులు మూకలు మూకలుగా, తండోపతండాలుగా దండెత్తివచ్చి, దోపిడీలు, బలాత్కారాలు, హత్యాకాండలూ మొదలైన వాటితో నగ్న నృత్యం చేసిరి, దేశానికిప్రభువులై కూచున్నారు. వాళ్లు ఎప్పుడూ విచ్చుకత్తులతోనే వ్యవహరించారు. స్థానికులైన రాజులతో దెబ్బలాడని సమయాల్లో, వాళ్ళు పరస్పరం దెబ్బలాడుకొనేవాళ్లు. పల్లె పట్టులలోని శాంతిభద్రతలు, సైనికుల సమరయాత్రల మూలంగానూ, యుద్ధ నినాదాల మూలంగానూ, భంగింపబడ్డాయి. వంగ దేశంలోనే హిందూ పరిపాలన, పండ్రెండవ శతాబ్దంలో లక్ష్మణసేన మహారాజు తురుష్కుల ద్వారాపొందిన ఓటమి వలన, అంతమై పోయింది. వంగదేశం ఇస్లామీ-సామ్రాజ్యానికి అంశభూతమైంది.

హిందూ జీవితమూ, హిందూ సంస్కృతీ రెండూ అధః పతనమై పోవడమే, ఈ మార్పు యొక్క ఫలితం. హిందువులు తమ ఇంట్లోనే తాము పరాయివాళ్లయిపోయారు. అష్టకష్టాలు, అవమానాలు, ఓర్చుకుంటేనే, వాళ్ల ప్రాణాలు, ధన ధాన్యాలు, మత విశ్వాసాలు, సురక్షితంగా నిలిచేది. ఓటమి మనస్తత్వం జనంలో

వ్యాపించింది. జనుల ఉత్సాహక శక్తి క్షీణించిపోయింది.వాళ్ల విశ్వాసలతాంకురం వాడి వత్తలైంది.

ఈ దురదృష్టాలతో పాటే, వీని మూలంగానే లేక ఈ ప్రతీప శక్తులన్నీ ఉంటున్నప్పటికీ, హిందూమతంలో నవ్య విచార సరణి, ధార్మిక నవోదయం తలెత్తాయి. పండ్రెండవ శతాబ్దిలో రామానుజాచార్యులు ఆవిర్భవించారు. వారు సగుణమూ, స్వకీయమూ, అయిన ఈశ్వర సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ఈశ్వరోపాసనకు భక్తి మార్గమే సరియైన మార్గమని తమ ధార్మిక సందేశాన్ని నలుమూలలా ప్రతిధ్వనింప జేశారు. వారి తర్వాత అవతరించిన మహానుభావులు, వల్లభాచార్యులు, రామానందులు మొదలైన ఎందరో సాధు పురుషులు. భక్తి ఆందోళనకు మరింత పుష్టి చేకూర్చి ఇతోధికంగా దానిని వ్యాపింప జేశారు. వంగదేశమున జయదేవులు తమ అమర కావ్యం గీత గోవిందం ద్వారా రాధాకృష్ణ ప్రణయాన్ని హృదయావర్జకంగా మధురగానం చేశారు. విద్యాపతి, చండీదాసు, కూడా ఇదే విషయాన్ని స్వీకరించి తమ రచనలు సాగించారు. విద్యాపతి మైథిలిలో రాసిన 'పదావళి' చండీదాసుని 'శ్రీకృష్ణ కీర్తన' ఇవి రెండూ ఎక్కడ గానం చేసినా, జన ప్రీతిని సంపాదించుకోగలిగాయి. ఈ విధంగా గీత కావ్యమనే విహంగం యొక్క రెక్కలపై గగన విహారం చేస్తే భక్తి ఆందోళనం వంగదేశ మంతటా శక్తిమంతమైన రూపం దాల్చింది. హిందూవులకు కృష్ణ కీర్తనల ద్వారా తమ భావాలను, ఆవేశాలను, ఆశయాలను, అభివ్యక్తం చేసే చక్కని మార్గ మేర్పడింది, తమ కష్టాలనుంచి బహుశా, సాధ్యమైన ఒకే బాటలో –ముక్తి సంపాదించుకున్నారు, తోడ్తో ఈశ్వర సాన్నిధ్యాన్ని సంపాదించే, సులభోపాయాన్ని వాళ్లు కనుగొన్నారు.

పండ్రెండవ శతాబ్ది పిమ్మట బెంగాలులో వైష్ణవ మతం, అన్నింటి కంటె మించి వ్యాపించినా లేక పోయినా, అన్నింటి కంటె మహిమాన్వితమైన ధార్మికాందోళనగా రూపొందింది. ఉపాసనా మార్గంలో భక్తికి ముఖ్యస్థానం లభించింది. ఆ భకిని వెల్లడించడానికి కీర్తన ఒక ముఖ్యసాధనంగా ప్రతిష్ఠితమైంది.

కొన్ని యితర మతాలు, పంథాలు, మత సంప్రదాయాలూ కూడా వంగదేశంలో లేక పోలేదు. ఓ విధమైన బౌద్ధమతం కూడా ప్రచలితమై వుండనే వుంది. ఆ మత శాఖలైన వజ్రయానము, సహజ యానము, వాని రహస్య యయాలైన రీతి రివాజులు కూడా వుండేవున్నాయి. జుగుప్సాకరము, వికృతము అయిన తంత్ర పద్ధతికూడా వ్యాప్తిలో వుంది. అలౌకిక శక్తులను ప్రసాదించే, దాని విలక్షణ

సిద్ధాంతాలు, జనాన్ని ఆకర్షించి, కొంత కాలం వరకు, వాళ్ల హృదయాలను భారీ ఎత్తున ఆకట్టు కొన్నది. కానీ సమాజంపై వీటిలో ఏ ఒక్కదాని చెల్లుబడి ప్రగాఢంగా, సమగ్రంగా వుందని చెప్పడానికి వీల్లేదు. వీని సామాజిక ప్రయోజనం అంతంతమాత్రమే. ఇవి ఏవీ కాలమపేక్షిస్తూ వున్న అనుభూతిని అందియ్యలేక పోయాయి. వీటిని గూర్చి నిజంగా మతం స్థాయిలో మాట్లాడడం కూడా మంచి పని కాదు. వీటిని మనం, ఆత్మ యొక్క పతనానికి, పథభ్రష్టతకు, చిన్నెలుగా గ్రహింపవచ్చు.

చైతన్యుల జన్మస్థానమైన నవద్వీపం, ఆ రోజుల్లో మహనీయ ధార్మిక సాంస్కృతిక కేంద్రంగా వికసించింది. అది చాల యేండ్లుగా, సంస్కృత విద్యకు పేరు పడ్డ విద్యాపీఠంగా విలసిల్లింది. అచ్చటకు దేశం నలువైపుల నుంచి విద్యార్థులు, విద్యను ఆర్జించడానికి వస్తూ వుండే వాళ్ళు. పరంపరా నిష్ఠమైన బ్రాహ్మణ మతానికి కూడా అది ఆలవాలంగా వుండేది. ఆ ధర్మ ప్రచారానికి ఆచార్యులుగా వుండే వాడు రఘునందనుడు.

తంత్ర మత ప్రభావం కూడ నవ ద్వీపంలో వలసినంత వుంది. 'తంత్రసార' రచయిత, 'ఆగమవాగీశుడు', కృష్ణానందుడు నవద్వీపంలోనే వుండేవాడు. వైష్ణవులు జనసంఖ్యలో తక్కువేగాని చాల సక్రియులుగా వుండేవాళ్లు. భక్తుల ఇండ్లల్లో యథాసమయంగా, భజన మండలులు చేరుతూ వుండేవి, ధార్మిక ప్రవచనాలు జరుగుతూ వుండేవి, శాస్త్రార్థాలు నడిచేవి, భాగవత పారాయణం జరుగూ వుండేది. కీర్తనలు కూడా ధ్వనిస్తూ వుండేవి.

నవ ద్వీపంలో అప్పట్లో భక్త శిరోమణులైన 'మాధవేంద్రపురి' వైష్ణవ కార్యకలాపాలకు ప్రేరణాస్రోతస్సుగా వుండేవారు. ఆయన గొప్ప విద్వాంసులు. వంగ దేశమందలి వైష్ణవ మత చరిత్రలో మాధవేంద్రపురి ఎన్నదగ్గ మహావ్యక్తి. ఆయన ప్రతిపాదించిన ఆహేతుకీ భక్తి, దివ్య ప్రేమ ఇవి రెండూ, వైష్ణవ సిద్ధాంతానికి నూత్న కీర్తి స్ఫూర్తులు చేకూర్చాయి. జయదేవుడు,విద్యావతి, చండీదాసు, ఈ ముగ్గురి రచనలలోని రాధాకృష్ణ ప్రసంగం, అతిలోక సుందరంగా వున్నప్పటికీ, ముఖ్యంగా శృంగారపరమై, అచ్చటచ్చట అపరిష్కృతంగా, పచ్చిపచ్చిగా వుంటూ వచ్చింది. అట్టి రాధాకృష్ణ ప్రణయ ప్రసంగాన్ని మాధవేంద్రపురి, ఉచ్చస్థాయికి తీసికొనిపోయి సూక్ష్మ భావ ధరాతలంపై నెలకొల్పాడు.

మాధవేంద్రపురి శిష్యుల్లో ఇద్దరు ప్రముఖులు, ఒకరు కమలాక్ష భట్టాచార్యులు,

వీరికే అద్వైత ఆచార్యులని మరో పేరు. రెండవ వారు 'ఈశ్వరపురి'. ఈశ్వరపురి చైతన్యులకు గురుపాదులు. అద్వైతాచార్యులు, నవద్వీపానికి దగ్గరగా వున్న శాంతి పుర గ్రామ నివాసి. కాని ఎక్కువ సమయం ఆయన నవద్వీపంలోనే గడిపేవాడు. ఆయన పేర్మోగిన విద్వాంసుడేగాక ధర్మ నిష్ఠుడైన మహాభక్తుడు కూడ. నవద్వీపంలోనూ, ఆ చుట్టు ప్రక్కలా వైష్ణవ బృందంలో ఆయనకు ఎంతో గౌరవ ప్రపత్తులున్నాయి. ఆయన చైతన్యుల పితృపాదులైన జగన్నాథ మిశ్రకు కావలసిన స్నేహితుడు.

తల్లివైపు, తండ్రివైపు కూడ చైతన్యుని పూర్వీకులు అస్సాంలోని సిల్‌హట్ ప్రాంతానికి చెందిన వాళ్లు. అద్వైతాచార్యులు, ఎందరో చైతన్యుల సహయోగులూ, అనుయాయులూ, కూడ పూర్వం ఆ ప్రాంతానికి చెందిన వాళ్ళు. వీళ్లందరూ, నవద్వీపానికి విద్యాకేంద్రంగా వున్న పేరు ప్రతిష్ఠలను బట్టి ఈ పట్టణానికి వచ్చి చేరారు. 'సిల్‌హట్'కంటె కూడ పూర్వమే వాళ్ళ వాళ్ళు ఒరిస్సాకు చెందిన జయపురంలో వుండేవాళ్ళు. ఒరిస్సాలో కపిలేంద్ర గజపతి ఏలుబడి కాలంలో ఎప్పుడో సిల్‌హట్ వచ్చి చేరారు.

## జన్మ – శైశవం

చైతన్యుడు నవద్వీపంలో క్రీ.శ. 1486 సంవత్సరం ఫిబ్రవరి నెలలో జన్మించారు. చంద్రగ్రహణ సమయం అది. నగరంలో ధర్మ ప్రవణులైన స్త్రీ పురుషులందరూ, గంగా స్నానం చేసి, స్తోత్ర జపాలు చేస్తూ వున్నారు. మామూలుగా అటువంటి పర్వ సమయాల్లో ధర్మ నిష్ఠులైన వాళ్లంతా అలా చేస్తూ వుంటారు. చైతన్యుని తండ్రి జగన్నాథ మిశ్రులు, ధర్మనిష్ఠులు, విద్యావ్యసని అయిన వైష్ణవోత్తములు. చైతన్యుని తల్లి శచీదేవి కూడ ధర్మ బుద్ధి, ఆధ్యాత్మిక ధోరణిగల ఉత్తమ యిల్లాలు. కుటుంబం ఆర్థిక పరిస్థితి సాధారణమైనది.

పిల్లవానిపేరు విశ్వంభరుడని పెట్టారు. విశ్వంభరుడు తల్లిదండ్రుల కనిష్ఠ సంతానము. విశ్వభరుని కంటే అవ్యవహిత పూర్వుడైన అన్న 'విశ్వరూపుడు', ఇల్లు వాకిళ్ళు వదిలివేసి అద్వైత సన్యాసిగా ఆశ్రమ స్వీకారం చేశాడు. అతను తిరిగి వెనుకకు వచ్చే ఆశలేమీ లేవు. దంపతుల మిగతా పిల్లలందరూ, తక్కువ ఆయుస్సులోనే మృత్యువాత బడ్డారు. ఈ విధంగా తల్లిదండ్రులకు ఒక్కగాని ఒక్క విశ్వంభరుడు మిగిలాడు. అందుకు ఫలితంగా, విశ్వంభరుడు తల్లిదండ్రుల

ప్రేమనంతటినీ అవిభక్తంగా చూరగొన్నాడు. వాళ్ళు ఆయనను 'నిమాయి' అనే ముద్దు పేరుతో పిలిచే వాళ్ళు. అతని శరీరం అతి ధవళంగా వుండడం చేత, అతనికి 'గౌరాంగుడనే' పేరు కూడ వచ్చింది.

'నిమాయి' తల్లి దండ్రులు - అతన్ని బడికి పంపటాని కంతగా ఉత్సాహ పడలేదు. కొంపదీసి, ఇతను కూడా అతని అన్నవలెనే, విద్యాబుద్ధులు అలవడిన తరువాత సన్న్యాస స్వీకారం చేసి ఇల్లు వదిలి పారి పోతాడేమోనని వాళ్ళ భయం. అందువలన కొన్ని సంవత్సరాలపాటు, 'నిమాయి' ఇంటి పట్టునే వుండి పోవలసి వచ్చింది. అతను ఆరోగ్యంతో సంతోషంతో పరవళ్ళు తొక్కుతూవుండే యువకుడుగా రూపొంది, బాల సులభమైన చేష్టలతో అందరినీ మురిపిస్తూ వుండేవాడు. తల్లిదండ్రులుగూడా ఆ చిలిపి చేష్టలకు, ముద్దు చర్యలకు 'నిమాయి'కి వశీభూతులై పోయేవాళ్లు. ఇరుగు పొరుగు వాళ్లకు అతనంటే కొంచెం సావధానంగా జాగ్రత్తగా వుండవలసి వచ్చేది. బాల్య చేష్టలెట్లున్నా, అతని అందంచిందే ముఖం, ముద్దు గొలిపే రూపు రేఖలు, అందరికీ అతనంటే ప్రేమ కలిగించేవి. ఎప్పుడో ఒకప్పుడు బడికంటూ పంపాలి కదా! ప్రాథమిక విద్యాభ్యాసం కోసమని అతన్ని యిద్దరు పండితుల దగ్గిరకు పంపారు. పై చదువు కొరకు - ముఖ్యంగా వ్యాకరణం నేర్చుకోవడానికని గంగాదాసుగారి పేర్వడ్డ సంస్కృత పాఠశాలలో అతన్ని జేర్పించారు.

'నిమాయి' తన తీక్ష్ణ బుద్ధిని - సగటు కంటె ఎక్కువగా ప్రదర్శించాడు. అనతి కాలంలోనే, వ్యాకరణంలోనూ, మరి కొంతవరకు, సాహిత్యంలోనూ, అలంకార శాస్త్రంలోనూ, అతను దక్షత సంపాదించాడు. కానైతే అతని మనస్సు విద్యనార్జించడంలో పూర్తిగా నిమగ్నమైందని చెప్పడానికి వీల్లేదు. ఆ కాలంలో ఒక బ్రాహ్మణ బాలకుని కెంత విద్య అవసరమో, అందులో కొంత పాలే అతనికి లభించింది.

నిమాయి పాఠశాలలో వుంటున్నప్పుడే అతని తండ్రి దివంగతుడైనాడు. అంచేత, కుటుంబ భారమతని లేత భుజాలపై పడ్డది.

## కుటుంబీకుడుగా

కొన్ని యేండ్ల తర్వాత అతడు పెళ్ళిచేసుకొని గృహస్థు అయ్యాడు. ఆయన భార్య లక్ష్మి, ఆవూరి విద్యాంసుడైన వల్లభాచార్యుల కుమార్తె. వివాహానంతరం, నవద్వీపంలో అనాదిగా, ఆచారంగా వస్తూ వున్న విధంగానే ఒక సంస్కృత పాఠశాల

స్థాపించి, 'నిమాయి' శిష్యులను స్వీకరించడం మొదలు పెట్టాడు.

జీవితంలోని ఈ ప్రారంభ దశలో, నిర్లక్ష్యం, పడుచుదనపు ఉమ్మగస్సు స్వభావంగా గల విశ్వంభరుడు మతంపైనా, ఆధ్యాత్మికంపైనా ఏమంతగా మొగ్గు చూపలేదు.జీవితం తరువాతి దశలో ఆయనలో కానవచ్చే వినయముద్రకు, ఇప్పటి జీవితంలో ఎటువంటి తొలి చిన్నెలు కానరావడం లేదు. ఆయన్ని తూకంవేసి చెప్పాలంటే, ఆయన అప్పట్లో అహంకారంతోనిండిన,దర్పోద్ధతుడైన పండితుడుగా, ఎదిరిని నిర్లక్ష్యం చేసి, అవహేళన చేసి, ఆనందించే ఒకానొక ధూర్త పండితుడుగానే కనబడతాడు. కాని ఆయన పై వ్రాయబడిన జీవిత చరిత్రలను బట్టి చూస్తే, ఆ విధంగా హాస్యం పట్టించడలో గాని, మరో విధంగా గాని, ఆయనకు ఇతరులకు హాని కలిగించాలనే ఉద్దేశమున్నట్లు కనబడదు. ఆయన క్రమంగా తన విద్వత్తు తెచ్చి పెట్టిన పేరు ప్రఖ్యాతులతో నవద్వీపనగరంలో వాసి వన్నెలుగాంచాడు. ఆయన పాఠశాల కూడ బాగా జనాదరణ సంపాదించుకోగల్గింది.

ఈ సమయంలోనే ఓ సారి ఆయన నవద్వీపం వదిలి వంగదేశం తూర్పుదెసగా యాత్రలు చేశాడు. ఈ యాత్రలు తన శిష్యులనుంచి దక్షిణ సేకరించడానికి, శ్రీమంతులైన గృహస్థులనుంచి విరాళాలు పోగుచేయడాని ఉద్దేశింపబడ్డాయి. ఆయన చాలా దూర ప్రదేశాలకు యాత్రలు సలిపి, తన ఉద్దేశాని కనుగుణమైన సంతోషజనకమైన ఫలితాన్ని సం: దించాడు. ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి, తనభార్య మరణవార్త,తల్లి చె: ్గా విన్నా డు. పాము కాటు వల్ల లక్ష్మి స్వర్గస్థురాలయింది. విశ్వంభరుడు తన భార్యపై మిక్కుటమైన మక్కువగలవాడు. మనస్ఫూర్తిగా, భార్యను ప్రాణపదంగా ప్రేమించేవాడు. ఈ శోకవార్త విని ఆయన గుండె వ్రీలి పోయింది. తనకు తగిలిన ఈ దెబ్బ చాలా తీవ్రమైనది. అయినప్పటికీ, బైటకు చాలా ప్రశాంతంగా, చలింపని వానివలె ఉండి పోయాడు. ఏమి కొంతకు కొంతయినా ఈ వియోగ శోకం, ఆయన తర్వాతి జీవితంలో సాంసారిక సుఖాల్ని పరిత్యజించడానికి పునాది రాయి వేసి యుండునా? ఏమో! ఇది ఊహాపోహ లొనర్పవలసిన విషయమే.

లక్ష్మి స్వర్గవాసిని యైనకొద్దిరోజుల లోపలనే, శచీదేవి తన కుమారుని ద్వితీయ వివాహమునకు సంబంధించిన ఏర్పాట్లన్నీ చేసేసింది. అతనికి పెండ్లి నిశ్చయమైన తర్వాత ఆ నిశ్చిత తిథిని సూచించడం జరిగింది. నిజానికి, ఈ రెండో పెళ్ళిని గూర్చి ఆయన మనస్సు ఏమంతగా ఉబలాటపడి ఉవ్విళ్ళూరలేదు.

విన్న వెంటనే ఆయన పద్దని నిరాకరించివేద్దా మనుకున్నాడు. కాని తాను నిరాకరించినట్లయితే, తన తల్లి సంకటంలో పడుతుందని గమనించిన వాడై, సరేనని తలవూపాడు.

రెండవ భార్య పేరు విష్ణుప్రియ. ఆమె నవద్వీపంలోనే నివసించే మరో పండితుడు సనాతన మిశ్రుని కూతురు. చైతన్యుల సమకాలికులైన ఒక రచయిత విష్ణుప్రియను ఎల్లప్పుడూ ఈశ్వరారాధనలో నిమగ్నులై వుంటున్నట్లు, మందస్మిత శోభితయై, సహజ లజ్జాశీలియై, వినయాన్వితయై విలసిల్లే బాలికగా వర్ణించి చెప్పాడు. విష్ణుప్రియ యశస్వియైన తన పతి తోబాటు సహధర్మచారిణిగా కొలదికాలమే దాంపత్య జీవనసుఖ మనుభవించినవూ, పతి మరణానంతరము ఎన్నో యేండ్ల వరకు జీవించింది. వైష్ణవ సంప్రదాయజ్ఞుల దృష్టిలో ఆమెకు శ్రద్ధాభక్తి సమన్వితమైన స్థానం కద్దు.

## జీవితంలోని మలుపు

సంస్కృత పాఠశాలలో కొంతకాలం శిష్యులకు బోధిస్తూ గడిపిన పిదప, విశ్వంభరుడు తన తండ్రి శ్రాద్ధం పెట్టడానికని తీర్థయాత్రపై గయకు చేరుకున్నాడు. ఈ తీర్థయాత్ర ఆయన జీవితంలో ఓ మలుపు తెచ్చిపెట్టింది. ఆయన గయలో ప్రసిద్ధ సన్యాసులైన ఈశ్వరపురిని కలుసుకున్నాడు. ఆయనను తన ఆధ్యాత్మిక గురువుగా పథ ప్రదర్శకుడుగా స్వీకరించాడు. అప్పటికి విశ్వంభరుని వయస్సు ఇంచుమించు 22 సంవత్సరాలు. ఆ పవిత్ర నగరిలో సంభవించిన యేదో ఒకానొక సంఘటన ఆయన అంతరంగంలో ధార్మిక జాగృతిని రేకెత్తించింది. దాంతో ఆయన పూర్తిగా మారిపోయారు. 'ఈశ్వరపురి' ఆయనకు దశాక్షరములుగల కృష్ణమంత్రమును దశాక్షరిని ఉపదేశించినట్లు చెబుతారు. కాని కేవలం ఇంత మాత్రానికే విశ్వంభరునిలో ఇంత మార్పు వచ్చిందని చెప్పలేము. ఆయనలో ఆ మూలచూడంగా మార్పు తెచ్చిపెట్టిన ఆధ్యాత్మి కాందోళనం యొక్క స్రోతస్సు ఆయన అంతరాంతరాల్లో ఏ అగాధంలోనో వుండి వుండాలి. ఇదమిత్థమని చెప్పడం కష్టం. చైతన్యులు స్వయంగా కూడా గయలో తనలో మార్పు తెచ్చిపెట్టిన ఆ అనుభూతి ఎట్టిదో వివరింపలేక పోయారు. ఆయన జీవిత చరిత్ర రాసిన కవులు, ఆయన గయపేరు చెబితే చాలు, అశ్రువిహ్వలులై మూర్ఛిల్లిపోయేవారని మాత్రమే రాసిపెట్టారు. గయనగరంలోని పవిత్ర వాతావరణం,

విష్ణు మందిరం, విశేషించి దేవాలయంలోని విష్ణుపాద చిహ్నములు, బహుశా ఇవన్నీ కలిసి ఆయనకు ఉత్ప్రేరకాలై యుండి యుండవచ్చు.

కారణమేమైనా ఆయన గయలో ఆధ్యాత్మికంగా 'పునర్జన్మించారు. ఆయన ఆదినుంచి పూర్తిగా మారిపోయిన మనిషిగా బైట పడ్డారు. ఆ పవిత్ర నగరానికి వెళ్లడానికి పూర్వం ఆయన ఒక దర్పోద్ధతుడూ, సుందరుడూ, ఆవేశపరుడూ అయిన యువక సాధారణుడు. ఇప్పుడదంతా మారిపోయిన సరికొత్త మనిషి. తన వేష భాషలపై ఆయన కిప్పుడెటువంటి మోజులేదు. ప్రపంచ విషయాలపై ఆయన కెట్టి అనురక్తి లేదు. జనసామాన్య మాయనను, పిచ్చివానిగా జమకట్ట సాగింది. నిజానికి ఆయన బాహ్యాచరణ, ఆయనను గురించి ఆవిధంగానే అనిపింపజేస్తోంది. అట్టి భావాలకు పుష్టి కలుగజేస్తోంది. ఆయన ఏదైనా గదిలో, తలుపులు బిగించుకొని పడి వుండే వారు, గంటలకొలది అదే పరిస్థితిలో వుండిపోయేవారు. అప్పుడప్పుడూ ఆయన కృష్ణా! అని కేకలు పెట్టడమూ, మరు క్షణంలో అశ్రుధార ప్రవహింపజేయడమో లేక మూర్ఛిల్లి పడిపోవడమో చేసే వారు. శ్రీకృష్ణ భగవానులు ఆయన సర్వ శరీరమందు, సర్వ ప్రాణములందు, వ్యాపించి నిండిపోయిన టట్లనిపించేది. ఆయన తన సంస్కృత పాఠశాలను ఇంకా నడుపుతూనే వున్నారు. కాని ఆయన అధ్యాపన పద్ధతికి అంతరాయం కలుగుతూ వచ్చింది. కారణమేమంటే ఆయన శ్రీకృష్ణుని మినహాయించి ఆయన మరే విషయాన్ని నిరూపింపలేక పోయేవారు. ఆయన శిష్యులెన్నాళ్లని, ఎప్పుడూ వ్యాకరణాది పాఠ్య విషయాల్ని మఱచిపోయి తమ గురువుల నుంచి శ్రీకృష్ణతత్త్వం మాత్రం వింటూ కూచుంటారు? జనం, లోపల లోపల ఉడికి పోతోంది. మెల్లిమెల్లిగా ఆయనను గురించి నేరాలు చెప్పడం ప్రారంభించారు. కాని ఆయనపైన వీటి ప్రభావమేమీ పడడంలేదు. విశ్వంభరుడు, శ్రీకృష్ణుని విడిచి పెట్టి మరో విషయాన్ని గురించి ఆలోచింపనే లేడు. చిట్ట చివరికి బడి తలుపులు మూతలు పడ్డాయి.

ఆయన ఉత్సాహం పెల్లురేగినప్పుడు, మూర్ఛవంటి ఒకనొక స్థితిలోకి ఒక విధమైన భావ సమాధిలోకి ఆయన ప్రవేశించేవారు. అటువంటి అనుభూతులు తఱచూ కలగడం మొదలు పెట్టి, ఒక కొంతకాలానికి అట్టి సమాధి దశలు ఆయన జీవితంలో శాశ్వత భాగంగా ఏర్పడిపోయినాయి. తన భక్త్యుద్రేకానికి, ఓ రూపం కల్పించడాని కాయన కెంతో కాలం పట్టలేదు. ఆయన సంకీర్తనలను, ఉపాస్య

దేవతను గురించిన బృంద గానంగా, స్తుతిగా, ఆహ్వానంగా ఏర్పాటు చేశారు. ఈ సంకీర్తన పద్ధతి జనాన్ని ఆకర్షించింది. రోజురోజునకూ, వాటిలో, పాల్గొనేవాళ్ల సంఖ్య పెరిగిపోయింది. క్రమంగా ఈ పద్ధతి, నగర సంకీర్తనంగా, వీధులపై జనమంతా కలిసి ఊరేగుతూ పాడే పద్ధతిగా, రూపొందింది. తన వినూత్నమైన ఈ మత ప్రచారానికి, ఈ నగర సంకీర్తనలు, భజన మండలులు ఎంతో ఉపయోగించాయి. వీనిలో చైతన్యులు సంపూర్ణంగా భావుకతామగ్నులై పరవశించి పోయేవారు. ఆయన తన సార్వలౌకికమైన ప్రేమను కృష్ణారాధన రూపంగా అభివ్యక్త మొనరించారు. ఈ సార్వలౌకికము, సార్వకాలికమూ అయిన ప్రేమ తత్వాన్ని వెల్లడించుటే చైతన్యుల సందేశము, ఆయన లోకాని కిచ్చిన ఉపదేశమున్నూ. వంగ దేశంలో చైతన్యులు ప్రచారం చేసిన వైష్ణవ మతం యొక్క సామాజిక పక్షంలో ఈ అంశాలు ఇమిడి వున్నాయి. 1. ఈశ్వరుని దృష్టిలో మానవ సాధారణుని ఏకత్వం 2. భక్తి యందు నిహితులై వున్న సేవా ప్రేమ భావాలు, 3. ఈశ్వరోపాసన యందు సర్వజాతి గత బంధనాలూ, నియమాలు, లోపించి పోవుట, చైతన్యుని సార్వదేశికమూ, సార్వభౌమికమూ, అయిన ప్రేమ ఆయన గొంతు విప్పి పాడే మధుర మోహనములైన గీతాల్లో ముఖరితమైంది. అశేష జనానీకం ఆ గీత మాధురీ లహరిలో తమకంత నూధురులను కూడ సమ్మిళితం చేసేవారు. చైతన్యుల ద్వారా ఆరంభింపబడిన ఈ గాన సంకీర్తన పద్ధతి, చాలా వరకు జనానీకంలో వైష్ణవ మతానికి ప్రచార ప్రేమలు కలుగ జేయడానికి దోహద మిచ్చింది.

లోగడ చెప్పనే చెప్పాం - మొదటి రోజుల్లో మత భావాతిరేకంతో విశ్వంభరుడు మైమరచి పరవళ్లు తొక్కే దినాల్లో, జనమంతా అతన్ని పిచ్చెక్కిన వానిగా భావించేది. ఆయన తల్లి, ఆయన కొత్తగా చేసికొన్న భార్య, చాలా చింతా గ్రస్తులై వుండేవాళ్ళు., ఆయనలో వచ్చిన విపరీతమైన మార్పును చూసి. కాని పట్టణంలోని వైష్ణవ బృందానికి, ఆదరణీయుడైన అద్వైతాచార్యులకు, ఈ మార్పులోని అసలు తత్త్వమేమిటో బోధపడింది. వృద్ధులైన మత పెద్దలంతా, ఉన్మత్తుడుగా విశ్వంభరుడు నడిచే నడత అంతా, తనలోని ధార్మిక ఆవేశాన్ని తీవ్రంగా అభివ్యక్తం చేసే తీరు తప్ప, వేరే ఏమీకాదని తెలుసుకున్నారు.

అద్వైతాచార్యులు, యువకుడైన ఈ కృష్ణ భక్తుని యెడల, ఉత్సాహం, అనురాగం ప్రదర్శించేవాడు. జలధరపండితుని కుమారుడు శ్రీవాసుడు కూడ

విశ్వంభరుని గూర్చి మెచ్చుకోసాగాడు. ఈ విధంగా, అద్వైతాచార్యులు శ్రీవాసుడు, గదాధరుడు, వక్రేశ్వర పండితుడు, శుక్లాంబరుడు, గంగాదాసు మొదలైన వాళ్లు కలిసి విశ్వంభరుని మొదటి అనుయాయి మండలిగా ఏర్పడ్డారు. నవ ద్వీపంలోని ఇంచుమించు ధర్మ ప్రవణులైన వైష్ణవులందరు, అద్వైతాచార్యుల నాయకత్వం క్రింద, విశ్వంభరుని సర్వాత్మనా అంగీకరించి హర్షించారు.

వైష్ణవ సముదాయాన్ని సహజంగానే విశ్వంభరుడు అతని సంకీర్తన సభలూ, ఆకర్షింపగలిగాయి, కాని ఇతర జనంలో సుముఖులూ, విముఖులూ, రెండు రకాల వారు వుంటూ వచ్చారు. సంప్రదాయబద్ధులైన బ్రాహ్మణులు, నాటి ఈ మత భావనలను, ఈ అసంయతమైన సామూహిక గాన పద్ధతిని, తమ భావాలను వ్యక్త పరిచే ఆంగికాభినయాలను, బహిరంగంగానే, తక్కువ చూపుతో ఈసడించుకునేవాళ్ళు.

విశ్వంభరుని నాయకత్వం క్రింద నడిచే యీ నవీన ధార్మికాందోళనం, పట్టణంలోని జన సామాన్యాన్ని, అంతకంతకీ ఆకర్షించ సాగింది. శ్రీవాసుని ప్రాంగణంలో ప్రారంభంకాబడ్డ భక్తుల యీ నిజోపాసనా పద్ధతి క్రమక్రమంగా వ్యాపించి, త్వరలోనే నవద్వీపంలోని వీధుల్లో సామూహిక కీర్తన మండలులుగా నలుదెసలా, భక్తి గాన మాధురులను తరంగింపచేయ మొదలు పెట్టింది.

మెల్లిమెల్లిగా, ఆయన నాయకత్వం క్రింద నడుస్తూ వున్న ఈ ధార్మికాందోళనం నాటి అధికారుల దృష్టిలో కూడ పడింది. ఈ పద్ధతి, వాళ్ల కంగీకారంగా లేదు. ఇక ముందు చెప్పబోయే సంఘటనలను చక్కగా అర్థం చేసికోవాలంటే, నాటి రాజకీయ పరిస్థితులను మనం విహంగావలోకనం చేయవలసి వుంటుంది. కారణం, చైతన్యుల వైష్ణవ సంప్రదాయ ప్రచారానికి వానికీ ప్రత్యక్ష సంబంధముండడమే. విమతస్థులైన పరిపాలకులు, విమతస్థులైన అధికారులూ, జనంలో వ్యాప్తి పొందుతూ వున్న యీ ధార్మిక జాగృతి పట్ల ఉదాసీనంగా వుండి పోయారు. (వంగ దేశానికి ఆ రోజుల్లో గౌడ దేశమని ప్రసిద్ధి). గౌడ దేశం సుల్తాను, సైయదు వంశానికి చెందిన హుసేన్ షా. హుసేను షారాజ్యంలో వైష్ణవ ధర్మాన్ని ఉపదేశించడంలో, చైతన్యులు, ఆయన సహచరులూ, ఎన్నో విధములైన కడగండ్లకు పాల్పడవలసి వచ్చింది. చైతన్యులు సన్న్యాసాశ్రమ స్వీకారం చేసిన పిమ్మట తమ జన్మ స్థానం వదిలివేసి, ఒరిస్సాలోని హిందూ రాజ్యానికి వలస పోయి, అక్కడ చాలా కాలం నివసించడాని కిదే ముఖ్య కారణం.

ఆనాటి శిలా శాసనాల ద్వారా సుల్తాన్ హుసేను షా మత పిచ్చిగల వాడేగాని, ఆయన మతోన్మాదం, సికందర్ లోడీ, ఫిరోజ్ షా తుగ్లక్, ఔరంగజేబు, వీళ్ల స్థాయికి చెందినది కాదు. జహానాబాను శాసనాల్లో హుస్సేనుషాను" ఎవని రాజ్యంలో ఇస్లాం మూడు పువ్వులూ ఆరు కాయలుగా వ్యాప్తి చెందుతోందో" అని అభివర్ణింపబడ్డాడు. ఇతర సుల్తానుల సమయంలో అతని ఏల్బడిలో వంగ దేశంలో ఎక్కువ మసీదులు నిర్మించబడ్డాయి. హుసేను షా శాసన కాలంలో, వంగ దేశం పరిస్థితి ఎల్లా వుందో వర్ణిస్తూ, పోర్చుగీసు యాత్రికుడైన బర్బోసా ఇల్లా రాశాడు.

వంగ దేశ రాజు యొక్క రాజ్యంలో ఎంతో మంది హిదెన్లు (అనగా మూర్తి పూజకులైన హిందువులు) ఉంటు వుండేవారు. వాళ్లల్లో ఎంతోమంది ప్రతి దినమూ, రాజు యొక్క ఆయన అధికారుల యొక్క ఆదరాభిమానాలు పొందడానికి గాను ముసల్మానులై పోతున్నారు."

గయ నుంచి తిరిగి వచ్చిన వెంటనే 'నిమాయి' పూర్తిగా మారిపోయిన మనిషిగా తయారైనాడు. అప్పటినుంచి ఆయన భక్తి సమర్పిత జీవితము, వ్యక్తిత్వమూ, కృష్ణ భక్తి ప్రచారానికి ఒక ప్రేరణాదాయకమైన ఉజ్వల ఉదాహరణంగా పరిణమించింది. అటు తర్వాత అద్వైతాచార్యుల నాయకత్వం క్రింద వున్న వైష్ణవ ముడలియే గాక ఇతర భక్త బృందం గూడ 'నిమాయి' దీక్ష తీసుకోక పూర్వమే ఆయన దగ్గిరకు రాక పోకలు సాగించారు. వీరిలో ప్రముఖుడు నిత్యానందుడు. ఇతను వంగ దేశంలో నాటి వైష్ణవాందోళనను వృద్ధిపరచి వికసింపచేయడంలో అగ్రభూమిక వహించినవాడు.

నిత్యానందుడు చైతన్యుని కంటె ఎనిమిదేండ్లుపెద్దవాడు. వంగదేశమందలి పడమటి వైపున నున్న 'వీరభూమి' జిల్లాలోని ఏక చక్రమనే గ్రామంలో వుంటూ వుండేవాడు. నిత్యానందుడు పూర్వాశ్రమంలో అవధూత సన్యాసిగా వుండే వాడని, బహుశః ఏదో తాంత్రిక సంప్రదాయానికి చెందిన వాడనీ, విశ్వసింపబడుతోంది. చాలా చిఱుతప్రాయంలోనే అతను గృహత్యాగం చేసి పరివ్రాజకుడయ్యాడు. పరివ్రాజకుడుగా అతను సుదూర భూములను ఉత్తర దక్షిణ భారత ప్రాంతములంతటనూ, చాలా సంవత్సరాలు యాత్రా సంచారం చేశాడు.

ఆయన తన సంచార క్రమంలో నవ ద్వీపానికి వేంచేసిననప్పుడు నిమాయి గడుపుతూ వున్న ధర్మబద్ధ జీవితాన్ని గురించి విన్నాడు. ఆ పిమ్మట ఆయన నవ ద్వీపంలో నిమాయిని కలుసుకొన్నాడు. నిత్యానందుడు రూపు రేఖలను బట్టి, చిన్నప్పుడే సన్యాసం పుచ్చుకొని ఇల్లు వెడలి పోయిన, నిమాయి అన్న విశ్వరూపుని వలె వుంటాడు. అది యెంతటి చిక్కని సాదృశ్యమంటే, నిమాయి తల్లి, నిత్యానందునికి, గృహత్యాగం చేసి వెళ్లిపోయిన విశ్వరూపుడే తిరిగి వచ్చినట్లుగా, వాత్సల్య పూర్ణమైన స్వాగత వాక్యాలు పలికింది. కృష్ణానంద కవిరాజు కథనానుసారం, చైతన్యులు నిత్యానందుని "పెద్దన్న" అనే పిలిచేవాడు. చైతన్యునితోటి ఆయన సమావేశాన్ని మనం చరిత్రాత్మకమైనదిగా పరిగణింపవచ్చు. ఇరువురి మధ్య నెలకొన్న ఈ సంపర్కము గౌడీయ వైష్ణవ సంప్రదాయం చరిత్రలో మిక్కిలి మహత్త్వ పూర్ణమైనదిగా పరిణమించింది. కొన్ని యేండ్ల తర్వాత చైతన్యులు వంగ దేశం వదిలి ఇతర ప్రాంతాలకు వెళ్లిపోయినప్పుడు, వంగ దేశంలో సంప్రదాయ ప్రచారం కొనసాగించే బాధ్యత ముఖ్యంగా నిత్యానందుని భుజస్కంధాల పైననే పడ్డది.

దాదాపు ప్రతి సంవత్సరమూ, నిత్యానందుడు, చైతన్యుల మిగతా శిష్య వర్గంతో పాటు, వర్షాకాలంలో చైతన్యులను కలిసికోవడానికని వెళుతూ వుండేవాడు. అట్టి సందర్భాల్లోనే ఆయన, వంగ దేశంలోని వైష్ణవ సంప్రదాయ ప్రచార ప్రగతులను గురించి, చైతన్యులతో పరామర్శ సలిపి, ఆయన అభిప్రాయాన్ని సేకరిస్తూ వుండేవాడు. చైతన్య నిత్యానందుల మధ్య నున్న ఈ పరస్పర సంబంధం జీవిత పర్యంతం అవిచ్ఛిన్నంగా వుంది. నవ ద్వీపంలోని ప్రథమ సమాగమంలోనే ఇరువురూ పరస్పరాకర్షణకు లోనైనారు. వారిరువురు తమ జీవిత లక్ష్యమొక్కటే అని గమనించారు. ఈ యావత్తు సందర్భాలను గమనిస్తే, చైతన్య, నిత్యానందుల పరస్పర పరిచయం ఈశ్వరోద్దిష్టమని తెలుసుకోలేక పోం.

నవ ద్వీపంలో చైతన్యునితోటి ప్రథమ సమావేశానంతరం, నిత్యానందుడు చైతన్యుల ముఖ్య సహచరుడుగా ప్రబల ప్రశంసకుడుగా మారాడు. చైతన్యులు వంగభూమి వదిలి వెళ్లిన తరువాత బెంగాలులో వైష్ణవ సంప్రదాయంలోని సామాజిక పక్షాన్ని ఆచరణలో పెట్టడానికి నిత్యానందుడు పూనుకొన్నాడు. ఆయన పిమ్మట, ఆయన పుత్రుడు వీరభద్రుడు అస్పృశ్యులను కూడ వైష్ణవ

మతంలోకి ఉదారబుద్ధితో రానిచ్చి, హిందూ సమాజంలో సంఘ సంస్కార ప్రక్రియను ముందుకు సాగించాడు. చైతన్యుల అనుయాయుడుగా నిత్యానందుడు, సహిష్ణుతతో ఔదార్యంతో కూడి వున్న నవీన వైష్ణవానికి సంబంధించిన సామాజిక సమస్యలను పరిష్కరించడంలో మహనీయమైన భూమికను నిర్వహించాడు. అద్వైతాచార్యులు చాలా వృద్ధుడు అయిపోయినాడు. అంచేత చైతన్యులు వంగభూమి వదిలి, ఒరిస్సాకు వెళ్లిపోయినప్పుడు, నిత్యానందుడే, వంగ వైష్ణవుల నాయకత్వాన్ని వహించాడు.

చైతన్యులు నిత్యానందుని పెళ్లి చేసికొని, వంగ దేశంలోనే వుండి పామ్మనమనీ ధర్మకార్యాలు నిర్వహిస్తూ వుండమనీ చెప్పారు. కాని యీ విధంగా సలహా యిచ్చింది చైతన్యులు శాశ్వతంగా పురిలో ఉంటూ వున్నప్పుడు. కాని దీనికంటే ముందు, చైతన్యుడు వంగ భూమిలో గడిపిన చివరి దినాలను గురించిన వివరణ మీయవలసి యున్నది. ముఖ్యంగా అతని దీక్షా గ్రహణం గురించి, అటు పిమ్మట అతనిలో ఏర్పడ్డ వైరాగ్యాదికం గురించిన్నీ.

## సన్న్యాస దీక్ష

చైతన్యులు గయ నుంచి నవ ద్వీపానికి తిరిగి రావడానికి, ఆయన సన్న్యాసాశ్రమం స్వీకరించడానికి మధ్య వ్యవధి చాలా తక్కువ. మహా అయితే ఓ ఏడాది! కర్ణపుర కవి రచించిన సంస్కృత మహా కావ్యంలో ఈ నడిమి కాలాన్ని గురించి స్పష్టంగా కిందరాసిన తీరుగా ఉటంకించబడి వుంది.

"నిమాయి గయ నుంచి పుష్య మాసంలో తిరిగి వచ్చాడు. మరుసటి నెల అంటే మాఘమాసంలో ఆయనకు దివ్యోన్మాదం ఆరంభమైంది. దీనికి నాలుగు నెలల తరువాత మరుసటి సంవత్సరం వైశాఖ మాసంలో ఆయన సంస్కృత పాఠశాల మూతపడింది. ఆయన తరువాతి ఎనిమిది నెలలు అంటే జ్యేష్ఠం నుంచి పుష్య మాసం దాకా భగవత్సంకీర్తనంలో గడిపారు. తరువాతి నెల మాఘమాసంలో ఆయన తురీయాశ్రమ స్వీకారం చేశారు". చైతన్యుని జీవిత చరిత్ర రాసిన ఇద్దరు ప్రధాన రచయితలు- బృందావనదాసు, కృష్ణదాస కవి రాజు- గడువు ఒక ఏడాది అని రాశారు.

నిమాయి సంపూర్ణంగా ఈశ్వరోన్మత్తుడై నాడు. కృష్ణుడు తప్ప ఆయనకు మరో విషయమేమీ గోచరించడంలేదు. ఆయన లౌకికాకర్షణల నుంచి పూర్తిగా

విరక్తులైనారు. ఉపాధ్యాయ వృత్తి ఏ మాత్రమూ సాగకపోవడం చేత ఆయన తమ పాఠశాలను మూసేశారు. శ్రీవాసుని ప్రాంగణంలో మృదంగ తరంగ ఘోషల మధ్య సామూహికమైన భక్తి సంకీర్తన గానంలో తన్మయత్వం చెంది వారు తమ రాత్రులు గడిపేవారు. వారి ధర్మోపదేశంలో జాతి గత భేదమేమీ లేదు. అంచేత జనులు చైతన్యుల కీర్తనమండలిలో ఎక్కువెక్కువగా చేరసాగారు.

ఆయన కృష్ణోపదేశం, సర్వులకు సమానంగా పంచి యిచ్చిన కరుణాప్రేమలు, జన సాధారణాన్ని ఆయన ఉన్నత ఆదర్శం వైపు ఆకర్షించాయి. ఆయన వ్యాప్తికి తెచ్చిన సామూహిక కీర్తన పద్ధతి నవద్వీపవాసుల జీవితాల్లో అవిభాజ్యమైన అంగమైపోయింది. ఇప్పుడే కీర్తనలు కేవలం శ్రీవాసుని ప్రాంగణంలో పాడబడే పాటలుగా గాక నడి వీధుల్లో నగర సంకీర్తనల రూపం దాల్చ నారంభించాయి. అంతేగాక కృష్ణ ప్రేమోపాసనా పద్ధతిని ఇంటింటా ప్రసరింపజేయ మొదలిడినాయి. చైతన్యుల నవోదిత ధర్మం, సర్వులకూ అందుబాటులో వున్న ఆయన ప్రేమోపాసనా మార్గం, 'నామ సంకీర్తన' పద్ధతి ద్వారా, భావ విహ్వలత కలిగిస్తూ జనంలో ప్రచారం పొందనారంభించింది. భావ విహ్వలత, ధార్మికోన్మాదంతో నిండి పరాకాష్ఠకు చెందిన భావ దశలో చైతన్యు లున్నప్పుడు, నిత్యానందుడు ఆయనకు నిత్య సహచరుడుగా, కంటిలోని వత్తిగా సంచరించాడు.

ఈ ఆధ్యాత్మికాందోళనం, విధర్మీయుల ఏల్బడిలో శాసనాన్ని న్యాయపాలనాన్ని నిర్వహించే స్థానికుడైన కాజీకి ఎంత మాత్రం మనస్సుకు సరిపడిందికాదు. కొత్తగా లోకరంజకమైన ఈ ధార్మికాందోళనం వైపు కాజీ చూపుతున్న నిరసన భావానికి అనేక ఉదాహరణలను ఈయవచ్చు. కాజీ, చైతన్యుల ఇచ్ఛానుసారం నడపబడే నగర సంకీర్తనలను ఆపవలెనని తలచినప్పుడొక నాటకీయమైన సంఘటన తటస్థించింది.

నవ ద్వీపంలోని కాజీ వీధుల్లో ఈ కీర్తనలూ, భజనలూ, ఏమీ పనికి రావని నిషేధం చేశాడు. అందుకు జవాబుగా, చైతన్యులే స్వయంగా, ఆజ్ఞోల్లంఘనం చేసి వీధుల్లో సంకీర్తన గానం జరిగేటట్లు చూడాలని నిశ్చయించుకున్నాడు. ఆ రాత్రి ప్రదర్శనంలో అందరినీ పాల్గొని కీర్తన బృందంతో సహకరింపవలసిందిగా ఆహ్వానించాడు. నవద్వీప చరిత్రలో ఇదియొక మఱువరాని ఘట్టము. ఆకర్షకమైన చైతన్యుల వ్యక్తిత్వానికి వశీభూతులై వందలాది జనం ఆయన కీర్తన బృందంలో

వచ్చి చేరారు. జనం కాజీ ఆజ్ఞ నుల్లఘించి, బృందంతో పాటు వీధుల్లోకి గుంపులుగా రావడంతో గగ్గోలు పుట్టింది. కీర్తన బృందం, ముందుకు సాగిన కొలదీ, అందులోకి మరింత జనం వచ్చి చేరడం ప్రారంభించారు. చైతన్యులను విరోధించే వాళ్ల సంఖ్య చాలా తక్కువ అని నిరూపించడానికి అసంఖ్యాకంగా జన సమూహం వీధుల్లోకి వచ్చి చేరింది. చైతన్యుల ఈ విశాల కీర్తన బృందం కాగడాలతోబాటు 'పరడాంగా' 'గరీగాభా' మొదలైన పేటల్లో ఊరేగడాన్ని గురించి ఎన్నో వివరాలు, పేరు పేరున 'చైతన్య చరితామృతం'లో వర్ణింపబడ్డాయి. ఎన్నో వీధుల గుండా ఊరేగి, ఈ బృందం కాజీ నివాస స్థానాన్ని చేరుకుంది. కాజీ ఎన్నడూ అనుకోలేదు- చైతన్యులింత మంది అనుయాయులను పోగు చేయగలుగుతాడని – అందుచేత అతను నిరుపాయుడై తన నిషేధాజ్ఞ నుల్లంఘించిన ప్రతి వ్యక్తిని శిక్షించాలనే ఉద్దేశం వదులుకోవలసి వచ్చింది. ఆయన చైతన్యులను సముచితంగా ఆదరించాడు. అక్కడికక్కడే అంతటితో ఆ సమస్య ముగిసిపోయింది.

ఇంతకు ముందే చెప్పినట్లుగా చైతన్యులు, తమ సమాజంలోని సంప్రదాయ నిష్ఠులైన వర్గాలను కూడా ఎదుర్కోవలసి వచ్చింది. వాళ్లు, చైతన్యుల కృష్ణ భక్తిని 'సంగీత ప్రేమ' ఇది భక్తి కాదూ పాడూ కాదు అంటూ అవహేళన చేసేవాళ్ళు. కాని చైతన్యులు విచలితులు కాలేదు. ఆయన మనస్సులో విరోధులపై ఎటువంటి ద్వేషభావంగాని, దురభి సంధిగాని ఏర్పడలేదు. ఆయన సహిష్ణుతకు, ప్రేమ భావానికి సజీవ రూపంగా నిలబడ్డారు. ప్రత్యక్షంగా తననుగాని, తన సహచరులనుగాని విరోధించేవాళ్లను సైతమాయన ప్రేమమయ దృష్టితోనే చూసేవారు. చైతన్యుల నడవడికలోని యీ గొప్పదనం, ముఖ్యంగా బోధకు, ఆచరణకు ఏర్పడ్డ ఈ ఏకరూపత, మెల్లి మెల్లిగా, ఆయన విమర్శకులపై, విరోధులపై గూడ ప్రభావ ముద్ర వేయసాగింది.

ఆయనలోని ఋజుత్వం, ఆయనగారి ఆధ్యాత్మిక వ్యక్తిత్వం- ఈ గుణాల వల్ల, ఆకర్షితులై దుష్టులుగూడ ఆయన ప్రభావ వలయంలోకి రాసాగారు. 'జుగాయి' 'మధాయి'ల కథ ఇందుకు నిదర్శనం. ఈ యిరువురు నవ ద్వీపంలో తమ దౌష్ట్యానికీ, ఇతరుల యెడల తమ క్రౌర్యానికి మిక్కిలి కుఖ్యాతి సంపాదించు కొన్నవారు. ఒక రోజు, మత్తెక్కిన స్థితిలో వీళ్లిద్దరూ చైతన్యుల పైననూ, నిత్యానందునిపైననూ విఱుచుకు పడ్డారు. కల్లు సీసా పెంకు ఒకటి తీవ్రంగా

గుచ్చుకొనిపోయి నిత్యానందుని తలపైన, నెత్తురు ప్రవాహం కట్ట నారంభించింది. కాని తీవ్రమైన ఈ గాయాన్ని లెక్క సేయకుండా, చైతన్య నిత్యానందులిద్దరూ, దురాక్రమణ పరులపైన దయా ప్రేమ భావాలనే ప్రసరింపజేశారు. దాంతో వాళ్లిద్దరూ, చైతన్యమతావలంబులై దౌష్ట్యానికి తిలాంజలు లిచ్చారు. ఈ సంఘటన పిమ్మట వాళ్లిద్దరూ వినమ్రతకూ, సౌమ్యానికీ ఉదాహరణ స్వరూపులై, భక్తి మార్గాన్ని చేపట్టారు.

చైతన్య నిత్యానందుల ప్రేమమయ ప్రభావం వల్ల దుండగీడులలో జరిగిన ఈ స్వభావ పరివర్తన కథ దూరదూరాలకు ప్రాకిపోయింది. ఈ విధంగా చైతన్య సంప్రదాయం బెంగాలులోని భక్తి ఆందోళన చరిత్రలో ఒక నూతనాధ్యాయం ప్రారంభించింది. మొదటనే చెప్పి వున్నాం- నవ ద్వీపంలోని సంప్రదాయ బద్ధమైన పాండిత్యాభిమానం గల విద్వాంసుల నాయకత్వం క్రింద ఎంతో పలుకుబడి గల ఒక వర్గం, చైతన్యుని ద్వారా ప్రతిపాదితమైన నవ వైష్ణవ మతాన్ని ప్రతిఘటించడానికి కృత సంకల్పమై వున్నదని- ఆ వర్గం, తన అహంకార బుద్ధికి లోనై, కేవలం భావనాపరమైన కృష్ణభక్తిని నిందించడం, వెక్కిరించడమేగాక, ఈ భావనా భక్తి ప్రచారానికి అడ్డు తగలడానికి కూడా పూనుకొన్నది. కాని చైతన్యులు తమ ధైర్యాన్ని విడనాడలేదు. వారు సార్వభౌమికమూ, సహన శీలమూనైన తమ ప్రేమ మార్గానికి, ఆ వర్గాన్ని కూడా త్రిప్పవలెనని సంకల్పించారు.

కాని అప్పుడప్పుడూ, వారి మనస్సులో, సర్వస్వమూ విడనాడి సంపూర్ణంగా సన్న్యాసి జీవితాన్నే గడపవలెననే అంతఃప్రేరణ అంతకంతకూ అనివార్యంగా కలగ నారంభించింది. సన్న్యాసగ్రహణం వెనుక మరో ముఖ్యమైన కారణం కూడా పని చేసింది. 'చైతన్య చరితామృతం' ప్రకారం, ఆయన సాంసారిక జీవన బంధనాలనన్నింటిని తెగత్రెంపులు చేసేసి, తమ మతాన్ని అంగీకరింపని వాళ్లను, మనసా, వాచా, కర్మణా జయించవలెనంటే, సన్న్యాస దీక్ష తీసుకోకతప్పదనే నిశ్చయానికి వచ్చారు. 'చరితామృతం'లోని వివరణ ప్రకారం ఆయన పలికిన పలుకులివి. "నేను ఈ మనుష్యులను ఉద్ధరించాలంటే సన్న్యాసి జీవితం గడపవలసి వుంటుంది. నన్ను సన్న్యాసిగా చూసినప్పుడు వారు నాకు నమస్కరిస్తారు. నమస్కారం వల్ల వాళ్ల పాపాలు పరిహరింపబడతాయి, వాళ్ల హృదయాల్లో భక్తిభావం ఉదయిస్తుంది..."

చైతన్యుల సన్న్యాస దీక్షకూడ స్మరింపదగిన ఘట్టమే. నిండు యౌవనంలో ఆయన సన్న్యాస స్వీకారం చేస్తానని చెప్పగానే ఆ ప్రాంతంలో చెలరేగిన ప్రతి క్రియలను బట్టి, అక్కడి జనంలో వారెంత ప్రేమపాత్రులో, వారెంతగా సమాదరణీయులో మన కర్థమవుతుంది.

చైతన్యులు తురీయాశ్రమం స్వీకరించే సందర్భంలో నవ ద్వీపంలో ఒక విషాదాచ్ఛాదితమైన దృశ్యమేర్పడింది. బజారులోని అంగడులలో వ్యాపారమేమీ సాగలేదు. ఎంతోమంది విలపించసాగారు. రూఢివాదులైన చాదస్తులు కూడ చైతన్యుని ఇంతకాలమూ తాము ప్రతిఘటిస్తూ వస్తూ వున్నందుకు పశ్చాత్తాప పడసాగారు. వారు నాటి సంభాషణలలో ప్రధాన వస్తువైనారు. ఆ గడుసరి పడుచుదనంలో నిమాయి సన్న్యాసం స్వీకరించడాన్ని గురించి వందలాదిగా జానపద గేయాలు కరుణాప్లావితాలైనవి, నేటికీ వంగభూమిలో విరివిగా పాడుకుంటూనే వుంటారు. తన ఏకైక పుత్రుని సన్న్యాస స్వీకరణ, చైతన్యుల ముదుసలి తల్లి యెదలో ఎన్ని బాకులు గ్రుచ్చిందో ఊహింపరాని విషయం. 'చైతన్య భాగవతము' ప్రకారం నిమాయి సన్న్యాసం స్వీకరించినప్పుడు తల్లి శచీదేవి, పన్రెండు రోజుల విరామంగా ఉపవాసవ్రతం పట్టింది. ఆమె దుఃఖం మరీ హృదయ విదారకం, ఆమె తానై, సన్న్యాస భిక్షను వేడినప్పుడు నిమాయికి స్వీయ స్వీకృతిని తెలియజేయవలసి వచ్చింది. ఈ పట్టున ఆమె 'బిడ్డకు తగ్గ తల్లి' అనిపించుకున్నది.

ఆయన నవ యువతియైన పత్ని విష్ణుప్రియకు కూడ ఏతా దృశ్యమైన గౌరవమే లభించాలి. 'అద్వైత ప్రకాశం'లో నాటి నుంచి ఆమె పూనిన తపఃపూతమైన జీవితం వర్ణింపబడింది. ఆమె బహుదీర్ఘ జీవిగా బ్రతికింది. సుమారు పతిగతించిన పిమ్మట కూడా ఏభై సంవత్సరాలపాటు జీవించి వుంటుంది. ఇందుకు తార్కాణమేమనగా ఖేతడీ (ఉత్తర బెంగాలు)లో జరిగిన ప్రసిద్ధమైన వైష్ణవోత్సవంలో ఆమె పాల్గొన్నది. ఆ ఉత్సవంలో నరోత్తమ ఠాకురు శాస్త్రీయ పదావళి కీర్తనలుగా పాడడం ప్రవేశపెట్టాడు. తన జీవిత మంతా 'విష్ణుప్రియ' చైతన్యునికి అనురూపయైన పత్నిగా, భక్తి సంయమాలతో నడుచుకొన్నది.

ఆశ్రమ స్వీకార సమయంలో 'నిమాయికి' కేవలం ఇరువది మూడేళ్ల వయస్సు. జనవరి 1510 (శక సంవత్సరం, మాఘమాసం 1431)లో నవద్వీపానికి కొంచెం

దూరంలో గంగ కావలి ఒడ్డున 'కటవా' అనే స్థానంలో దీక్షా గ్రహణం జరిగింది. ఆ రోజుల్లో 'కటవా'లో పేరు ప్రఖ్యాతులు గడించుకొన్న వంగ సన్న్యాసి కేశవ భారతి వుండేవాడు. ఆయనే నిమాయికి ఆశ్రమ గురువులు. కేశవ భారతీ స్వాములవారు. శంకర సంప్రదాయంలోని 'భారతీ' పరంపరకు చెందిన వారు.

కాని దీక్షకు పూర్వమందుగాని, పరమందుగాని 'నిమాయి' భక్తి ధోరణికీ కేశవ భారతీ స్వాముల దార్మిక విచారణ సరణికీ, ఎక్కడా పొత్తు కలవలేదు. నిమాయి ఆయన ద్వారా దీక్షా గ్రహణం చేయడంలోని ముఖ్యోద్దేశం, ఆయన అక్కడ వున్న సన్న్యాసుల్లో సుప్రసిద్ధుడగుట, సన్న్యాస స్వీకారానికి సంబంధించిన విధులనన్నింటినీ కేశవ భారతి చక్కగా నిర్వహింపగలరనే నమ్మకమూ కావచ్చును.

నిమాయి సన్న్యాసి అయి, శ్రీకృష్ణ చైతన్యులనే పేరు వహించాడు. పిమ్మట లోకంలో ఆయన, చైతన్యులనే సంక్షిప్త నామంతో వ్యవహరింపబడ్డారు.

దీక్షా గ్రహణ సమయంలో 'నిమాయి' ముఖ్య అనుయాయులైన నిత్యానందుడు, చంద్రశేఖరుడు ముకుందదత్తు అనే వారు ఉపస్థితులై వున్నారు. చైతన్యులు లౌకిక ప్రలోభనలకు మూలాలైన చిహ్నాలన్నింటిని పరిత్యజించి వేశారు. ఆయన సుందర కేశపాశము కత్తిరింపబడిన వేళ, కట్వాలోని జనం కళ్లు చెమ్మగిల్లినాయి అని అంటారు. ఆ పిమ్మట నిమాయి సంపూర్ణంగా సన్న్యాసి అయిపోయినారు. ఆయన సన్న్యాస జీవితం ఆరంభమైంది.

## సన్న్యాసం – అటు పిమ్మట

సన్న్యాసియైన చైతన్యులు కట్వానుంచి తిరిగి నవ ద్వీపంలో అడుగు పెట్టలేదు. ఆయన వంగభూమి వదిలి వేయడానికే నిశ్చయించారు. ఈ నిర్ణయం పట్ల ఆయన శిష్యవర్గం సహచరులూ, ఆశ్చర్య చకితులయినారు. ఎంత ప్రయత్నించినా, చైతన్యులు వంగ భూమిలో నవ ద్వీపంలోగాని, మరో చోటగాని ఉండడానికి సమ్మతించలేదు.

చైతన్యులు కట్వా నుంచి కొంతకాలంపాటు, వృద్ధ వైష్ణవ విద్వాంసుడు అద్వైతాచార్యుని ఇంటికి శాంతిపురం వెళ్లాడు. అసలు ఆయన, కృష్ణ భగవానుల శైశవ లీలా భూమియైన బృందావనానికి వెళ్లాలని సంకల్పించుకున్నాడు. చైతన్యులు రాధవలె అనన్యభక్తితో శ్రీకృష్ణ భగవానుల పూజాధ్యానాదికం అత్యంత నిష్ఠతో చేస్తూ వుండేవారు. కాని ఆయనకు తన నివాస స్థానాన్ని మార్చుకోవలసి

వచ్చింది. తన తల్లి కోరిక ననుసరించి ఒరిస్సాలోని జగన్నాధ ధామమైన 'పురి' నివాస స్థానంగా ఎన్నుకోవలసి వచ్చింది. ఆయన తల్లి శాంతిపురంలో వుంటూ వున్నప్పుడే ఆయన నుంచి శాశ్వతంగా వేరై పోయింది.

సన్న్యాస గ్రహణం చేసిం తరువాత, చైతన్యులు తన అనుయాయుల నుంచి తల్లి నుంచి అభ్యనుజ్ఞకై ఒకసారి శాంతిపురంలోని అద్వైతాచార్యుల ఇంటికి వచ్చారు. ఆ సందర్భంలోనే శచీదేవి చైతన్యులతో, సుదూరమైన బృందావనానికి బదులు, పురిలో నిలుకడగా వుండపోవలసిందని తన కోరికను వెల్లడించింది. 'పురి' బెంగాలుకు సమీపం. బెంగాలు నుంచి ఎందరో యాత్రీకులు పురికి రాకపోకలు చేస్తూ వుంటారు. అక్కడ ఆయనను నవ ద్వీపంలోని ఆయన అనుయాయులు, ఇతర జనం కలుసుకుంటూ వుండవచ్చు. తద్వారా ఆయన యోగక్షేమాలు ఆయన మాతృ శ్రీకి తెలుస్తూ వుండే అవకాశముంది. అక్కడకు తీర్థయాత్రికుల రాకపోకలను బట్టి, ఆయనకూ తన తల్లిగారి క్షేమవార్తలు తెలిసే అవకాశముంది.

చైతన్యులు మాతృ శ్రీ వాంఛముందు తల యొగ్గాడు. ఆమె వాంఛను మనసా మన్నించాడు. అక్కడ సమావేశమైన వైష్ణవ బృందం సమక్షంలో చైతన్యులు 'అట్లే' అని తన తల్లికి వాగ్దానం చేశారు. శ్రీ కృష్ణ భగవానుల దివ్యస్మృతులను అడుగడుగునా, రజరజమునా నింపుకుని వున్న, బృందావనంలోని పవిత్ర స్థానాలను పునరుద్ధరించవలెననే ప్రబలమైన కోరిక చైతన్యుల కుండి వున్నది. అయితే స్వయంగా ఆ కార్యం నెరవేర్చవలెననే సంకల్పాన్ని వారు వదులుకొన్నారు. తమ శిష్యుల తలపై ఆ కార్య భారము మోపారు. సన్న్యాసం తీసుకొన్న ఓ నెల రోజుల లోపలనే చైతన్యులు పురికి ప్రయాణం అయి వెళ్లిపోయారు. వెళ్లిపోయే ముందు తమ తల్లిని, పత్నిని, శిష్య వర్గాన్ని పెద్దలైన అద్వైతాచారులకు, ఇతర శిష్యులకు అప్పగింత పెట్టారు.

నిత్యానందులు, దామోదర పండితుడు, ముకుంద దత్తు, జగదానందుడు, వీరు ఉత్కళయాత్రలో చైతన్యుల వెంటనున్నారు.

ఈ ఘట్టం క్రీ.శ. 1510 ప్రారంభంలోనిది. ఆ సమయంలో బెంగాలు సుల్తాను హుసేను షాకు, ఒరిస్సా ప్రభువునకు మధ్య యుద్ధం చెలరేగి వుంది. చైతన్యులు ఆయన నలుగురు సహచరులూ, పడవమీదుగా ఒరిస్సా వెళ్ళవలసి వుంది. ఆ కాలంలో దక్షిణ బెంగాలులో కలకత్తాకు ఇరవై అయిదు మైళ్ల దూరంలో వున్న 'ఛత్రభోగీ' అనే స్థానం, బెంగాలుకు చెందిన చివరి జనపదం. (ఇది గంగ -బెంగాలు

ఖాతం ఈ రెండిటి సంగమ స్థానంపైన, నేటి డైమండు హార్బరుకు దగ్గిరగా వుండేది) దీనికి పిమ్మట ఉత్కళ రాజ్యం పొలిమేర ప్రారంభమవుతుంది.

సుల్తాను పక్షాన, బెంగాలు యొక్క ఆసీమా ప్రాంతాన్ని ఒక తుర్క్ ఆఫ్ఘను కనిపెట్టి వుండేవాడు. అతను వచ్చే పోయే వాళ్లను చాలా ఇబ్బంది పెట్టేవాడు. కర్ణపుర కవి కృతమైన 'చైతన్య చంద్రోదయ' నాటకాన్ననుసరించి, అనేక మంది 'ఛత్రభోగ్' చేరడానికి ముందుగా ఎంతో సావధానంగా, జాగరూకంగా వుండవలసిదని చైతన్యులను హెచ్చరించారు.

కాని చైతన్యులు సలక్షణంగా ఛత్రభోగ్ దగ్గిర బెంగాలు పొలిమేరలను దాటి, ఒరిస్సా క్షేత్రం చేరుకున్నారు. పొలిమేరలు దాటేటప్పుడు సీమా రక్షకుడైన రామచంద్రఖాను చైతన్యులకు సాయపడ్డాడు. ఆ పిమ్మట తన నలుగురు సహచరులతోబాటు చైతన్యులు సముద్ర యాత్ర ద్వారా పురి చేరడానికి బైలు దేరారు.

## ఉత్కళ దక్షిణ పశ్చిమ భారతాలకు తొలియాత్ర

చైతన్యుల నలుగురు సహచరులూ, నిత్యానందుడు, దామోదర పండితుడు, ముకుందదత్తు, జగదానందుడు, వారిని 'పురి'లో ప్రవేశపెట్టి తిరిగి వెనుకకు వెళ్లిపోయారు. అప్పటి నుంచి, అనగా క్రి.శ. 1513 నుండి చైతన్యులూ, వారి వంగ అనుయాయుల మధ్య సన్నిహితమైన సంపర్కం, ప్రతి సంవత్సరమూ, వారు చేస్తూ వచ్చిన పురీ యాత్రల వల్ల నిలబడింది.

ఇంచుమించు ప్రతి యేడూ, చైతన్యుల వంగదేశం శిష్యులు జగన్నాథుని రథయాత్ర సందర్భంగా అక్కడకు వెళ్ళేవారు. అప్పుడే వారంతా చైతన్యులను దర్శించి వారితో తాత్త్విక విచార విమర్శలు జరుపుతూ వుండేవారు. కాని క్రి.శ. 1515లో చైతన్యుని భక్త బృందం, ఈ వార్షిక తీర్థయాత్ర చేయలేకపోయింది. బెంగాలు సుల్తాను హుసేను షా ఉత్కళ రాజుతో యుద్ధం సాగించాడు.

చైతన్యులు మొదట్లో 'పురి'లో చాలా కొద్ది సమయం మాత్రమే వున్నారు. కర్ణపూర కవి తన మహా కావ్యంలో చైతన్యులు పురిలో కేవలం పద్దెనిమిది రోజులున్నట్లు రాశాడు ఆయన తర్వాత వెంటనే దక్షిణ భారత యాత్ర సలిపినట్లు రాయబడి వుంది. కాని మరికొన్ని ఆకరాలను బట్టి వారు పురిలో రెండు మాసాలపాటు ఉన్నట్లు, క్రి.శ. 1510 ఏప్రిలులో తీర్థయాత్రల కోసం వెడలినట్లు తెలియవస్తోంది.

ఆయన దక్షిణ పశ్చిమ భారత యాత్రలు సుదీర్ఘములూ, సువిస్తృతములూ. వీని యందు దాదాపు రెండు సంవత్సరాలపాటు గడిచిపోయింది. కాని పురిలో వారున్న ఆ కొద్ది సమయంలోనే రెండు ప్రధానమైన సంఘటనలు సంభవించాయి. ఇవి కేవలం చైతన్యుల ఆకర్షకమూ ఆధ్యాత్మికమూ నైన వ్యక్తిత్వం విశదపరచడమేగాక, ఉత్కళ దేశంలో వైష్ణవ మార్గాన్ని వైష్ణవాందోళనాన్ని జన ప్రీతికరంగా మలచడానికి తోడుపడ్డాయి. ఈ రెండు సంఘటనల ద్వారా, ఎంతటి శక్తిమంతుడైనా, చైతన్యుల మోహకమూ ఆకర్షకమూనైన ప్రభావ ముద్రకు అంకితం కాకుండా వుండజాలడనే సత్యం, స్పష్టమవుతుంది.

మొదటి ఘటన విఖ్యాత వేదాంత శాస్త్ర పండితుడైన వాసుదేవ సార్వభౌములు అత్యంత నాటకీయంగా చైతన్య మార్గాన్ని స్వీకరించడం - వారు మొదట నవ ద్వీపానికి చెందిన వారే, వారి పాండిత్య ప్రకర్షను గురించి లోకంలో చాలా దూర ప్రాంతములందుకూడ ప్రసిద్ధి వుంది. వారి పూర్తి పేరు వాసుదేవ సార్వభౌమ భట్టాచార్యులు. వారు చైతన్యుల కంటే ఆయువులో నలుబదేండ్లు పెద్ద.

వంగదేశంలో వాసుదేవుని వైదుష్యానికి సంబంధించి ఎన్నో కథలున్నాయి. చిఱుత ప్రాయంనాడే ఆయన అసాధారణ మేధాశక్తి, స్మృతి పాటవము, ప్రకటమయినాయి. వారు 'నవ్య న్యాయం' చదవడానికిగా నవ ద్వీపం నుంచి మిథిలకు వెళ్లారు. ఆరోజుల్లో, మిథిలా నగరం, నవ్య న్యాయానికి ప్రసిద్ధమైన కేంద్రం. వాసుదేవులు మిథిలలో పక్షధర మిశ్రులు స్థాపించిన పాఠశాలలో నవ్య న్యాయశాస్త్రం చక్కగా అభ్యసించారు.

'నవ్య న్యాయం' మిథిల దాటి బైటికి వెళ్లగూడదనే ఉద్దేశ్యంతో, మిథిలేతరులైన శిష్యులను నవ్యన్యాయ గ్రంథములకు ప్రతి లిపి రాసుకోనిచ్చేవారు కారు. అంచేత వాసుదేవులు 'తత్వ చింతామణి' మొత్తం గ్రంథాన్ని 'న్యాయకుసుమాంజలి'లోని ఛందోబద్ధమైన భాగాన్ని కంఠపాఠం చేసికొని, విద్యాభ్యాసానంతరం మిథిల నుండి వంగభూమికి తిరిగి వచ్చేశారు.

ఈ విధంగా, ఈ శాస్త్రం ఇతర ప్రాంత విద్యార్థులకు గూడ అందుబాటులోకి వచ్చింది. ఈ పని వాసుదేవుల ప్రతిభ వల్లనే సాధ్యపడింది. ఆయన శిష్యులలో మేధా సంపన్నుడైన రఘునాథ శిరోమణి సుప్రసిద్ధుడు. 'చైతన్య మంగల్' గ్రంథ రచయిత జయానందుని కథానుసారం, వాసుదేవ సార్వభౌములు నవ ద్వీపంలో

అనుదినం జరుగుతూ వున్న అత్యాచారాలకు, సంత్రస్తులై, జగన్నాధపురి చేరుకొని అందే నివసింపసాగారు.

చైతన్యులు తొలిసారి పురీ యాత్ర చేసినప్పుడు (క్రీ.శ. 1510 ప్రారంభం) వాసుదేవ సార్వభౌములు, ఉత్కళ ప్రభువుల సంస్థానంలో గౌరవశాలురైన వృద్ధ విద్వాంసులుగా ఉంటూ వుండేవారు. బృందావనదాసు చైతన్యుల తోటి ఆయన ప్రథమ సమావేశాన్ని ఈవిధంగావర్ణించాడు- దేవాలయంలో జగన్నాథుని మూర్తిని దర్శింపగనే చైతన్యులు భావా వేశంలో మూర్తిని ఆలింగనం చేయడానికి పరువెత్తి, పరవశంతో స్పృహ లేకుండా క్రింద పడిపోయారు. పూజారులు ఆయన యెడల దుడుకుగా ప్రవర్తించారు. పూజారులకు చైతన్యులెవరో తెలియదు. వారాయనను ఎవడో పిచ్చివాని క్రింద జమ కట్టారు. ఈ దృశ్యాన్ని కండ్లారా చూసిన వాసు దేవ సార్వభౌములు, చైతన్యులను తమ ఇంటికి తీసుకొని వచ్చారు. చైతన్యుడు, తమ తండ్రిగారి మిత్రుడు నీలాంబర చక్రవర్తిగారి పౌత్రుడేననే సంగతి సార్వభౌములా సందర్భంలో తెలుసుకున్నారు.

వాసుదేవులప్పటి నుంచి, చైతన్యుల విషయంలో ఎక్కువ మక్కువ చూపిస్తూ వచ్చారు. వాసుదేవులు తొలుత చైతన్యులను త్యాగ పథము నుంచి మరల్చి, వేదాంత మార్గానికి త్రిప్పవలెనని, ప్రయత్నం చేశారు. వారిరువురి మధ్య చాలా రోజులు పాండిత్య పూర్ణమైన శాస్త్ర స్థం సాగింది. చైతన్యులు ఆ వాగ్వాదంలో వైష్ణవోపాసనా సిద్ధాంతాన్ని ప్ర లిపాదించారు. చాలా రోజులు శాస్త్ర వాదం చేసిన పిమ్మట, వాసు దేవులు, చైతన్య ప్రతిపాదితమైన వైష్ణవ భక్తి మార్గాన్ని స్వీకరించారు. ఈ విధంగా వాసుదేవులు చైతన్యుల పైకి విజిగీషతో వెడలి, తామే విజితులై, చైతన్యుల భావనాపరమైన భక్తి మార్గాన్ని స్వీకరించి, ఆ వాద పక్షం వహించి వ్యవహరించడం మొదలుపెట్టారు.

సార్వభౌముల వంటి పండితుడు, సమాజంలో గౌరవ ప్రతిష్ఠలు గల వ్యక్తి తమ మతం మార్చుకొని చైతన్యుల వాదాన్ని స్వీకరించా రనేటప్పటికి, సాధారణ జనంలో చైతన్యుల ధార్మిక వ్యక్తిత్వం మరింత గరిమను సంపాదించుకున్నది. యువక సన్న్యాసులైన చైతన్యుల కిది స్మరణీయమైన ఉపలబ్ధిగా భావింపబడింది. ఈ విజయవార్త నవద్వీపంలో కూడా మారుమ్రోగింది. అక్కడ చైతన్యుల యనుయాయులకు ఈ విజయవార్త ఎంతో దీప్తి స్ఫూర్తులను కలిగించి వుంటుంది.

జ్ఞాన వయోవృద్ధులు నైయాయికులు, దార్శనికులు, అయిన వాసుదేవ సార్వభౌములు వైష్ణవ భక్తులైనారని వినగానే పురిలోని అశేషజనం చైతన్యుల భావ విప్లవ భక్తిమార్గం వైపు తమ మొగ్గు చూపడ మారంభించారు. ఉత్కళ నరేశుడు, ప్రతాపరుద్ర గజపతి మహారాజులుంగారు కూడా వాసుదేవ సార్వభౌములను ఎంతో గౌరవ ప్రపత్తులతో, ఆదరాభిమానాలతో చూసేవారు. వారు కూడ, వంగదేశీయుడైన యువక సన్న్యాసి చైతన్యుల మహిమకు చేతులొగ్గారు.

ప్రతాపరుద్ర మహారాజుగారు చైతన్యులను మన్నింప నారంభించారు. చైతన్యులొనర్చిన మొదటి పురీ ప్రవాసంలోని రెండవ మహత్వ పూర్ణమైన సంఘటన ఇది. ప్రతాప రుద్ర గజపతి చైతన్యులు ప్రతిపాదించిన వైష్ణవ మార్గం స్వీకరించారనే విషయం ఋజువు పఱచడానికి తగిన ప్రత్యక్ష ప్రమాణలేమీ లేవుకాని ప్రతాపరుద్రుడు ఆయన ప్రశంసకులలో ఒకరని మాత్రం మనం నిశ్చితంగా చెప్పవచ్చు. చైతన్యులతో సమావేశమొనర్చిన సందర్భాలన్నింటిలోనూ, ప్రతాపరుద్రుడు చైతన్యుల పట్ల గౌరవ మర్యాదలు చెల్లిస్తూనే వచ్చాడు. సమకాలికములైన అనేక వివరణల వల్ల ప్రతాపరుద్రుడు చైతన్యుల పట్ల శ్రద్ధాభక్తులు చూపించినట్లు తెలుస్తూంది.

సార్వభౌములు తమ మతాన్నిమార్చుకోవడం, ఉత్కల ప్రభువు మన్నించడం, ఈ రెండు సంఘటనల వల్ల ఒరిస్సాలో వైష్ణవ మతం ఉత్తరోత్తరా వికసించడానికి చక్కని ఆధార భూమి ఏర్పడ్డది. చైతన్యులు మృతినందిన పిమ్మట ఒరిస్సాలో వైష్ణవాందోళన ప్రచార ప్రసారాలు, శ్యామానందనదాసు ప్రభృతుల కార్య కలాపాల ద్వారా, వాళ్ల వ్యక్తిత్వ ప్రభావం ద్వారా జరిగాయి. చైతన్యుల సమయంలో గౌడీయ వైష్ణవ మతం, చైతన్యుల వ్యక్తిగత ప్రభావం వల్ల ఆయన చూపెట్టిన ఆదర్శం వల్ల, ఉత్కళ దేశంలో ప్రవేశించింది.

చైతన్యులు క్రీ.శ. 1510 వరకు దక్షిణ భారతదేశంలోనూ, పిమ్మట పశ్చిమ భారత దేశంలోనూ ఘత పర్యటన గావించారు. తీర్ధ యాత్రలు చాలా కాలం, దూరదూరాలకు సాగించారు. చైతన్యులు ధార్మిక మహత్త్వమున్న అనేక పుణ్య స్థలాలకు,తమలోని ఆధ్యాత్మిక ప్రవృత్తిచే తీవ్రంగా ప్రేరితులై యాత్రలు సాగిస్తూ వచ్చారు.

తీర్థయాత్రలు దాదాపు రెండేళ్లపాటు సాగాయి. చైతన్యులు తమ వెంట ఏ

మండలినిగాని, శిష్య వర్గమునుగాని, సహయోగులను గాని రానీయలేదు. మొత్తం యాత్రలో కేవలం తమకు వ్యక్తిగతంగా తెలిసిన ఒకే ఒక్క వ్యక్తి వెంట ఉన్నాడు. ఆయన పేరు గోవింద కర్మకార్. ఆయన, చైతన్యుల ఈ యాత్రా సంబంధమైన విస్తృతమైన వివరణ వ్రాసినట్లు విద్వాంసులు కొందరు అభిప్రాయపడుతున్నారు.

ఈ ధార్మిక యాత్రల సందర్భంగా చైతన్యులెన్నో దేవాలయాలను, గ్రామాలను, ఆధ్యాత్మిక కేంద్రాలను దర్శించారు. ఆయన దక్షిణ భారతంలోగాని, పశ్చిమ భారతంలోగాని, ఎక్కడకు వెళ్లినా,జనులు అసంఖ్యాకంగా, ఆయన భక్తి భావ ప్రభావానికి వశీభూతులయ్యే వారు. ఆయన యాత్రల ఫలితంగా, ఆయన మతంలో నిహితమై ఉన్న సూదంటురాయి వంటి ఆకర్షణశక్తి మూలంగా, ఆయా ధార్మిక కేంద్రాల్లోని ఉపాసనా వైఖరి లోగడ కంటే మిన్నగా భక్తి భావప్రేరితం కాజొచ్చింది. దక్షిణ భారతదేశం, గుజరాతు, మహారాష్ట్ర ప్రాంతం వీనిలో, ఏతాదృశమైన భక్తి ప్రభావం ఈ చైతన్య అడుగుపెట్టిన ప్రతిచోటా ముద్రితమైంది.

వారొనర్చిన తీర్థయాత్రల సంపూర్ణ వివరణ అసంభవం. కాని కొన్ని ముఖ్యమైన సంఘటనల గురించి మన మిక్కడ ముచ్చటించుకోవచ్చు. వైష్ణవ భక్తులలో సుప్రసిద్ధుడైన రామానందరాయ్ చైతన్యులను కలుసుకొన్న సందర్భం చాలా ముఖ్యమైనది. రామానందులు చైతన్యులను పవిత్ర గోదావరీ తీరంపైన రాజమహేంద్రవరం దగ్గిర సందర్శించారు. రామానందుడు రాఘవేంద్ర పురికి శిష్యుడు. రాఘవేంద్ర పురి ధన్యయశస్కుడైన మాధవేంద్ర పురికి శిష్యుడు. రామానందుడు ఉత్కళ ప్రభువైన ప్రతాపరుద్రుల కొలువులో ఉన్నత పదవి నధిరోహించిన ఉత్తమాధికారి.

చైతన్యులు పురిలో వుంటున్నప్పుడే వాసుదేవ సార్వభౌముల ద్వారా రామానందులను గురించి విని వున్నారు. గోదావరి స్నానఘట్టంపైన ఘటిల్లిన రామానంద చైతన్య ప్రథమ సమావేశం మిగుల మనోహరమైనది. ఇద్దరిలోనూ సమాన ధర్మమైన భక్తిభావం తరంగితం కాగా పరస్పరం ఆకర్షింపబడ్డారు. రామానందులు చైతన్యుల భావ విహ్వలమైన భక్త్యున్మాదానికిలోనై ఆయన ప్రముఖ శిష్యులలో ఒక్కరుగా నిలిచారు.

చైతన్యులు రామానందుల సంపర్కంలో మిగుల ప్రసన్నులైనారు. రామానందుల ఇంట ఎంతో కాలం నివసించారు. వంగ వైష్ణవ సంప్రదాయ చరిత్రలో సుప్రసిద్ధ

విద్వాంసుడూ, ఉన్నతాధికారీ అయిన రామానంద్‌రాయ్ ద్వారా చైతన్యులు సమ్మానింపబడడం ఓ మహత్త్వ పూర్ణమైన ఘటన. చైతన్యుల గురించి వ్రాయబడిన ఇంచుమించు అన్ని జీవిత చరిత్రలలోనూ, ఈ సందర్భంగా వర్ణింపబడి వుంది.

రామానంద చైతన్య సమావేశం, చైతన్యుల యాత్ర ప్రారంభంలోనే జరిగినట్లనిపిస్తుంది ఎందుచేతననగా, ఈ సమావేశానంతరం, చైతన్యులు ఇంకా ఎంతో దక్షిణ ప్రాంతానికి యాత్ర చేశారు. ఈ యాత్రలన్నింటా చైతన్యులు వెళ్ళిన ప్రతిచోటా, అక్కడి దేవీ దేవతల యెడల, మత గురువుల పట్ల, ఆదరాభిమానాలు వెల్లడిస్తూ వచ్చారు. విభిన్న ధార్మిక కేంద్రాలను చైతన్యులు దర్శించడం వల్ల, ఆయనలోని ఉదార ధార్మిక ప్రవృత్తి వెల్లడి అవుతోంది. వారు వైష్ణవ అనుయాయులతో పాటు కావేరీ నదీ తీరంలో శ్రీరంగంలో చాలా నెలలు గడిపారు. సువిఖ్యాతులైన మధ్వాచార్యుల నివాస స్థానమైన ఉడిపి (దక్షిణ కన్నడ జిల్లా)లోకూడా వారు చాలాసార్లు తీర్థ సంవాసం చేశారు. ఉడిపిలో మధ్వాచార్య ప్రతిష్ఠితమైన శ్రీ కృష్ణభగవానులమూర్తిని వారారాధించారు. మధ్వాచార్య మతానుయాయులతో చైతన్యులు ధార్మిక సంవాదాలు సలిపారు. వారు మహారాష్ట్రంలోని, వైష్ణవ మతానికి చెందిన సుప్రసిద్ధ తీర్థ స్థలము పండరీపురానికి కూడా వెళ్ళారు. అటునుండి, పశ్చిమ భారతదేశంలోని సోమనాథం, ద్వారక, ప్రభాస మొదలైన సుప్రసిద్ధ తీర్థ స్థానాల్ని కూడా సేవించారు తిరుగు యాత్రలో మధ్య భారతదేశం, ఆంధ్రప్రదేశ్ గుండా (రామానందుల స్థానం వైపు నుంచి) ఉత్కళ దేశం చేరుకున్నారు. వారు రెండు సంవత్సరాల పిమ్మట క్రీ.శ. 1511 చివరిలో తిరిగి స్వస్థలం చేరారు.

## పురిలో రెండోసారి ప్రవాసం – ఉత్తర భారత దేశ యాత్ర

ఈసారి చైతన్యులు రెండు సంవత్సరాలపాటు ఒరిస్సాలో వున్నారు. మొదటి తీర్థయాత్ర పూర్తి చేసుకొని, పూరీ జగన్నాథానికి తిరిగి వచ్చిన వెంటనే ఆయన వంగభూమిలోని శిష్యవర్గం, అద్వైతాచార్య, నిత్యానందుల నాయకత్వం క్రింద వారిని కలుసుకోవడానికి వచ్చారు. రెండు సంవత్సరాల పిమ్మట, వాళ్ళు తమ గురువుగారిని ఇదే తొలిసారి కలుసుకోవడం.

వంగభూమికి చెందిన రెండు వందల మంది శిష్య వర్గం చైతన్యులను సన్మానించారు. అది యొక అపూర్వ సన్నివేశం. ఆ సంవత్సరం జగన్నాథుని

రథోత్సవ సందర్భంలో ఒక అపూర్వ దృశ్యం గోచరించింది. భారతదేశం నలుమూలల నుంచి సమావిష్టమైన తీర్థ యాత్రికులు జగన్నాథ, బలరామ, సుభద్రల ఉత్సవ విగ్రహాల ఊరేగింపుతోబాటు, ఒక విశాలమైన సంకీర్తన యాత్ర కూడా రథంతో పాటు ఊరేగింది.

సామూహిక కీర్తన యాత్రకు నాయకత్వం చైతన్యులే వహించారు. ఆయన వెంట వంగదేశం నుంచి వచ్చిన రెండు వందల మంది శిష్య వర్గముంది. ఈ సంకీర్తన యాత్ర మూడు రథాలను ప్రదక్షిణిస్తూ సాగుతూ వచ్చింది. ఆ సంవత్సరం మొదలు, చైతన్యులు ఏటేటా, పూరీ జగన్నాథంలోని రథయాత్రలో సంకీర్తన యాత్ర ఏర్పాటు చేస్తూ అందులో అమిత దివ్యోన్మాదంతో పాల్గొంటూ వుండేవారు. బెంగాలు నుంచి ప్రతి యేటా, ఆయన శిష్యవర్గం, చైతన్యులను, జగన్నాథస్వామిని యుగపద్భావంతో సేవించడానికి, రథయాత్రా సందర్భంలో తప్పక వస్తూవుండేవారు.

చైతన్యుల జీవితకాలంలో, ఇరవై సంవత్సరాలపాటు, ఈ విధంగా పూరీ జగన్నాథానికి వస్తూ వుండడంతో, శిష్య వర్గానికి, చైతన్యులకూ మధ్య ఒక విధమైన అవిభాజ్య సంబంధం ఏర్పడింది. యాత్రగా వచ్చి శిష్యులు కొన్నాళ్ళపాటు పురీ క్షేత్రంలోనే వుండేవాళ్లు. వాళ్లు గురుదేవుని యాశీర్వాదాలతో పాటు, ఆధ్యాత్మిక సందేశాన్ని కూడ శిరసావహించి తిరిగి బెంగాలుకు వెళ్ళేవాళ్లు.

చైతన్యులు దక్షిణ భారతయాత్ర నుంచి తిరిగి వచ్చిన వెంటనే పురిలో మొట్ట మొదటిసారి కలుసుకొన్నప్పుడు, అద్వైతాచార్యులు, నిత్యానందులు, చైతన్యులను వంగదేశంలో వైష్ణవమత ప్రచారానికి దోహదప్రాయములైన విధానాలను గురించి సంప్రదించారు.

చైతన్యుల ఈ వైష్ణవ ఆందోళనం ముఖ్యంగా రాధాకృష్ణోపాసనోన్ముఖమైనది. భారతదేశంలోని యితర వైష్ణవ సంప్రదాయాలకు గౌడీయ వైష్ణవ మతానికిగల ప్రముఖమైన తేడా ఇదే. తర్వాతకాలంలో, చైతన్యుల ప్రముఖ సహచరులు నిత్యానందులు, సంఘ సంస్కరణ కార్యం కూడ నిర్వహించసాగారు. వారు ముఖ్యంగా నెరవేర్చిన సంఘ సంస్కారం - నాటి అస్పృశ్యుల నందరినీ రావించి, వాళ్లను హిందూ సమాజంలోకి అరమరికలు లేకుండా స్వీకరించడం.

బెంగాలులోని యీ నవ్య వైష్ణవ ఆందోళనకు సామాజిక ప్రాధాన్యమెంతైనా

వుంది. నిత్యానందులకు సంఘ సంస్కరణాభిలాష చైతన్యుల మూలంగా కలిగింది. చైతన్యులు నిత్యానందులను తిరిగి గృహ స్థాశ్రమ స్వీకారానికి ప్రేరేపించారు. నిజానికి ఆ ఆశ్రమ జీవనమే సాంఘిక కార్యకలాపాలకు ఎక్కువగా తోడ్పడుతుంది.

పూరీ జగన్నాథంలో సుమారు రెండేళ్లపాటు ఉన్న తర్వాత, చైతన్యులు తిరిగి తీర్థ యాత్రలపై పర్యటన సాగించారు. క్రీ.శ. 1513 నాటిమాట. వారు బృందావనంలోని జీర్ణ స్థానాలను ఓసారి పర్యవేక్షించ సంకల్పించారు. అప్పటికే వారి శిష్యుడైన లోకనాధుడు అక్కడ జీర్ణోద్ధార కార్యక్రమాన్ని సాగిస్తూ వున్నాడు. చైతన్యులు కృష్ణ భగవానుల, నివాస స్థానంగా పరంపరయా వినవస్తూ వున్న బృందావనం యాత్ర చేయడానికి, బెంగాలు వైపు ప్రయాణించారు. ఉత్తరవంగ దేశం రాజధాని యైన రామకేలి అనే స్థానం చేరుకున్నారు. వారి యాత్ర అంతటితో నిలిచి పోయింది. ఉత్తర భారతదేశంలో అటునుంచి ఎటూ వెళ్లలేకపోయారు. బృందావనం యాత్ర గురించి వారు ఎన్నో ఏండ్లుగా కంటూ వచ్చిన కలలన్నీ ఈసారి కల్లలే అయినాయి.

ఈ సందర్భంలో ఒక ముఖ్యమైన విషయం మనం స్మరించాలి. చైతన్యులకు పూర్వమే, బృందావనంలోని పవిత్ర స్థానాలన్నీ ధ్వంసమై పోయినాయి. వాటి జీర్ణోద్ధారణ చైతన్యుల ఆదేశానుసారం, వారి శిష్యులే కావించారు.

చైతన్యులు తమ సన్న్యాస గ్రహణ సమయం నుంచి, కృష్ణలీలా స్మృతి భరితమై పవిత్రమైన బృందావనంయొక్క విశిష్టమైన వైభవాన్ని తిరిగి ప్రతిష్ఠించవలెనని, ఎంతో తపన పడుతూ వుండేవారు. వారు తమ అన్యతమభక్తులూ, శిష్యులూ అయిన లోకనాధుని, బృందావనంలోని ఉపేక్షితములైన పవిత్ర స్థానాన్ని పునరుద్ధరించవలసిందిగా ఆదేశించారు. చైతన్యులకంటే పూర్వం, మాధవేంద్రపురిలో, బృందావనం యొక్క విలుప్త వైభవాన్ని పునః ప్రతిష్ఠించవలెననే ఉత్కంఠమైనసంకల్పం చిగురెత్తిన మాట నిజం.

కాని మాధవేంద్ర పురి యొక్క కోరిక, కార్యాన్వితం కాకపోవడం చేత సఫలం కాలేదు. చైతన్యులు, వారి అనుయాయులే ఈ మహత్కార్యాన్ని, నిర్వహింపగలిగారు. చైతన్యుల శిష్యులు రాధాకృష్ణుల పవిత్ర స్మృతికి సంబంధించిన విశిష్ట స్థానాలను మొదట నిర్ధారించారు. శిష్యులీకార్యాన్ని నిస్వార్థ భావంతో, శ్రద్ధా భక్తులతో నెఱవేర్చారు. అనంతర కాలంలో, బృందావన విలుప్త గౌరవ పునః ప్రతిష్ఠాపనా

సమారంభంలో, రూప గోస్వామి, సనాతన గోస్వాముల సహాయ సంపత్తులు లోకనాధునికి లభించాయి.

క్రీ.శ. 1513 ప్రాంతంలో చైతన్యులు బృందావనం వంగభూమి మీదుగా వెళ్లడానికి సంకల్పించినపుడు, లోకనాధుడొక్కడే ఆయన ఉద్దేశ్యాన్ని నెఱవేర్చడానికని బృందావనంలో వుంటూ వుండేవాడు. రూప గోస్వామి సనాతన గోస్వాములు ఇంకా చైతన్యుల ప్రభావముద్రకు లోనుగాలేదు. రూప సనాతను లిరువురూ చైతన్యులు రామకేలి చేరిపుడే తొలిసారిగా చైతన్యుల దర్శనం చేసుకున్నారు.

సోదరులిరువురూ, చక్కని వైదుష్యంగల విద్వాంసులు. వారు బెంగాలు శాసకులు హుసేనుషా దర్బారులో చాలా ఉన్నతమైన పదవిలో వుండే వారు. రాజకీయంగా వ్యావహారిక జగత్తులో, రూపగోస్వామికి గల బిరుదు 'దావిర్ ఖాస్' సనాతనులకు గల బిరుదు 'సాకేర్ మలిక్' అని తమ రాజకీయ పదవి కారణంగా వారిరువురకూ ఉన్నతమైన సామాజిక ప్రతిష్ఠ కూడకద్దు.

చైతన్యులను వారిరువురు మొదటిసారిగా, రామకేలిలో కలుసుకున్నారు. ఆ సమావేశం వారిరువురి జీవితాల్లోనూ ఒక చక్కని మలుపు తెచ్చింది. చైతన్యుల భావావేశపరమైన ఆధ్యాత్మిక వ్యక్తిత్వం వారి మీద గంభీరమైన ప్రభావముద్రను అంకితం చేసింది. వారివురు దాని ఫలితంగా లౌకిక జీవితమందలి అనురక్తిని పూర్తిగా వదలివేశారు. వైష్ణవ మతానుయాయులైనారు. చైతన్యులే వారిరువురకు నవీన నామకరణం చేశారు. జ్యేష్ఠ సోదరునకు 'సనాతన గోస్వామి' అనీ, అవర రోజునకు 'రూపగోస్వామి' అనిన్నీ.

తమ శిష్యత్వాన్ని స్వీకరించిన పిమ్మట చైతన్యులు, బృందావనంలోవుంటూ, దానిని నవ్య వైష్ణవ కేంద్రంగా రూపొందింపవలసిందని వారిరువురిని కోరారు. పిమ్మట వారిరువురూ విద్యా వ్యసనులై తురీయాశ్రమంలో వుంటూ బృందావనంలో తమ జీవితాలను గడిపారు. వారు గౌడీయ వైష్ణవ సంప్రదాయానికి ఆధార శిలలుగా ప్రసిద్ధినొందిన ప్రమాణికాలైన దర్శన గ్రంథాల్ని ధార్మిక సాహిత్యాన్ని రచించారు.

రామకేలికి చైతన్యులు విచ్చేసినపుడు సనాతన రూపగోస్వాము లిర్వురూ అక్కడే వున్నారు. సోదరులిర్వురూ, చైతన్యుల భావ విహ్వలతకు ముగ్ధులైనారు.

వారు ఆయన ఆకర్షణ శక్తికి వశీభూతులైనారు. వారి మనోభూమికల యందు ఎంతో మార్పు వచ్చి, వారొక విధంగా ఆ క్షణంలోనే చైతన్యుల మతాన్ని స్వీకరించినట్లైంది. కాని అప్పటికప్పుడే వారు చైతన్యుల కనుయాయులు కాలేదు. కొంత కాలం తర్వాత వారు సన్న్యాస జీవితాన్ని గ్రహించారు.

రామకేలి గంగాతటంపై 'గౌడ' బస్తీకి దగ్గిరగా వున్న వూరు.'గౌడ'కు వెలిగా కూడ సైన్యానికి ఏర్పాటైన ఖిల్లా ఒకటి వుండేది. అది వంగ శాసకుడైన హుస్సేను షాకు రాజధానిగా వుండేది.రామకేలిలో అత్యధిక సంఖ్యలో బ్రాహ్మణులు వుంటూ వుండేవారు. చైతన్యులు అక్కడ నాలుగైదు రోజులు ప్రవాసిగా వున్నపుడు జనులు ఆయన దర్శనార్థం వేలాదిగా వచ్చారు. చైతన్యుని మనోమోహకమైన భక్తిపద్ధతి వల్ల,తరచు జనసమూహం ఆకర్షింపబడుతూ వుండేది. జనం రామకేలి నుంచి బృందావనానికి బయలుదేరే సమయానికి ఒక విచిత్రమైన ఘటన వాటిల్లింది. జన సమూహం సముద్ర తరంగంలా పొంగివచ్చి, ఆయన్ను చుట్టుముట్టింది.

హుస్సేనుషాకు చైతన్యులపై జనులకు గల ప్రీతి గౌరవాలను గురించివార్తలందాయి. రామకేలిలో జనులు తండోపతండాలుగా వచ్చి ఆయన దర్శనం చేస్తూ వుండడం ఆయన విని వున్నాడు. తన దూత అయిన కేశవ క్షత్రీ అనునతన్ని సంగతి సమాచారాలన్నీ పూర్తిగా తెలుసుకొని వచ్చి దర్బారులో నివేదింపవలసిందిగా ఆజ్ఞాపించాడు. కేశవక్షత్రీయుడు పాదుషా ఆజ్ఞ ప్రకారం వెళ్లి వచ్చి, తాను కళ్లారా చూసిన విషయాన్ని - జనులలో చైతన్యుల మతం పై గల మొగ్గుదలను - పాదుషాకు నివేదించాడు.

చైతన్యులు రామకేలిలో తమ ప్రవాసాన్ని గురించి ప్రచారం చేయకుండా, గుట్టుగా వుందామనే అనుకున్నారు. కాని అట్లా వుండడం సాధ్యమైందికాదు. విశాలమైన జన సమూహం ప్రతి దినం రావడం మొదలుకాగానే ఆ విషయం హుస్సేన్‌షా దర్బారు దాకా ప్రాకి పోయింది. చైతన్యుల క్రొంగ్రొత్త శిష్యులైన సనాతనరూప గోస్వాముల మాట నచ్చిందికాదు.

అన్నదమ్ములిద్దరూ, ఏకాంతంగా చైతన్యులనురాత్రివేళ యందు కలుసుకొని తమ భద్రత కోసం ఆలస్యం చేయకుండా ఆ స్థానం వదిలి పెట్టి వెళ్ళవలసిందని, ప్రాధేయపడ్డారు. వారు చైతన్యులను ఇంతటి జనసమూహంతో, బృందావనం యాత్ర కని బయలుదేర వద్దనికూడా బ్రతిమాలారు.

దగ్గరలో ప్రక్కలో బల్లెంలాగా వుంటూ వున్న నృశంసుడైన నరపాలుని గురించి కూడ, వారిరువురూ, చైతన్యులకు గుర్తు తెచ్చారు. కాని ఏ మాటకామాటే, ఇంత వరకు పాదుషా చైతన్యుల పట్ల, ఎటువంటి అభద్ర వ్యవహారమూ జరిపి యుండలేదు. అట్లాగని నమ్మి ఊరుకోవడానికి వీలైన పరిస్థితి కాదు. ఇంతకు పూర్వమే ఈ పాదుషా ఒరిస్సాలోని ఎన్నో మందిరాలను పడగొట్టి, వానిలోని విగ్రహాలను ముక్కలు ముక్కలు చేసేశాడు. రోజు రోజుకూ జనుల యందు చైతన్యుల యెడ వృద్ధి పొందుతూ వున్న ప్రేమ గౌరవాలనుచూసి, సుల్తాను గుండెల్లో ద్వేషాగ్ని రగిలితే, లేక పాదుషా దర్బారులోని వాడెవడైనా పాదుషాకు దుర్బోధ చేస్తే చైతన్యుల జీవితానికే ముప్పు రావచ్చు. అందుకనే వారిద్దరూ ఆ చోటు నుంచి చైతన్యులను తక్షణమే వెళ్ళిపోవలసిందిగా కోరారు.

చైతన్యులకు తమ ప్రాణాలను గురించిన చింత అంతగా లేదు కాని వారు, తను విశ్వసనీయులైన అనుయాయుల అభ్యర్థనను త్రోసిపుచ్చనూ లేరు. సనాతన రూపగోస్వాముల కోరిక మేరకు చైతన్యులు బృందావన యాత్ర విరమించుకొని అక్కడి నుంచి తిరిగి పూరీ జగన్నాథానికి వచ్చేశారు.

చైతన్యులు ఆ తడవ పురిలో కేవలం కొన్ని నెలలు మాత్రమే ఆగారు. ఆ పిమ్మట క్రీ.శ. 1514లో వారు తిరిగి ఉత్తర భారత యాత్రకై బైల్దేరారు. ఈ తీర్థయాత్రలోని ప్రధానోద్దేశం బృందావనం చేరడం-క్రిందటిసారి బృందావన యాత్ర సాగలేదుకదూ!- ఈ తడవ ఎన్నాళ్ళుగానో తాము కలవరిస్తున్న బృందావన యాత్ర సఫలమై వారి కోరిక నెఱవేరింది. కృష్ణలీలల పవిత్ర స్మృతులతో నిండివున్న బృందావనంలో వారు పదార్పణ చేశారు.

ఉత్తర భారత తీర్థయాత్రా సమయంలో చైతన్యులు తమ వెంట ఒకే ఒక శిష్యుని తీసుకొని వెళ్ళారు. ఈ యాత్ర దక్షిణ భారత్ యాత్రకంటెనూ, పశ్చిమభారత యాత్ర కంటెనూ, చాలా విస్తృతమైన విధానంలో నడిచింది. ఈ యాత్రలో, దక్షిణ పశ్చిమ యాత్రలలో వలె ప్రధానములైన సంఘటనలేమీ వాటిల్లలేదు.

బృందావనం, చైతన్యులను మిగతా అన్ని పుణ్య స్థలాల కంటేఎక్కువగా ఆకర్షించిన మాట నిజమేకాని, వారక్కడ ఎక్కువ కాలం నిలవలేదు.వారు పూరీ జగన్నాథంలోనే తమ స్థిర నివాసమేర్పరుచుకోవడానికి నిశ్చయించారు. బృందావనం

నుంచి చేసినతిరుగుప్రయాణంలో, వారు కుంభమేలా సమయానికి గంగా యమునా సరస్వతీ సంగమ స్థానమైన పవిత్ర తీర్థ రాజము ప్రయాగకు వచ్చి అక్కడ కొంత కాలమున్నారు.

ప్రయాగలో చైతన్యులు అనేక పుణ్య పురుషులతో, సుప్రసిద్ధులైన విద్వాంసులతో సమావేశమైనారు. వీరిలో వల్లభభట్టు (వల్లభ సంప్రదాయ ప్రవర్తకులైన వల్లభాచార్యులు కారు) ఉత్తర బీహారు తిర్‌హుత్‌కు చెందిన, సుప్ర సిద్ధ వైష్ణవ విద్వాంసులు, భక్తి పదరచయితలు అయిన, రఘుపతి ఉపాధ్యాయులూ ముఖ్యులు.

ఇక్కడ చైతన్యులను సనాతనుని అనుజుడైన రూపగోస్వామికూడ తీసుకొన్నాడు. సనాతన రూపగోస్వాములు, మొదటనే రామకేలిలో చైతన్యులను దర్శించారు. ఈ తడవ రూపగోస్వామి శాశ్వతంగా గృహపరిత్యాగం చేసి గురువు గారిని అనుగమింపవలెననెడు సంకల్పంతో ప్రయాగకు వచ్చాడు. రూపగోస్వామితో బాటు అతని కనిష్ట సోదరుడు అనుపముడు కూడా వచ్చాడు. ఈ అనుపముని పుత్రుడే జీవగోస్వామి. అనుపమునికి మరోపేరు వల్లభుడని. చైతన్యులు, రూపగోస్వామితో ప్రయాగయందు సమావేశమైన తర్వాతనే, ఆయనను బృందావనానికి పంపారు. చైతన్యులు రూప గోస్వామిని బృందావన పునరుద్ధరణ కార్యమును చేబట్టి బృందావనాన్ని వైష్ణవ ధర్మ ప్రచారానికి ప్రధానకేంద్రంగా నెలకొల్పవలసిందని ప్రేరేపించారు. రూపగోస్వాములు, చైతన్యుల మనోభీష్ట సిద్ధికై, మిగిలిన జీవితమంతా బృందావనమందే గడిపారు. కేవలం ఓ పదిమాసాల పాటు గురువుగారి సన్నిధిలో వుండడానికని పురికి వచ్చారు.

చైతన్యులు ప్రయాగ నుంచి కాశీధామం చేరుకున్నారు. వారణాసిని భారతదేశానికి ఆధ్యాత్మిక రాజధాని యని చెప్పవచ్చు. సనాతను లిక్కడికి వచ్చి, చైతన్యులను కలుసుకున్నారు. మొదట చెప్పినట్లు, చైతన్యులు ఆయనకు గూడ బృందావనం వెళ్లవలసిందని కోరారు. సనాతనులు కూడ తర్వాత కొంతకాలం, చైతన్యుల సన్నిధిని కాలం వెళ్లబుచ్చవలెనని పురికి వచ్చి వున్నారు. వారణాసిలో ఆయన కలుసుకున్నప్పుడు, బృందావనం వెళ్లవలసిందిగా ప్రేరేపించారు. ఆయన కాశినుండి బృందావనానికి వెంటనే వెళ్లారు.

ఆ కాలంలో, కాశీక్షేత్రం శైవమతావలంబులకు ప్రధాన కేంద్రంగా వుంది. అద్వైత వేదాంతానికి పట్టు గొమ్మగా వుంది. వారణాసిలోని శివభక్తి ధురంధరులైన సన్న్యాసులపై చైతన్యుల ఉపస్థితి, ఏమంత ప్రభావముద్ర వేయలేకపోయింది. పవిత్రమైన ఈ నగరంలో ఆయన రావడం ఫలితంగా ఒకే ఒక్కరు ఆయన మతాన్ని అవలంబించారు. వారణాసిలోని వేదాంతుకెల్ల తలమానికమైన ప్రకాశనంద సరస్వతీస్వాములవారు, చైతన్య ప్రభావంవల్ల వైష్ణవ ధర్మాన్ని స్వీకరించినట్లు చెబుతారు. ఇంతకుమించి, ఈ యాత్రా సందర్భంలో, మరో ముఖ్యమైన సంగతి ఏమీ ఉన్నట్లు కనబడదు. చైతన్యుల ఉత్తరభారత తీర్థ యాత్ర ఇంచుమించు క్రీ.శ. 1515లో సమాప్తి నందింది. వారు పూరీ జగన్నాధానికి వెనుదిగి వచ్చారు.

చైతన్యుల జీవిత చరిత్ర రాసిన కొంతమంది రచయితల కథనానుసారం ఒరిస్సా ప్రభువైన ప్రతాపరుద్ర గజపతితో చైతన్యుల ఔపచారిక పరిచయం, ఆయన బృందావనం నుంచి తిరిగి వచ్చిం తర్వాత కలిగింది. ప్రతాపరుద్రుడు చైతన్యుల యెడ తమ భక్తి భావాన్ని ప్రకటించాడు. ఈ సమావేశానికి పూర్వం చైతన్యుల ప్రతాపరుద్రుని తోటి పరిచయానికి ఉన్ముఖులుగాలేరు - కారణం, చైతన్యుల దృష్టిలో ప్రతాపరుద్రుడు ధనాఢ్యుడూ, లోకప్రవృత్తియందాసక్తి మెండుగా గల వ్యక్తిగానూ భాసించడమే.

కాని అత్యంత భక్తి శ్రద్ధలు చెల్లిస్తున్న మహారాజును, చూసి చైతన్యుల హృదయం ద్రవించింది. ప్రతాపరుద్రునితోటి ఈ సంబంధం, గౌడీయ మత చరిత్రయందు ఒక మహత్వపూర్ణమైన ఘట్టంగా, చైతన్యుల జీవితంలో ఒక సుఖద సన్నివేశంగా రూపొందింది.

చైతన్యులు బృందావన యాత్ర పూర్తి చేసుకొని పూరి జగన్నాధం చేరే సరికి ఆయన వయసు ముప్పై సంవత్సరాలు మాత్రమే. సన్న్యాసం తర్వాత భారత దేశమందలి విభిన్న ప్రాంతాల్లో పర్యటించడానికి ఆరు సంవత్సరాల కాలం పట్టింది. కాని ఆ పిమ్మట వారు జగన్నాధ ధామం వదలి మటెక్కడికీ ప్రవ్రజింపలేదు. వంగ వైష్ణవుల తోటి తమ సంబంధం, శివానందసేను ఆధిపత్యం క్రింద ఏటాట, పురీ యాత్రకు వాళ్లు వస్తూ వుండడం మూలంగా, నిలబడింది.

## పురీక్షేత్రంలోని అంతిమ ప్రవాసం

చైతన్యులు క్రీ.శ. 1515 నుండి తమ గోలోక వాస సంవత్సరమైన క్రీ.శ.1533 వరకు, అనగా 18 యేండ్ల పాటు నిరంతరంగా, పురిలోనే తమ జీవితాన్ని గడిపారు. జయానంద కర్ణపూరకవులు తమ గ్రంథాల్లో రాసిందాన్ని బట్టి చైతన్యులు 'పురీ'లో కాశీశ్వరమిశ్రుల ఆశ్రమంలో వుండే వారని తెలుస్తుంది. మరి ఒక ఆకరాన్ని బట్టి, చైతన్యులు తమ జీవితం చివరి పంద్రెండేళ్లు 'గంభీర' అనే స్థానంలో వుండేవారని తెలుస్తోంది. 'గంభీర' అనేది పైన ఉటంకింపబడిన కాశీశ్వర మిశ్రుల ఆశ్రమంలోని ఒక భాగమే. పురీ నివాసులైన కాశీశ్వర మిశ్రులు గురువుగారి ప్రశంసకూలూ, భక్తులున్నూ.

ఇంతకు ముందు చెప్పినట్లు, వంగ భూమిలోని చైతన్యుల శిష్యులు ఏడాదికి ఓసారి రథయాత్రా సందర్భంలో చైతన్యులను సందర్శించడానికి వస్తూ వుండేవారు. అత్యధిక సంఖ్యలో వస్తూ వుండే శిష్య వర్గం ద్వారా, వార్షిక రథయాత్రా సందర్భం, చైతన్యులకు ఆయన అనుయాయులకు, వైష్ణవ భక్తి ఆందోళనకూ మధ్య ఒక జీవంతమైన సంపర్కంగా వుండేది. జగన్నాథ ధామంలో వున్న తుది పదునెనిమిది సంవత్సరాల నివాసం, చైతన్యులకు ఆయన వంశీయ శిష్యులకు మధ్యనే గాక, ఇతర అనేక ప్రశంసకులకు, భక్తులకూ, విద్వాంసులకు గూడ ఆయనతో సంపర్కం ఏర్పడడానికి సాధన భూతమైంది.

చైతన్యుల మూలంగా జగన్నాథ రథయాత్రా సందర్భంలో చైతన్యుల ద్వారా ఒక విశేషమైన ఉత్సవాంగంగా, చైతన్యుల శిష్యవర్గం, అనుయాయవర్గం, చైతన్యులతోబాటు, జగన్నాథుని ఉత్సవ విగ్రహంతోబాటు సంకీర్తనలు, భజనలు చేసుకుంటూ ఊరేగేవారు. చైతన్యులు పూరీ జగన్నాథంలో ఉన్నంతకాలం ఈ సామూహిక కీర్తన పద్ధతి జగన్నాథ రథయాత్ర కంగభూతమై విరాజిల్లింది.

పూరిలో ఆయన చరమ జీవితంలో అద్వైతాచార్యులు, నిత్యానందులు, ఇతర ముఖ్యశిష్యవర్గం చైతన్యుల దర్శనం చేసుకొని వారితో ఆధ్యాత్మికంగా కొంతకాలం గడపడానికని వస్తూవుండేవాళ్లు.

చైతన్యుని శిష్యులలో ఒకరైన రఘునాధదాసు సన్న్యాసగ్రహణానంతరం పూరీ జగన్నాథం వచ్చి గురువుతో బాటే వుంటూవుండే వారు. చైతన్యుల గోలోకవాస పర్యంతం వారు పురీలోనే వుండి పిమ్మట బృందావనానికి

వెళ్లిపోయారు. చైతన్యుల జీవితంలోని చరమ భాగాన్ని గురించిన వివరాలన్నీ మనకు రఘునాధ దాసుగారి ద్వారానే మనకు తెలియవస్తున్నాయి. రూపగోస్వామి, రఘునాధదాసు, రఘునాధభట్టులను గురించి మరికొన్ని విశేషాలు 'బృందావనంలోని గోస్వామి షట్కం' అనే అధ్యాయంలో గమనింపవచ్చు.

వీరిలో చివరివాడైన రఘునాధ భట్టు చైతన్యులను కలుసుకోవడానికి మొదటిసారిగా జగన్నాధపురికి వచ్చాడు. ఆ సందర్భంలో ఆయన ఎనిమిది నెలల పాటు చైతన్యుల సన్నిధిలో వుండి వున్నారు. చైతన్యుల కోరికమేరకు ఆయన తిరిగి తమ ఇంటికి వెళ్లి పోయారు. జననీ జనకుల మృతి పిమ్మట ఆయన పురికి వెళ్లారు. ఈ తడవ కూడ ఆయన పది నెలల కాలం పురిలో గడిపి, తర్వాత చైతన్యుల ఇచ్ఛాను సారం బృందావనం వెళ్లిపోయారు.

చైతన్యుల పురీ ప్రవాసంలోని చివర పద్దెనిమిది సంవత్సరాలలోను చెప్పుకోదగ్గ బాహ్య సంఘటనలేమీ అంతగా ఘటిల్లలేదు. ఈ జీవిత సమయంలోని అధికాధిక భాగం, భగవానుల దైనందిన పూజా పాఠాదికంలోనూ, భక్తి భావ విహ్వలతలోనూ గడిచిపోయింది. బైటినుంచి చూడడానికి, ఈ కాలంలో ఆయన గడిపిన దివ్యోన్మాదభరితమూ భక్తి భరితమూ అయిన జీవితం, సాధారణ జీవితంగా కానవస్తుంది. చైతన్యుల వంటి సాధు సన్న్యాసుల జీవితం అనుక్షణమూ మహోత్వపూర్ణమైన సంఘటనలతో, రాజాధిరాజుల జీవితంవలె, కూడి యుండకపోయినప్పటికీ, ధార్మికదృష్టితో చూసినప్పుడు వారి యీ జీవితభాగం ఎంతో మహిమాన్వితమైనదే.

చైతన్యులు, నిరంతరాయంగా, నిర్విరామంగా పురిక్షేత్రంలో పద్దెనిమిదేండ్లు నివసించడం మూలాన, నిస్సందేహంగా ఒరిస్సాలోని వైష్ణవమతాందోళనం పైన గంభీర ప్రభావ ముద్రపడి వుంటుంది. లోగడ చెప్పినట్లు ప్రతాపరుద్రమహారాజు చైతన్యుల ప్రశంసకులుగా మారారు. అప్పుడప్పుడూ వారి సందర్శనార్థం వస్తూవుండేవారు. కొందరి అభిప్రాయం ప్రకారం రాజు చైతన్యమతాన్ని స్వీకరించి చైతన్యులకు శిష్యుడయ్యాడు. కాని ఇందుకు తగిన ప్రబలమైన చారిత్రకాధారమేమీ కనబడదు. కాని ఆయన చైతన్యుల యెడల భక్తి భావంతో ప్రవర్తించడం వల్ల ఒరిస్సాలోని వైష్ణవాందోళనకు అప్రత్యక్షమైన బలసంపద తప్పక చేకూరి వుంటుంది. ఎందుచేతనంటే, తద్వారా ఒరిస్సాలోని ప్రజలలో చైతన్యుని గురించి మహిమామండితమైన, గరిమామయమైన సద్భావమేర్పడి వుంటుంది.

# II

# చైతన్యులు – ఒరిస్సాలోని వైష్ణవమతం

చైతన్యుల ద్వారా ప్రేరితమైన వైష్ణవ మత ప్రచారం కొరకు మూడు ముఖ్యమైన కేంద్రాలేర్పడినాయి. బెంగాలులోని నవద్వీపం, ఒరిస్సాలోని పూరి జగన్నాధం, ఉత్తర ప్రదేశ్ లోని బృందావనం.

ఈ మూడు కేంద్రాలలోకి గూడ, చైతన్యమత చరిత్రలో ఒరిస్సాకు మరింత ప్రముఖమైన స్థానం కద్దు. డాక్టరు బిమాన బిహారి మజుందారు అభిప్రాయానుసారం, చైతన్యుల సహయోగుల సంఖ్య 490 మంది లోనూ, దాదాపు 60 మంది వంగేతరులు. అందులో 44 గురు ఒరిస్సాకు చెందలినవారు. అనేక సంవత్సరాలు ఒరిస్సాలో వుండడంవల్ల, ఒరిస్సాలో చెప్పుకోదగ్గమంది శిష్యులుండడం సహజమే.

ఒరిస్సా వైష్ణవ మత చరిత్రలో చైతన్యులు నిర్వహించిన భూమికను విలువగట్టే సందర్భంలో మనయొక విషయాన్ని గుర్తుంచుకోవాలి. చైతన్యులు పురికి రాకమునుపే, ఉత్కళంలో వైష్ణవం ప్రచారం పొంది వుంది. చైతన్యుల పూర్వం, ప్రచలితమైవున్న వైష్ణవం, ఒరిస్సాలో రెండు విధానాలుగా వుంది. ఒకటి కేవలం కృష్ణ పూజా మీద ఆధారపడిన భక్తి పరమైన వైష్ణవ విచారధార. రెండు – బుద్ధ విగ్రహంగా భావింపబడే జగన్నాధుని యెడల భక్తి జ్ఞాన సమ్మిశ్రితమైన విచారధార.

చైతన్యులు రాధా కృష్ణుల ఉపాసనాపద్ధతిపై ఆధారపడివున్న తమ మతాన్ని ప్రచారం చేయడం ఆరంభించిన తర్వాత నెమ్మదినెమ్మదిగా పైన ప్రస్తావింపబడిన రెండు వైష్ణవ విచారధారలు, వారి నవ్య వైష్ణవ మతం యొక్క ప్రధాన ధారలో విలీనమైపోయినాయి. ఈ రెండు ప్రవృత్తులలో – రెండవ ప్రవృత్తి చైతన్యులు గతించిన పిమ్మట కూడ కొంతకాలం వరకు ప్రత్యేకమైన తన అస్తిత్వాన్ని నిలుపుకో గలిగింది.

తర్వాతికాలంలో, గౌడీయ వైష్ణవ మతంలో ఈ వైష్ణవ విచారధార విలీనీకరణం శ్యామానందుల పరిశ్రమ మూలంగా పూర్ణమై సఫలమైంది. వైష్ణవ భక్తుడైన

శ్యామానందుడు,జీవగోస్వామి శిష్యులైన శ్రీనివాసు, లోకనాథ గోస్వామి శిష్యుడైన నరోత్తముని సమకాలికుడూ, సహకర్మి యున్నూ. శ్యామానందుడు, అతని శిష్యుడు రసికానందుడు, వీరిద్దరి పరిశ్రమ ఫలితంగా క్రీ.శ. పదహారవ శతాబ్దం ఉత్తరకాలంలో, పదిహేడవ శతాబ్దం ప్రారంభంలో, చైతన్యుల పట్టశిష్యులైన ఆరుగురు గోస్వాముల ద్వారా ప్రతిపాదితమైన బృందావన భక్తి సిద్ధాంతం, ఒరిస్సా జనులకు గూడ విశేషప్రీతికరమై, వారి ప్రధానమతంగా రూపొందింది. చైతన్యుల ద్వారా ప్రారంభింపబడిన వైష్ణవమత యజ్ఞంలో, ఒరిస్సాలో ఆమతం స్థిరంగా నిల్వద్రొక్కుకోగలడం, పూర్ణాహుతి వంటిది.

ప్రస్తుతం ఒరిస్సాలో, వైష్ణవమతం యొక్క ప్రారంభదశను వివేచిద్దాం. ఒరిస్సాలో ప్రాక్చైతన్య వైష్ణవ మతాలెన్నో కానవస్తాయి. దానికి కావలసిన ఉదాహరణలెన్నో మనకు లభిస్తాయి. రేమునాలోని గోపీనాథ మందిరం, ఉత్కలంలో కృష్ణపూజా విధానం చాల కాలంగా ఉన్నట్లు, అది కృష్ణభక్తికి ప్రధాన కేంద్రంగా విలసిల్లినట్లు, మనకు నిరూపిస్తోంది. ఇక్కడనే మాధవేంద్రపురి, గోపీనాథమూర్తిని దర్శించి సమాధి దశ చెందారు.

ప్రతాపరుద్ర మహారాజులుంగారి తండ్రిగారైన పురుషోత్తమ గజపతి ఎన్నోభక్తి స్తోత్రాలను రచించిన మహనీయుడు. వీనిలోనుంచి ఆరుస్తోత్రాలను రూపగోస్వాములు తమ సంకలన గ్రంథమైన 'పద్యావళి'లో సంగ్రహించారు. పురుషోత్తమ నరపాలుని ద్వారా రచితమైన ఈ శ్లోకాలను బట్టి గోపీజనంతో వివిధ క్రీడలలో రమించే శ్రీకృష్ణుని, అప్పటి వారు పూజించేవారని మనకు తెలియవస్తుంది.

కృష్ణదాస కవిరాజ రచితమైన 'చైతన్య చారితామృత' మనే గ్రంథం చాలా ప్రసిద్ధమైనది. దీని నుంచి మనం, రామానందిరాయ్ చైతన్యుల సంపర్కంలోకి రాక పూర్వమే వైష్ణవభక్తి పరుడనే సంగతి తెలుసుకుంటాం. ఇంతేకాదు; రాయరామానందులు 'జగన్నాథ వల్లభ' నాటకాన్ని చైతన్యుల తోటి సమావేశం కాకమునుపే రాసినట్లు కనబడుతుంది. ఇందులో ఎక్కడా చైతన్యుల నామస్మరణ జరిగియుండ లేదు. 'జగన్నాథ వల్లభ' నాటకంలో రామానందులు మిగుల కౌశలంతో భగవంతునిపై గల రాధ యొక్క ప్రేమ వైవిధ్యాన్ని అభివర్ణించారు. చైతన్యుల సమక్షంలో రాయరామానందుల, 'పహలా హిణగ నయన భంగభేలా' అనే ప్రసిద్ధ పదాన్ని గానం చేసి వినిపించినట్లు చెబుతారు. ఈ పదం స్వయం రామానందులు రచించిందే. ఈ సంగతి మనకు కర్ణపూరకవి రచించిన 'చైతన్య

మహాకావ్యం' నుండి కృష్ణదాస కవిరాజు రచించిన చైతన్య చరితామృతం నుండి తెలియవస్తుంది. రామానంద రాయ రచితమైన వ్రజావలి నుండి, ఆయన విద్యాపతి పదావలి తోటి పరిచయం కలిగియున్నాడని కూడ తెలుస్తుంది.

సాహిత్య గ్రంథాల్లోనూ ఇతరత్రా కూడా దొరికే ప్రమాణాలను బట్టి చైతన్యులవతరింపక పూర్వమే ఉత్కల దేశంలో రాధాకృష్ణోపాసనపై ఆధారపడి ఉన్న వైష్ణవ భక్తి ధార ప్రవహిస్తూన్నట్లు స్పష్టమవుతుంది.

ఈ సందర్భంలో జ్ఞాపకముంచుకోవాలిసిన మరో విషయమేమిటంటే, ఒరిస్సాలో బౌద్ధమతం విరివిగా ప్రచారం పొంది ఉండడం. తర్వాతికాలంలో బౌద్ధమతం క్షీణప్రాయమైన దశలో ఉన్నప్పుడు, అనేక మంది బౌద్ధులు సనాతన హిందూధర్మంలో తిరిగి వచ్చి చేరారు. కాని హిందూమతం ముఖ్యప్రవాహంలో వాళ్ళు కలిసి పోయినప్పటికీ, వాళ్ళల్లో బౌద్ధమతానికి చెందిన కొన్ని విశేషాలు మిగిలే ఉండేవి. వాళ్లు జగన్నాధుని బుద్ధ రూపంలోనే గ్రహించారు. ఆ విధంగానే వాళ్లు జగన్నాధుని ఉపాసింప మొదలుపెట్టారు. వారి అభిప్రాయానుసారం, శ్రీకృష్ణుడే బుద్ధరూపంగా, జగన్నాధుడనే నామంతో 'సమస్త దుష్టశక్తుల్ని పరాభూతం చేయడానికి' వీలుగా అవతరించాడు. జగన్నాధదాసుని 'దాసబ్రహ్మ' అనే పుస్తకంలోనూ, అచ్యుతకృత 'శూన్యసంహిత'లోనూ ఈ విధమైన అభిప్రాయాలు ప్రతిపాదింపబడినట్లు చూడవచ్చు. ఈ ఇరువురూ కూడా ఒరిస్సాలో ఈ విధమైన విచారధారను ప్రవహింపచేసిన వారిలో ప్రముఖులు. ఒరిస్సాలోని సమాన విచార సరణి గల ఇతర వైష్ణవుల ద్వారా రచితమైన గ్రంథాలనుండి కూడ, ఈ ఉపాసనా పద్ధతిలోని వైశిష్ట్యాన్ని మనం తెలుసుకోవచ్చు. వాళ్లు బౌద్ధయంత్రం ద్వారా నిర్గుణోపాసన చేస్తూ ఉండేవాళ్లు. మరో ప్రక్క రాధాకృష్ణ మంత్రాన్ని, తర్వాతి 32 మంత్రాల్ని జపిస్తూ ఉండేవారు. ఈ సిద్ధాంతం జగన్నాధ దాసుని 'రసకృద్' బలరామదాసుని 'వట అవకాశం' 'విరాటగీత' అనే గ్రంథాలు, అచ్యుతుని 'అనాకార సంహిత' 'శూన్య సంహిత', శివ స్వరోదయం' అనే గ్రంథాలు – వీటన్నింటిలోనూ ప్రతిపాదింపబడింది.

చైతన్యులు జగన్నాధదాసుని శ్రీ మద్భాగవత పారాయణానికి ముగ్ధులయ్యే వారని కూడ వినికిడి. సారాంశ మేమనగా ఒరిస్సాలోని భక్తులలో శ్రీమద్భాగవతానికి, చైతన్యుల కంటే ముందే కావలసినంత ప్రతిష్ఠ ఏర్పడింది.

ఈ విశిష్ట సంప్రదాయంలో అంటే పూర్వ బౌద్ధుల అనుయాయి వర్గంలో

ఐదుగురు చాలా ప్రధానమైన వ్యక్తులు. వారు 'పంచసఖా' అనే పేరుతో ప్రసిద్ధులు. వీరు 1. జగన్నాథ దాసు, 2. బలరామదాసు, 3. అచ్చుతానంద్, 4. అనంతుడు, 5. యశోవంతదాసు అను పేరువారు.

ఈ అయిదుగురిలో ప్రతిఒకరూ చైతన్యులతో వ్యక్తిగతంగా పరిచయమున్నవారే. అందరూ వారి ఆశీర్వాదాన్ని పొందినవారే. వీరిలో ప్రతి యొక్కరూ ఒరియా భాషలో ఖ్యాతి నార్జించిన రచయితలే. 'పంచసఖా' – వీరి పేళ్లు, చైతన్యులతో వీరికి గల సంబంధం – ఇవన్నీ 'చౌరాసీ ఆజ్ఞ' అనే పుస్తకంలో వర్ణింపబడి ఉన్నాయి. ఈ పుస్తకాన్ని రచించిన సుదర్శనదాసు పంచసఖులలో ఒక్కడైన యశోవంతదాసుని పట్ట శిష్యుడు. ఈ పుస్తక మిప్పటికే అచ్చుపడలేదు. డా॥ బిమాన బిహారీ మజుందార్ తమ పరిశోధనావ్యాసమైన 'శ్రీచైతన్య చరితేర ఉపాదాన'లో దీని వ్రాత ప్రతిని గురించి ప్రస్తావించారు.

పంచసఖులలో ఒకడైన అచ్యుతానందుడు, పంచసఖులకు చైతన్యులకు మధ్య గల ఆత్మీయతను తాను రచించిన 'శూన్య సంహిత'లో వర్ణించాడు. చైతన్యుల ఆదేశానుసారం సనాతన గోస్వామి అచ్చుతానందునకు మంత్రోపదేశం చేసినట్లు కూడ ఇందులో వ్రాయబడి ఉంది. అచ్యుతుడు బహుశా, మొదట్లో చైతన్యుల ద్వారానే మంత్రోపదేశం పొందడానికి వెళ్లివుంటాడు. కానైతే చైతన్యులు ఆయనను సనాతనుల ద్వారా ఉపదేశం పొందవలసిందిగా చెప్పి ఉంటారు. ఈశ్వరదాసు రచించిన 'చైతన్య భాగవతం' గ్రంథానికి వ్రాత ప్రతి ఒకటి ఒరియా లిపిలో ఉంది. అందులో ఈ జగన్నాథ మూర్తి (భగవాను)యే అచ్యుతానందుని చైతన్యుల ద్వారా దీక్ష పొందమని ఆదేశించినట్లు ఉంది.

ఈ సంప్రదాయానికి చెందిన మహనీయవ్యక్తి అచ్యుతానందుడు. ఆయన గోపాల మఠాన్ని స్థాపించాడు. ఒరియాలోని గొల్లవాళ్లెందరో ఈ మతానుయాయులు అచ్యుతానందుడు కూడ యీ జాతివాడే. ఆయన కటక జిల్లాకు చెందిన త్రిపుర గ్రామంలో జన్మించాడు. ఆయన తల్లి పేరు పద్మావతి, తండ్రిపేరు దీనబంధుఖుటియా.

ఈ సంప్రదాయానికి చెందిన మరొక ప్రముఖుడు బలరామదాసునకు చైతన్యులు స్వయంగానే మంత్రదీక్షనిచ్చారు. చైతన్యులు సన్యాసం స్వీకరించి కటకం చేరడానికి జాజ్‌పురా గుండా వెళుతున్నప్పుడు బలరామదాసు చైతన్యులను

సందర్శించాడు. బలరామదాసు చంద్రపుర్‌లో జన్మించినట్లు భావించబడుతోంది. ఆయన తండ్రి సోమనాధ మహాపాత్రుడు. ఉత్కళరాజు ఆస్థానంలో కవి. బలరామదాసు 'జగమోహన రామాయణ' రచయితగా ప్రసిద్ధి పొందాడు. ఎల్లప్పుడూ చైతన్యుల వెంట నుండి వారి సేవ నిరంతరమూ చేస్తూ ఉండేవాడని వినికిడి.

పంచ సఖుల్లోనూ, జగన్నాధ దాసు చైతన్యులకు సమవయస్కుడు. చైతన్యులు ఆయన శ్రీమద్భాగవత పఠానికి చాలా సంతసించారు. గురువు తమ శిష్యులైన బలరామదాసుని జగన్నాధ దాసునకు మంత్రోపదేశం చేయవలసిందిగా ఆదేశించారు. జగన్నాధ దాసు ప్రాతర్వేళల చైతన్యులకు ముఖమార్జనం చేసేవాడని, ఇంకా ఇతర విధంగా ఆయనకు సేవలు చేస్తూ ఉండేవాడని మరొక పుస్తకంలో వ్రాయబడి ఉంది.

ఒరియా వైష్ణవులలో జగన్నాధదాసు సమాదరణ పొందిన వ్యక్తి. ఉత్కళ ప్రదేశంలోని అన్ని ప్రాంతాలలోనూ జగన్నాధ రచితమైన భాగవతానికి ఎంతో పేరు ప్రతిష్ఠలున్నాయి. ఆయనే పురీలో స్వామి మఠాన్ని స్థాపించినట్లు జనశ్రుతి. తారిణీ చరణ రథ్ వ్రాసి 'ఉత్కళ సాహిత్య చరిత్ర' అనే గ్రంథంలో చైతన్యులతో బాటు, జగన్నాధునికి గూడ ఉత్కళమందు వైష్ణవమతంపై ప్రభావ ముద్ర వేసిన గౌరవమీయబడింది. అనంతదాసు కూడ 'అయిదుగురు మిత్రుల'లో ఒకడు. కోణార్కమందలి సూర్యభగవానులు స్వప్న గోచరుడై, చైతన్యుల నుండి మంత్రదీక్ష పొందవలసినదిగా ఆదేశించినట్లు చెబుతారు. అనంత మోహంతి చైతన్యులను, మొదటిసారిగా, కోణార్కమందే సందర్శించి, వారిని దయాభిక్ష వేడాడు. చైతన్యులు నిత్యానందుని, అనంతునికి దీక్ష యిమ్మనమని ఆదేశించాడు. ఈ విధంగా అనంతుడు చైతన్యమత దీక్షితుడయ్యాడు.

యశోవంతదాసు పంచసఖుల్లో కడపటివాడు. చైతన్యులు తామే ఆయనకు దీక్ష యిచ్చారు. ఈశ్వరదాసు రచించిన చైతన్య భాగవతానుసారం జగన్నాధుని మూర్తి యశ్వంతదాసుని, చైతన్యులనుంచి ఉపదేశం పొందమని సలహా ఇచ్చినదట!.

ఈ 'అయిదుగురు మిత్రులు' మొదట బౌద్ధమతానుయాయులు. వీరిని చైతన్యులు వైష్ణవమతంలోకి మార్చారు. కాని చైతన్య ప్రభావంలో ఉంటూ, వైష్ణవ మత స్వీకారం చేసినప్పటికీ, వీరు సర్వాత్మనా బౌద్ధమతంలోని అన్ని అంశాలను వదలుకోలేక పోయారు. కొన్ని వీరి స్వభావగతాలుగా నిలిచి పోయినాయి.

వీరు వ్రజ భూమికి చెందిన ప్రేమధర్మాన్ని సర్వాత్మనా హృదయంగమం చేసుకోలేక పోయారు. వీరి సిద్ధాంతం కూడ గౌడీయ వైష్ణవ మతం కంటే భిన్నమే. కాని ఈ భేదమున్నప్పటికీ, వీరిని అవైష్ణవులుగా భావించలేము. వీరు చైతన్యులను బుద్ధదేవుని అవతారంగా సంభావించి వారిని పూజించేవారు.

వైష్ణవ విద్వాంసులైన కొందరి అభిప్రాయానుసారం, ఒరియా భక్తులు కనీసం పదిహేను వరకైనా చైతన్యుని జీవిత చరిత్రలు రాసి ఉంటారు. ఉదాహరణార్థం ఈశ్వరదాసు రచించిన చైతన్య భాగవతం మనం గ్రహించవచ్చు. కొన్ని చైతన్యుల మృతి తరువాత నూరు నూట ఏబదేండ్లకు రాయబడి ఉంటాయి. వీనిలో కొన్ని నేటి వరకూ అచ్చు కాలేదు. వ్రాతప్రతులుగానే ఉండిపోయినాయి. చారిత్రక దృష్టితో చూసినప్పుడు చైతన్యునిపై ఒరియా భాషలో రచింపబడిన జీవిత చరిత్రలలో కెల్లకనాయి ఖుంటియా రాసిన 'మహాప్రకాశ' మనే గ్రంథం ప్రధానమైన దెందుకంటే దీని రచయిత పురీలో గురు సన్నిధానంలోనే ఉంటూ ఉండేవాడు.

ఒరిస్సాలో ఇంకా ఎంతో మంది అనుయాయులు, సహచరులూ ఉంటూ ఉండేవారు. వారందరిని గురించి ఇక్కడ వ్రాయబడిలేదు. ఒరిస్సాలోని చైతన్య వైష్ణవ శాఖగా చరిత్రను గురించి పరిశోధన చేయుటకు గూడ వారి వివరణ ఆవశ్యకం కాదు. వాస్తవానికి చైతన్య వైష్ణవ ప్రచారం ఒరిస్సాలో రాయరామానందు, ప్రతాపరుద్ర గజపతులు చైతన్యులపై ఆదరాభిమానాలు చూపడంతోటే ప్రారంభమైంది. కృష్ణోపాసనకు సజీవ ప్రతీకగా చైతన్యులు 20 సంవత్సరాలపాటు ఒరిస్సాలో నివసించారు. వారి శిష్యులు, అనుయాయులు వారిని ఆదర్శంగా తీసికొని వారి మతాన్ని నలుదెసలా వికసింపచేశారు. చైతన్యుల పట్టి శిష్యుడైన శ్యామానందుని కాలంలో గౌడీయవైష్ణవమతం ఒరిస్సాలో అత్యంతం లోకప్రియమై జనరంజకమై, ప్రచార పరాకాష్ఠ నందుకొన్నది.

## చైతన్యుల సన్న్యాసంలోని ఆదర్శం

చైతన్యులు పురిలో తమ జీవితం చివరి భాగంలో కొన్నాళ్లు తమకత్యంత సన్నిహితులైన శిష్యులతో గడిపారు. క్రమక్రమంగా వారు ఉపాసనా వేళలో మిగుల ఉద్రేకం పొందుతూ వచ్చారు. స్వదేహభానము కూడ లేక పరవశించి పోయేవారు. శరీరాన్ని నియంత్రణంలో ఉంచుకోలేకపోయేవారు. స్వరూప దామోదరుడు,

గోవిందుడు మరియు మిగిలిన భక్తులైన శిష్యుల ద్వారా మిత్రుల ద్వారా వారిని నిరంతరమూ కనిపెట్టుకొని కాపాడుతూ ఉండడం అవసరమై పోయింది.

మరోవైపు చైతన్యులు సన్న్యాస జీవితంలో పాటించవలసిన నియమనిష్ఠలనన్నింటినీ, కర్తవ్యకర్మలనన్నింటినీ, నిర్వహిస్తూ కఠినమూ కష్టసాధ్యమూనయిన జీవితాన్ని గడుపుతూ ఉండేవారు. వారి స్వభావంలో మృదుత్వమూ, కాఠిన్యమూ రెండూ పెనవైచికొని ఉండేవి.

చైతన్యవ్యక్తిగత జీవనం, పద్దెనిమిదేండ్లలోనూ, అనగా వారి పురీ నివాస సమయంలో వారి జీవితంలోని తీరుతెన్నుల గురించి, సమకాలిక వివరణల బట్టి మనకెన్నో విషయాలు తెలుస్తాయి. సన్న్యాస జీవితానికి సంబంధించిన ఎంతటి ఉన్నతాదర్శాలను వారు నిలబెట్టారో, నిర్వహించారో అవన్నీ మనకనుల ముందు ప్రకాశిస్తాయి. వారెన్నడూ తమభావావేశం మూలంగా గాని, లేక తమ దివ్యోన్మాదం మూలంగా గాని తమ నిజమైన ఆదర్శపథం నుంచి విచలితులు గాలేదు. వారు సంపూర్ణంగా సర్వాత్మనా సన్న్యాస జీవితంలోని నియమనిష్ఠలను పరిపాలించారు. తమ ధార్మిక జీవితంలో పూర్ణవైరాగ్యానికి, భావ విహ్వల భక్తికి ప్రాధాన్యమున్నప్పటికీ, వారు సన్న్యాస జీవితంలోని ఆచరణ పక్షమందు జాగరూకులై వ్యవహరించేవారు. వారు ఆవిధంగా తమ భక్తుల ఎదుట, శిష్యుల సమక్షంలోనూ సన్న్యాస జీవితానికి సంబంధించిన ఉన్నతాదర్శాలను నిలబెట్టారు.

వారు తమ అనుయాయులకు ఉపదేశమిచ్చిన దానికంటే ఎక్కువ ఆచరించి చూపేవారు. ఒక శిష్యునికి వారు హితోపదేశం చేశారు. "రాజసమైన ఆహారాన్ని తీసుకోకు, ఆడంబరమైన వేషం వేయకు, తృణం వలె అణకువగా ఉండు, వృక్షం వలె ధైర్యం వహింపుము. అందర్నీ ఆదర భావంతో చూడు, నిరంతరం భగవద్భజన చేయి. భగవంతుని నామ సంకీర్తనంలో మునిగి తేలు" అని. వారు పై విషయాలన్నింటిని ఆచరించి చూపారు.

వారి భోజనం, వేషం, జీవన సరణి ఎంతో సరళంగా, సాదాగా ఉండేవి. రాత్రులందు కటిక నేలపై పరుండేవారు. చలికాలంలోనైనా సరే వేకువ జామునే లేచి చన్నీళ్లలో తలనిండా స్నానం చేసేవారు. గురువుగారి కష్టాన్ని చూసి ఓ రాత్రి ఆయన సహచరుడు జగదానందుడు ఆయన తలక్రింద దిండు తెచ్చిపెట్టాడు. చైతన్యులు అతన్ని చచ్చే చివాట్లు పెట్టి ఆదిండు తీసేశారు.

మరోసారి ఒక భక్తుడు ఆయనకు సుగంధ తైలంతో నిండి ఉన్న ఒక సీసా నిచ్చాడు. చైతన్యులు వెంటనే ఆ తైలం జగన్నాధుని మందిరంలో ఆరతి వేళ వెలిగించవలసిందిగా ఆదేశించాడు.

చైతన్యులకు, జగదానందుడు, ముకుందుడు లాంటి సహచరులు వచ్చి తన సౌకర్యం కోసరం కష్టపడుతూ ఉండడం ఇష్టం కాలేదు. ఆయనను గురించి వారు ఎల్లప్పుడూ కనిపెట్టుకొని ఉండడం, ఒక గార్హస్త్య జీవిత విశేషంగానూ, మోహపాశంగానూ భావించేవారు. ఆయన వారిని తనను గురించి ఎక్కువ ఆదుర్దా పడవలదని, అనవసరమైన శ్రద్ధ తీసికోవలదనీ నివారించేవారు. చైతన్యుల ధార్మిక జీవితం ముఖ్యంగా ఉత్కటమైన భావానుభూతి పైననే ఆధారపడి ఉంది. చైతన్యులు శ్రీకృష్ణ నామోచ్చారణ అధరముల పైకి రాగానే ఏవిధంగా అశ్రుమోచనం చేసేవారో రూపగోస్వాములు వ్రాసారు. రథయాత్రోత్సవ సందర్భంలో జన్నాధ రథం ముందు వారు చేసే నాట్యం ఎంత ఉన్మత్తంగా ఉండేదో ఆయన వర్ణించారు. అంతేగాదు, సముద్ర 'తటంపైని పొదల చూసి వారికి బృందావనంలోని నికుంజకుంజాలే విధంగా స్మృతికి వచ్చేవో, అది కూడ వర్ణించారు. ఇతర వివరాల వల్ల గూడ మనకు చైతన్యులు, సముద్ర తటంపైని ఇసుక తిప్పలు చూసి, గోవర్ధన గిరిని స్మరిస్తూ ఉండడం తెలుస్తుంది. వారు గొల్లపిల్లలు ఆవులను దొంగిలిస్తే, వాళ్లను బృందావనంలోని గోపాలకృష్ణుడుగా భావించి గట్టిగా కౌగిలించుకొనేవారు. వ్రజలీలా ప్రేరితులై వారెల్లప్పుడు కృష్ణవియోగం తీవ్రంగా అనుభవించేవారు. ఈ విధంగా రాధాభావంలోని మధురానుభూతిని పొందుతూ ఉండేవారు.

ఆదర్శవాదియై, భావవిహ్వలానుభూతులను పొందేయీమహనీయవ్యక్తి సన్న్యాసంలోని వజ్రకఠోరనియమాలనెలా పాలించేవారో, తమ శిష్యులకు కఠిన నియమపాలనం చేయవలెనని ఎలా హితవు గరపేవారో, ఊహించడానికి చాలా ఆశ్చర్యకరంగా ఉంటుంది. కాని ఇందులో రవంత కూడ వైపరీత్యం లేదు. చైతన్యుల నడవడిక నూటికి నూరుపాళ్లు నిష్కళంకమైంది. సమకాలికాలైన వివరణలన్నింటి వల్ల ఈ సత్యం ఋజువవుతుంది. తమ మోహకమైన భావుకప్రవృత్తి ఒక ప్రక్క అతివేలంగా ఉంటూ ఉన్నప్పటికీ, వారు సన్న్యాసంలోని కఠోరాదర్శాలను ఎన్నడూ ఉల్లంఘింపలేదు. చైతన్యుల వైరాగ్య భావన గురించి మరి కొన్ని ప్రమాణాలు ఈ క్రింద ఈయబడుతున్నాయి.

చైతన్యులు సాధారణంగా మహిళల నుండి, పనిగట్టుకొని దూరంగా ఉంటే ఉండేవారు. ముదుసలులైన భక్త మహిళలు తమదర్శనార్థం వచ్చినా వాళ్లను కూడ చెంత చేరనిచ్చేవారు కారు. మహిళల విషయంలో వారు చాలా కఠోరంగా ఉండేవారు.

కృష్ణదాస కవిరాజు తన 'చైతన్య చరితామృతం'లో, స్త్రీలు చైతన్యుల దర్శనం దూరం నుంచి చేసివెళ్లిపోతూ ఉండేవారని రాశాడు. 'ఎప్పటి వలెనే భగవానులు వారిని కలుసుకున్నారు. స్త్రీలు దూరం నుంచే వారి దర్శనం చేసుకొన్నారు' అనే పంక్తులు ఆయన రాశాడు.
చైతన్యుల సమకాలిక భక్తులు 'గురుదేవులు స్వయంగా నియమపాలన చేస్తూ ఇతరులను చేయ ప్రోత్సహించేవారని' రాశారు.

ముకుందుని వృద్ధమాతకు సంబంధించిన సంఘటన ఇక్కడ పేర్కొన దగ్గది. ముకుందుడు నవద్వీపంలో, చైతన్యులకు బాల్యమునుంచి చిక్కని స్నేహితుడు. చైతన్యులు పురీలో ఉంటున్నప్పుడోసారి ముకుందుని తల్లిదండ్రులు వంగభూమి నుండి ఆయేడు జగన్నాథుని రథయాత్రోత్సవ సందర్భంలో పాల్గొనడానికి వచ్చే భక్తబృందంతో పాటు పురీకి వచ్చారు. ముకుందుని, తండ్రి పరమేశ్వర మోదక్, నవద్వీపంలో మిఠాయి దుకాణం పెట్టి వ్యాపారం చేసేవాడు. చైతన్యులు బాల్యావస్థలో పరమేశ్వరుని దుకాణానికి వెళ్లేవాడు. పరమేశ్వరుడాయనకు రక రకాలైన మిఠాయిలు పెట్టి తినిపించేవాడు. చైతన్యులు తురీయాశ్రమం తీసుకొని పురిలో ఉంటున్నారనీ, వారి సందర్శనార్థం అసంఖ్యాకంగా భక్త జనం వెళ్లి ఆయనను సేవించి వస్తూ ఉంటారనీ విని, పరమేశ్వరుడు గూడ తన పత్ని వెంట ఆయన దర్శనార్థం పురీకి వచ్చాడు. వారిరువురూ ఆయన నుండి ఆశీర్వాదం పొందగోరారు.

గుంపులో నుండి పెల్లగించుకొని వచ్చి, చైతన్యుల ముందు నిలబడి ప్రణమిల్లి పరమేశ్వరుడు "నేను పరమేశ్వరుడను" అని విన్నవించాడు. చైతన్యులు ఆయనను గుర్తు పట్టారు. వారాయనను చూసి మిగుల ప్రసన్నులైనారు. "క్షేమమా? పరమేశ్వర్! మీరు రావడం మంచిదైంది" అని కుశల సంప్రశ్నం చేశారు.

పరమేశ్వరుడు "ముకుందుని తల్లి కూడ వచ్చింది" అని చెప్పాడు. కాని చైతన్యులా మాట విని సంకోచించారు.

చైతన్యులు ఇరుగుపొరుగువారనీ, తను బాల్యంలో తమ యెడల ప్రేమగా వర్తించేవారనీ, వారిని దగ్గిర కూచోబెట్టుకొని స్నేహార్ద్రంగా కొన్ని ముక్కలు మాటలాడాలి వారితోనని అనుకున్నారు. అయితే అంచేత, సన్న్యాస ఆశ్రమ ధర్మానికి కొంతలోటు రావచ్చుననీ, ఈఇరువురినీ చూసి, మిగతా స్త్రీలు కూడ తమకు దగ్గిరసా రావడానికి ప్రయత్నించవచ్చుననీ భావించి, ఈసందర్భంలో చాలా వెనుక ముందులాడారు. కృష్ణదాస కవిరాజ రచితమైన చైతన్య చరిత్రంలోని 'అంతలీల'లో ఈ సందర్భం వర్ణించబడింది.

కనిష్ఠ హరిదాసుని కథ కూడ ఉంది. ఆయన సంకీర్తనలు చక్కగా పాడే గాయకుడూ చైతన్యునికి పరమ భక్తుడునూ. ఒక రోజు భగవదాచార్యులు, ఆయనను గురుదేవులను భిక్షాస్వీకారానికి ఆహ్వానింపవలసినదిగా కోరారు. కనిష్ఠ హరిదాసు శిఖీమైతి చెల్లెలు మాధవీదేవిని కొద్దిగా బియ్యం అడగడానికి వెళ్లాడు. మాధవీదేవి వయసులో పెద్దదే. అంతేగాక మంచి భక్తురాలు కూడా. చైతన్యులు భగవదాచార్యుల ద్వారా ఈ విషయం తెలుసుకున్నప్పుడు, వారు మనస్సులో చాలా కటకట పడ్డారు. ఆయన వెంటనే తన పరిచారకుడైన గోవిందుని ఆదేశించారు. "ఇక ముందెప్పుడూ కనిష్ఠ హరిదాసుని ఇక్కడకు రానీయవద్దు. నా ఆజ్ఞను తూ.చా. తప్పకుండ పాలింపవలసింది" అని.

హరిదాసు ఇహ ముందు ఆచార్యుల వారి సన్నిధి తనకు దూరమైపోయిందని తెలుసుకొని చాలా దుఃఖించాడు. కాని ఆయనకు ఎవరూ ఈ కఠోరాదేశానికి వెనుకనున్న కారణమేమిటో చెప్పారు కారు.

కనిష్ఠ మరిదాసుని దుఃఖకరమైన స్థితి చూసి చైతన్యుల శిష్యులైన స్వరూప దామోదరుడు, మొదలైనవారు చాలా చింతించారు. ఒకరోజున సాహసించి వారు గురుదేవులను హరిదాసు చేసిన నేరమేమిటని అడిగారు. చైతన్యులు జ్ఞాపకముంచుకో దగిన జవాబు ఈ విధంగా ఇచ్చారు "నేను స్త్రీతో మాటలాడే సాధువుల మొగం చూడదలచ లేదు. కారణమేమిటంటే ఎంతటి విద్వాంసుడైనప్పటికీ, బలవంతములైన భావావేశాలకు ఏ క్షణంలోనైనా లొంగి పోవచ్చు".

ఈ ఉపదేశవాక్యాలు విని భక్తులు తమ శిరస్సులు వంచారు. కొన్ని రోజుల తరువాత వారు తిరిగి కనిష్ఠ హరిదాసుని పక్షం పూని గురువులతో మాటలాడడానికని వచ్చారు. వారు చైతన్యులకు నివేదించారు. "మహాప్రభూ! హరిదాసుని ఈ చిన్ని

తప్పిదాన్ని మన్నించండి. అతనికి కావలసిన దండన లభించింది. అతడు తిరిగి ఎన్నటికీ అటువంటి పని చేయడు" అని.

చైతన్యులు ఏమీ జారిపోలేదు. వారు తమ శిష్యులకు "నేను ఈ విషయాన్ని గురించి నా మనస్సును మెత్తపడ చేయలేను. మీరు మీమీ పనుల్లో జొరబడి పొండి, ఈ అనవసరమైన చర్చలు వదిలేయండి. ఈ సందర్భంలో తిరిగి మీరు గనక మాట్లాడితే, మీరు నన్ను ఈ పరిసరాల్లో చూడలేరు". అని గట్టిగా వక్కాణించారు.

మహాప్రభువుల ఈ రూక్ష తీక్షణ వైఖరి గమనించి భక్తులు కలలో గూడ స్త్రీలతో మాటలాడడానికి సాహసింపలేకపోయేవారు. తన అవమానాన్ని భరింపలేక దురదృష్టవంతులైన కనిష్ఠ హరిదాసు గంగా యమునల సంగమస్థానంలో మునిగి అసువులు గోల్పోయాడు.

చైతన్యుల విశ్వాస పాత్రుడు, స్థిర సహచరుమూ ఆయన గోవిందుడా సమయంలో పురీలోనే ఉంటూ ఉండేవాడు. అతనికి చైతన్యులకు గల స్త్రీ పరాఙ్ముఖత్వం చక్కగా తెలుసు. అంచేత ఆయన ఎంతో జాగ్రత్తగా కనిపెట్టి ఉండేవాడు చైతన్యుని – ముఖ్యంగా ఆయన దివ్య ప్రేమోన్మాదంతో మైమఱచి ఉన్నప్పుడు – ఏ స్త్రీ ఆయన ఎదుటబడకుండా ఉండేటట్లు చూసేవాడు. చైతన్యులు తామే గోవిందుని ఆవిధంగా ఆదేశించి కూడ ఉన్నారు. ఏ సందర్భంలో చైతన్యులు అటువంటి ఆదేశాన్ని ఇచ్చి ఉన్నారో అది ఈ క్రింద ఉటంకింపబడుతోంది.

ఒకరోజు చైతన్యులు గోవిందునితో కూడి, యోమేశ్వరటోటా ఇంటికి వెల్తూ ఉండిరి. మార్గమధ్యంలో, జయదేవ రచితమైన గీత గోవిందానికి చెందిన గుర్జరీరాగం యొక్క తానం విని వారు ముగ్ధులైపోయారు. గీత గోవిందంలోని పాట విని వారు సమాధి దశలోకి వెళ్లారు. స్పృహ లేకుండా, పరవశించి, ఆ సంగీత ధ్వని వచ్చే వైపు పరుగెత్త మొదలిడారు. కాని ఆ గీత మెవరో ఒకానొక స్త్రీ పాడుతూ ఉండడం గ్రహించి, గోవిందుడు కూడ చైతన్యుల వెంట పరుగెత్తి వెళ్లాడు. అక్కడికి చేరక మునుపే గురుదేవులను ఆపి వారితో అన్నాడు. "ఈ పాట ఎవరో స్త్రీ పాడుతోంది."

'స్త్రీ' శబ్దం విని చైతన్యుల లౌకిక స్పృహ తిరిగి వచ్చింది. వారు ఆదెసలో ఇక ముందు కొక్క అడుగైనా వేయకుండా వెనుకకు వచ్చేశారు. వారు గోవిందునితో

"నేడు నీవు నాజీవితాన్ని రక్షించావు. నేను ఈ మనో దశలో తెలియకుండా ఆమె సన్నిధికి చేరి ఉంటే మరణమే నాకు దాపురించి ఉండేది. నేను నీ యీ ఋణాన్ని ఎన్నటికీ తీర్చుకోలేను. నీవు ఎల్లప్పుడూ నా వెంట ఉండి, నన్ను కనిపెట్టికొని, అన్ని సందర్భాల్లనూ నన్ను రక్షిస్తూ ఉండాలి సుమా" అని అన్నారు.

కృష్ణదాస కవిరాజ రచితమైన చైతన్య చరితామృతంలోని 'అంతలీల'లో ఈ ఘట్టం వర్ణింపబడి ఉంది. గురువుల జీవితంలోని చరమదశకు సంబంధించిన వైనమంతా కృష్ణదాస కవిరాజునకు రఘునాధ దాసు ద్వారా లభించింది. రఘునాధదాసు చైతన్యుల మహనీయ శిష్యులలో ఒకరు. వారు నైరంతర్యంగా గురు సన్నిధానంలో పురిలో పదహారు సంవత్సరాల పాటు ఉన్నారు. అంచేత గురు దేవుల జీవితంలోని చరమ భాగానికి చెందిన ఇతివృత్తానికి కవిరాజు ద్వారా రాయబడిన వివరాలు, ప్రామాణికాలుగా మనం గ్రహింపవచ్చు.

చైతన్యుల సన్న్యాసాశ్రమంలోని ఆదర్శమిట్టిది. వారు తమ జీవితం చరమ భాగాన్ని ఈ విధంగా పూరీ జగన్నాధంలో గడిపారు.

## చివరి రోజులు

చైతన్యులు జీవితం చరమభాగంలో 'గంభీర'లో ఉన్నారని చెబుతారు. గంభీరంలోని కాశీశ్వర మిశ్రుల ఆశ్రమంలో మట్టితో నిర్మింపబడిన కుటీరం. వారు లౌకిక జీవితంలోని చరమ భాగంలో భక్తి తన్మయత్వంలో మునిగిపోయి ఉండేవారు. వారి దివ్యప్రేమోన్మాదం దాదాపు ఉన్మత్తావస్థ వరకు చేరుతున్నట్లయ్యేది. వారి యీ భావదశను ప్రేమోల్లాసమని వ్యవహరించేవారు. వారి జీవిత చరమభాగం ఇటువంటి దివ్యమైన ప్రేమమయమైన ఆధ్యాత్మికానుభవములతో నిండి తొణికిసలాడుతూ ఉండేది.

చివరికి అకస్మాత్తుగానే వారి లౌకిక జీవనం పరిసమాప్తమైంది. కేవలం వలభై ఎనిమిది సంవత్సరాల వయసులోనే వారు ఇహలీల చాలించారు. ఆకరగ్రంధాలన్నీ ఏక వాక్యంగా వారు క్రీ.శ. 1533లో మృతినందినట్లు వాకొంటున్నాయి. చైతన్యుల జీవితంపైననూ, తత్కాలీన పరిస్థితులపైనను ప్రామాణిక రచయితయైన డాక్టరు విమాన బిహారీ మజుందారుని అభిప్రాయానుసారం చైతన్యుల మృతి 9 జులై 1533 క్రీ.శ.లో జరిగింది. కాని వారి జీవిత చరిత్రకారులలో మృతి సంభవించిన తీరును గురించి ఏకవాక్యత లేదు. నిజానికి వారి మరణప్రసంగం

రహస్యమయమై పోయింది. తత్ఫలితంగా ఎన్నో పుక్కిటి పురాణాలు అందును గురించి బైలుదేరినాయి.

ఎన్నో గాథలు ఆయన మృతికి సంబంధించి లోకాన వెలిశాయి. ప్రామాణికాలైన ఆయన జీవిత చరిత్ర లెక్కువ భాగం ఈ విషయంపై మౌనమే భజించాయి. అందుచేత కూడ, వారి మృతిని గురించి వివిధ వార్తలు ప్రాకి పోయినాయి.

జనుల అగాధ విశ్వాసం మూలంగానూ, అంధవిశ్వాసం మూలంగా కూడ గురుదేవుల గురించి లోకంలో అలౌకికమైన భావన ఏర్పడింది. అట్టి వారి అభిప్రాయానుసారం చైతన్యుల పార్థివ శరీరంలో పంచభూతపరమైన పదార్థమేమీ లేదు. అందుచేత వారు పురీ జగన్నాథస్వామి మందిరంలో భగవాన్ జగన్నాథుని దివ్యమూర్తిలో సశరీరంగా లీనమైపోయారు.

చైతన్యుల జీవితం చరమభాగంలో ఒరిస్సాలోని అశేషజనం, భక్త బృందం వారిని దేవతా స్వరూపులుగానే భావించే వారనే మాట మనం గుర్తుంచుకోవాలి. జగన్నాథ మందిరంలోకి వెళ్లేటప్పుడు వారు రహస్యంగా వీలైనంత వరకు ఎవరికీ కంటబడకుండా వెళ్లేవారు. కారణమేమంటే, జనం వారి పాదాలపై బడి వారి చరణోదకాన్ని స్వీకరించడానికి అత్యంతాతురంగా ఉండేవారు. లోగడనే చెప్పాం వారికి తమ సేవగాని పూజగాని చేయించుకోవడమంటే తలనొప్పిగా ఉండేదని. అంచేత వారు జగన్నాథమందిరం సింహద్వారం ఉత్తరంలో ద్వారానికి వెనుక ప్రక్క ఉన్న కొద్దిపాటి జాగాను ఎంచుకున్నారు తమ కోసంగా. ఆచోటునంతా ఓ పెద్ద వేపచెట్టు కప్పివేసేది. దానిని జనం బైద్ పశారా అని పిలిచేవారు. చైతన్యులకు జనం తమరిని దేవునిగా భావించి, తమ చరణ స్పర్శ చేస్తూ ఉండడం గిట్టేది కాదు. వారు గోవిందుని తాము స్నానం చేస్తున్నప్పుడు తమ పరిసరాలకు జనాన్ని ఎవరినీ రానీవద్దని అజ్ఞాపించారు.

వారి ఆదర్శమయమైన ఆధ్యాత్మిక జీవితం కారణంగా, వారి మృతిని గురించి లోకంలో కల్పనా ప్రసూతాలైన కథలెన్నో విశ్వసించబడ్డాయి. జగన్నాథునిలో వారు లీనమైనట్లు చెప్పే కథ ఇది వరకే చెప్పి ఉన్నాం. మరో విశ్వాసం ప్రకారం వారు గోపీనాథుని మూర్తిలో లీనమైనారు.

లోకంలో ప్రచలితంగా ఉన్న మరొక విశ్వాసం ప్రకారం వారు భావవిహ్వలమైన ధార్మిక సమాధి దశలో తాముగా సముద్రగర్భంలో దూకి తనువు చాలించారు.

ఈ కథను కొంత మనం సమీక్షింప వలసి ఉంటుంది. ఎందుకనగా ఎక్కువ మంది దీనిని విశ్వసిస్తారు. కృష్ణదాస కవి రాజు తాను రచించిన చైతన్య చరితామృతంలో, ఇటువంటి సంఘటనను గురించే కొంత రాసి ఉన్నాడు.

ఈ విషయంపై తుది నిర్ణయం ఇవ్వడానికి పూర్వం, చైతన్యుల చిట్టచివరి రోజులను గురించి తెలుసుకోవడం, చైతన్య చరితామృతంలో వర్ణింపబడ్డ విశేష సంఘటన గురించి ముచ్చటించడం అవసరమై ఉన్నది.

జీవితం చరమ భాగంలో చైతన్యులు ఎక్కువ భాగం దివ్యోన్మాదస్థితిలోనే ఉంటూ ఉండేవారు. రాత్రివేళల, వారు మాటి మాటికి సమాధి దశలోకి వెల్లుతూ ఉండేవారు, వారికి తమ మీది నియంత్రణ కూడ తప్పిపోతూ వచ్చింది. సమాధి దశలో వారు మధ్య మధ్య పడక వీడి లేచి గది బైటికి వెళ్ళిపోయి, తోటలో శ్రీకృష్ణభగవానులెక్కడ ఎక్కడ అని తీవ్రంగా వెదుకుతూ ఉండేవారు. ఇటువంటి సంఘటనలు ఎక్కువగా రాత్రులందు జరుగుతూ ఉండేవి. ఆయన సన్నిధిలో ఉండే సహచరులు ఎంతో జాగ్రత్తతో కనిపెట్టి ఉండవలసి వచ్చేది.

ఓసారి ఓ రాత్రి, సహచరుడు కళ్లు విప్పిచూసే సరికి చైతన్యులు ప్రక్కమీద లేరు. గదిలోనూ లేరు. ఆయన వారిని ఆరుబైట వెదకనారంభించాడు. అనేక స్థానాల్లో వెదకి వేసారిన మీదట, చివరకు వారు జగన్నాధ మందిరం సింహద్వారం వద్ద స్మృతి తప్పిపడిఉన్న దశలో దొరికారు. కొంత సేపటికి తిరిగి వారికి స్మృతి కలిగింది.

చైతన్యులకు స్మృతి వచ్చిన పిమ్మట, వారక్కడికి, ఎప్పుడు ఎట్లా వచ్చారో, ఆయనకు ఏ మాత్రం స్పృహ లేదు. మొత్తం సమయమంతా వారు ఒక విధమైన సమాధి దశలోనే ఉండిపోయారు.

సమకాలిక వివరణలను బట్టి, మరోసారి చైతన్యులు 'జగన్నాధ వల్లభ' మని పేరుపడ్డ తోటలో తొమ్మిది రోజులట్లాగే ఉండిపోయారని తెలుస్తూంది.

చైతన్యులు ఆ రోజుల్లో నరేంద్ర సరోవర్, ఇంద్రద్యుమ్న సరోవర్ అనే తటాకాల్లో తఱచు స్నానం చేస్తూ ఉండేవారు. కొంత కాలం పురీలోని 'గిమ్‌దిచా' అనే సదనంలో ఉన్నట్లు తెలుస్తూంది.

శ్రీమద్భాగవతంలోని గోపీవిరహ గీతికా ఘట్టాన్ని విని వారు భావ విహ్వలులై పరవశించిపోతూ, ఉన్మత్త దశనందుకొనేవారు.

ఆ రోజుల్లో స్వరూప దామోదరుడు, రాయరామానందులు, వారి వెంట

అహర్నిశలూ ఉంటూ ఉండేవారు. చైతన్యులు ఈ విరహ శ్లోకాలకు వ్యాఖ్య చెబుతూ సమాధిలో లీనమైపోయారు. ఇటువంటి పరిస్థితిలో, వారి అనుయాయులు గురుదేవులను రాత్రివేళలందు కనిపెట్టి ఉండడానికని శంకరుడనే బ్రాహ్మణుని నియోగించారు. అతని పని గురుదేవులు తమ గది నుంచి వెలుపలికి అర్థ జాగ్రదవస్థలో వెళ్లిపోకుండా చూడడం.

కాని యింత జాగ్రత్త వహిస్తున్నప్పటికీ, చైతన్యులు ఓ రాత్రి సమాధి దశలోనే, గది నుంచి బైటి ప్రపంచంలోపడి, సముద్రం ఒడ్డుదాకా వెళ్లిపోయారు. విశాలమైన, ఉన్ముక్తమైన సాగరాన్ని అవలోకించేటప్పటికి, దాని గంభీరమైన నీలవర్ణం వారిని ఆకర్షించింది. విహ్వలావస్థలో వారు దానిలోనికి దూకారు. వారు సాక్షాత్తుగా నీలమేఘశ్యాముడైన శ్రీకృష్ణుని విరాట్రూపాన్నే, ఆలింగనం చేసుకుంటున్నంతగా సంతోషించారు. యమున పవిత్ర జలంలో మునకలు పెడుతున్నట్లనిపించింది వారికి. ఆయమున శ్యామునికి మిగుల ఇష్టం కదూ!

అదే సమయానికి దైవవశాత్తు బెస్తవాడొకడు చైతన్యులు సముద్ర గర్భంలోకి దూకడం చూశాడు. వాడు రోజూ అర్ధరాత్రివేళ సముద్రంలో వలపన్ని చేపలను బడుతూ ఉంటాడు. అతడు చైతన్యులను సకాలంలో పట్టుకొని, సజీవులుగా ఒడ్డుకు చేరవేశాడు. అదే సమయానికి స్వరూపదామోదరుడు, రాయరామానందుడు, మరికొంతమంది బక్తులూ, సముద్రతటంపైకి వచ్చిచేరారు. వీరంతా వీధుల్లోనూ, జగన్నాథుని మందిరంలోనూ చైతన్యుల కోసం వెదకి వేసారిపోయారుగాని అక్కడెక్కడా వీరికి చైతన్యులు దొరకలేదు. ప్రతాపరుద్ర మహా రాజునకు గూడ ఈ వార్త తెలిసి, వారు కూడ మిగుల ఖిన్నులైనారు.

చిట్టచివరికి, స్వరూపదామోదరుడు, రాయరామానందుడు, చైతన్యులను, సముద్రపుటొడ్డున స్పృహ తప్పిన స్థితిలో పడి ఉండడం చూశారు. చైతన్యులను బెస్తవాడు అక్కడ పరుండబెట్టి వెళ్లిపోయాడు. గురుదేవులకు స్పృహ తెప్పించడానికి, స్వరూపదామోదరుడు, మిగిలిన భక్తులూ, ఆయన చెవుల దగ్గిర శ్రీకృష్ణ నామోచ్చారణ చేయడం మొదలుపెట్టారు.

కొంతసేపటికి చైతన్యులకు స్పృహ వచ్చింది. కాని వారు దుర్బలంగా, రక్తహీనంగా, శ్లథగాత్రులై ఉన్నారు. శిష్యులకు, ఇకవీరెక్కువ కాలం ఈ సమాధి కష్టాన్ని వహింపలేరనిపించింది.

కాని వారు మెల్లమెల్లగా మామూలు స్థితికి వచ్చారు. అంతటిలో అందరికీ ప్రాణాలు లేచివచ్చినట్లయింది.

కృష్ణదాస కవిరాజు, ఈ సంఘటన తర్వాత చైతన్యులిచ్చిన హితోపదేశమును గురించి రాశాడు. అది చాలా స్మరణీయమైనది. వారు రాయరామానందులకు వ్యావహారికమైన హితోపదేశంవలె, ఒక ఆధ్యాత్మిక సూక్తినందించారు. చైతన్యులు వారికి చెప్పారు. "నీతి పరుడవుగమ్ము. తృణం కంటె కూడ నీవు నిన్ను వినమ్రునిగా భావింపుము. వృక్షంవలె ధైర్యంగా ఉండు. ఎవడైన చెట్టును కొట్టి పారేస్తే, ఆ చెట్టుకెటువంటి కష్టం కలుగదు. అది ఎండిపోతుందేగాని ఎవరినీ ఓ నీటి చుక్క దానంచేయమని అడగదు. ఎవరికి పడితే వారికి, కోరినప్పుడల్లా, ముక్త భావంతో ఉన్ముక్త హృదయంతో, అది తనపూలను పండ్లను విరివిగా దానం చేసేస్తుంది. ఎండనక, వాననక ఎల్లవేళల అది తన భండారంలోంచి అందరికీ, అన్నీ ఇచ్చి వేస్తుంది. అదేవిధంగా వైష్ణవునిలోగూడ లేశమాత్రమైనా అహంకారముండకూడదు. అతడు అందరి ఆత్మలలోను, శ్రీకృష్ణదేవసిస్తాడని గుర్తెఱుగాలి. అంచేత, స్వీయసమ్మానం అపేక్షించకుండా, ప్రతి ఒక్కరిని గౌరవించాలి. ఎవడైతే ఈవిధంగా ఉంటూ, సదా శ్రీకృష్ణస్మరణ చేస్తూ ఉంటాడో, అతనికి కృష్ణభక్తి వలన తగిన పారితోషికం తప్పక లభిస్తుంది."

చైతన్యులీ పలుకులంటున్నారో లేదో, వారి ఆత్మ వినయానుభూతి వలన గద్గదమైపోయింది. వారు శ్రీకృష్ణుని ప్రార్థించారు. "ఓ కృష్ణా! నన్ను వినయశీలిగా చేయి. నాలో భక్తి భావం నింపు." తరువాత వారు పద్యావళిలోని ఓ శ్లోకాన్ని చెబుతూ అన్నారు "నాకు శిష్యులక్కర లేదు. ధనమక్కఱలేదు, విద్యవలదు, కావ్య ప్రతిభ అంతకు ముందే అక్కరలేదు. నా అంతరాంతరంలో ఒకింత భక్తి భావం పాదుకొనేటట్లు చూడు. చాలు."

చైతన్యులు సేవ్య సేవక భావాపన్నులై మాటిమాటికి ప్రార్థించారు. "నా నికృష్టాతి నికృష్టాలైన సేవలను స్వీకరింపు ప్రభూ! నా సేవకు కూలిగా నీ భక్తిని, రవంత ప్రసాదింపు. అంతే చాలు."

పునః వారు సెలవిచ్చారు. " శ్రీ కృష్ణుడు వినా, జగత్తంతా శూన్యమే. ఆయన నాకు దుఃఖం కలుగచేసినా సరే, అది నాపాలిటికి వర ప్రసాదమే. అనుకూలవతియైన పత్ని, ఏవిధంగా తన పతి పెట్టే సుఖంగాని కష్టంగాని, ప్రపంచం దృష్టిలో

ఎట్లావున్నా, తాను మాత్రం సహర్షంగా శిరసావహిస్తుందో, అదే విధంగా శ్రీకృష్ణుడు నాకేమి ఇచ్చినా నేను దానిని సానందంగా స్వీకరిస్తాను. నాకు అంటూ వేరే నాకేమీ అక్కఱలేదు. ఆయన ఏమి అనుగ్రహిస్తే అదే నాకు సర్వస్వం. ప్రపంచందృష్టిలో అది సుఖంగానీ, కష్టంగానీ, దాని చింత నాకు లేదు."

ఈ పలుకులు పలికేటప్పుడు చైతన్యుని నేత్రాలు అశ్రుసిక్తాలు. ఆయన శరీరం కంపితమై పోయింది. వారు స్మృతి తప్పి నేలమీద పడిపోయారు. కృష్ణదాసకవిరాజకృతమైన "చైతన్య చరితామృతం" ఇక్కడనే సమాప్త మవుతుంది. రచయిత గురుదేవుల లీలాసమాప్తిని వర్ణింపలేదు. బృందావన దాసు వ్రాసిన "చైతన్య భాగవతం" లో కూడ ఇందు విషయమై ఏమీ వ్రాయబడలేదు. ఇంతే కాదు మురారి రచించిన 'చైతన్య చరితం'లోగాని, కర్ణపూరక వికృతమైన జీవన చరితమందుగాని చైతన్యుని ఇహలీలా సమాప్తిని గురించిన వివరణ లేనే లేదు.

చైతన్య చరితామృతంలో ఈయబడిన వృత్తాంతాన్ని కొంచెం ముందుకు ఊహించి, చాలా మంది చైతన్యులు తన్మయావస్థలో సముద్రంలో దూకి ఉంటారని, అంతటితోనే వారు తనువు చాలించి ఉంటారనీ నిర్ణయిస్తారు. బెస్తవాని కథ తర్వాత ఎవరో కల్పించి, జోడించిఉంటారనీ, వాస్తవానికి వారు సముద్రగర్భంలో లీనమై పోయిఉంటారనీ, వారి ఉద్దేశం.

కృష్ణదాస కవిరాజకృతమైన చైతన్యచరితామృతంలో చెప్పబడినరీతిగా చైతన్యులు సముద్రంలో మునిగిపోయారనేది విశ్వసనీయంగా ఉంది. అయితే కృష్ణదాసు, బెస్తవాడు చైతన్యులను సముద్రంలోంచి బైటికి చేర్చడం, ఆయనకు స్పృహగలగడం, తరువాత జరిగిన సంవాద విశేషాలు కూడా ఎక్కువగా వర్ణించాడు తన గ్రంథంలో.

చైతన్యుడు జగన్నాథుని మూర్తిలోనో, లేక గోపీనాథమూర్తిలోనో లీనమైపోయాడనే కథకు ఆధారమేమీలేదు అంధవిశ్వాసం తప్ప. జయానందుడు రచించిన 'చైతన్యమంగల్' అనే పుస్తకంలో చైతన్యుల మృతిని గురించిన స్పష్టమైన సూచన మనకు దొరుకుతుంది. అయితే విద్వాంసులు, వంగభూమిలోని, సంప్రదాయబద్ధులైన వైష్ణవులంతగా ఆయన వ్రాసిన దాన్ని విశ్వసింపరు. కాని అందులో గురుదేవుల మృతిని గురించి విశ్వసనీయమైన తథ్య కథనం మనకు దొరుకుతోందని చెప్పవచ్చు.

జయానందుడు రచించిన ఈ గ్రంథంలో, మిగుల సహజమైన మానవీయ

కారణం చెప్పబడింది. నేటి పరిశోధకు లిందులోని విషయాన్ని ప్రామాణికంగా స్వీకరిస్తున్నారు.ఇక్కడ మనం ఒక విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి. వైష్ణవ బృందానికి జయానందుని ఈ కృతిపై ప్రామాణిక బుద్ధి లేదు. అందుచేత జయానందుడు తానునిజమని నమ్మిన దానిని నిర్భీకంగా చెప్పడానికి వీలైంది. అతడు తన వివేకశక్తిని స్వతంత్రంగా, సంప్రదాయం పరిధిలో గాకుండా, తథ్య నిర్ణయంలో ఉపయోగించగలిగాడు. సంప్రదాయబద్ధమైన నైష్ఠిక సాహిత్యానికి ఇటువంటి స్వాతంత్ర్యముండదని కూడ మనం గమనించాలి.

జయానందుడు 'చైతన్య మంగల్' గ్రంథంలో రాసిన విషయం : రథయాత్రోత్సవ సమయంలో జగన్నాథుని మూర్తి ఎదుట నృత్యం చేస్తూవున్నప్పుడు, చైతన్యుల ఎడమ పాదం దెబ్బ తిన్నది. భావ విహ్వల దశలో వారు నృత్యం చేస్తున్నప్పుడు దారిలో పడివున్న ఇటుకరాయి వలన ఆయన పాదానికి దెబ్బ తగిలి గాయమైంది. ఈ గాయం వలన వారు జ్వరపీడితులయ్యారు. కొన్ని రోజులలోనే వారు ఆ జ్వరం మూలాన మృత్యువాత పడ్డారు. డాక్టరు బిమాన బిహారీ మజుందారు సమకాలికాలైన అనేక రచనలను చక్కగా పరిశోధించి వారి మృత్యు తిధి 9 జులై 1533 క్రి.శ.గా నిర్ణయించారు. అకాల మృత్యు సమయానికి చైతన్యుల వయః పరిమితి 48 సంవత్సరాలు.

ప్రొఫెసరు దినేశచంద్రసేన్ జయానందుని 'చైతన్య మంగల్' పుస్తకాన్ని ఇదే పేరు గల లోచనదాసు కృతిని ఆధారం చేసుకొని చైతన్యుని మృతిని గురించి, పిమ్మట ఆయన దహన సంస్కారాధికం గురించి, కొన్ని ముఖ్యమైన వివరాలిచ్చారు. ప్రొ. సేను ద్వారా సేకరింపబడిన సంఘటనలిక్కడ ఇస్తున్నాం.

పురీలో రథయాత్రా సందర్భంలో ఉత్కటమైన భావావేశం వల్ల నృత్యం చేస్తూ చేస్తూ చైతన్యులు నేల మీద పడిపోయారు. అందువల్ల ఆయన పాదం బాగా దెబ్బతిన్నది. వారిని అక్కడి నుంచి 'గుండిచా బాగ్' తీసుకొని వెళ్లారు. అక్కడ వారికి తీవ్రంగా జ్వరం వచ్చింది. అపరాహ్ణం మూడు గంటల వేళ వారు తనువు చాలించారు. 'గుండిచా బాగ్' తలుపులు ఆరోజు మూడుగంటల తర్వాత తెరువలేదు. మామూలుగా రోజూ తెరుస్తూ ఉండేవారు. తలుపులు బిగించి పురోహితులు లోపల చైతన్యుల పార్థివ శరీరానికి సమాధి నేర్పఱచడంలో నిమగ్నులై ఉన్నారు.

గుండిచా భవన ప్రాంగణంలోనే బహుశః ప్రతాపరుద్ర గజపతి అనుమతి మీద

చైతన్యులను సమాధి నిర్మించడానికి ఏర్పాట్లు జరిగి ఉంటాయి. ఒక గుప్త ద్వారం గుండా పూలు గుట్టలకు గుట్టలు భవనం లోపలికి తేబడ్డాయి.

ఈలోపల భవనం ముఖ్య ద్వారంపై జనం తండోపతండాలుగా చేరసాగింది. జనం చైతన్యుల గురించి వాకబు చేయసాగారు. వీరిలో శ్రీవాసు, మురారి దాసు, గౌరీదాసు మొదలైన చైతన్యుల యందపారమైన భక్తి శ్రద్ధలు గల శిష్యులు కూడ కొందరు ఉన్నారు. వీరినెవరినీ భవనంలోపలికి రానీయలేదు.

సమాధిని మందిరంలోపలనే మూర్తి ఉన్న గర్భగృహానికి ప్రక్క మండపం మూలలో నిర్మించడానికేఏర్పాటు చేశారు. ఇందుకోసమని కొన్ని రాళ్లు పెళ్లగించారు. శరీరాన్ని ఆ ఖాళీ చోట ఉంచడానికి వీలుగా. అట్లా శరీరాన్ని రాళ్ల మధ్య ఉంచి తిరిగి పూడ్చివేశారు. సమాధికట్టినట్లుగా బైటికి వాళ్లేమీ కనబడడం లేదు. ఈ పనులన్నీ ముగించడానికి చాలా గంటల సేపు పట్టింది.

రాత్రి ఎనిమిది గంటలవేళ ఉత్సుకతాపూర్వకంగా ప్రతీక్షిస్తున్న గుంపులకోసం గుండిచా మందిరం తలుపులు తెరువబడ్డాయి. జనానికి, చైతన్యులు ఇహమన మధ్యలేరు, వెళ్లిపోయారు' అని చాటబడ్డది.

గుండిచా భగవానుని గర్భగృహం దగ్గిరి మండపం మూలలో చైతన్యుని పాద చిహ్నాలు ఉత్కీర్ణింపబడి ఉన్నాయి పాషాణాల మీద. ప్రొందినేశచంద్రసేను ఈ పాద చిహ్నాల క్రిందనే చైతన్యుల పార్థివ శరీరం కప్పబడిఉంటుందని అభిప్రాయ పడ్డారు. గుండిచా మందిరంలో ఆ స్థలంలో చైతన్యుల పాద చిహ్నాలు చెక్కబడి ఉండడానికి వేరే కారణమేమీ కనబడదు. చైతన్యుని మనస్సు నాహరించిన మందిరాలు రెండు. 1. జగన్నాధుని మందిరము, 2. గోపీనాథుని మందిరము. గుండిచా మందిరంపై చైతన్యుల మక్కువ అంతగా లేదు. ప్రొ. సేను తాను కూడ కేవలం ఊహించడమేకాని, ఇదమిత్థమని చెప్పడానికి, బలమైన కారణమేమీ కనబడడంలేదని స్పష్టం చేశారు.

చైతన్యుల నిర్యాణం గురించి మరో దంతకథ ప్రచారంలో ఉంది. ఒరిస్సా నరేశునిపై అంతకంతకు వృద్ధిపొందుతూ ఉన్న చైతన్యుల ప్రభావాన్ని చూసి, కొంతమంది పురోహితులు చూపోపమి, చైతన్యులను హత్య చేయించారని ఆకథ. కాని ప్రొ. దినేశ చంద్రసేనుడు సూచించినట్లు, ప్రతాపరుద్ర మహారాజు గారి ఏలుబడిలో, ఆయన రాజధానిలో అటువంటి దారుణ హత్య జరగడము అసంభవం. ప్రతాప రుద్రుడు చైతన్యులను సశరీరులైన దేవమూర్తిగా భావించేవాడు. ఆయన వారి కొరకు ఎంతటి త్యాగమైనా చేయడానికి సిద్ధంగా ఉండేవాడు. చైతన్యుల మృతిని గురించి ప్రచారంలో ఉన్న కథలనన్నింటినీ, వాటి వెనుక ఉన్న ప్రమాణసామగ్రిని పరిశీలించినప్పుడు, జయానందుని 'చైతన్య మంగల్' కృతిలో వ్రాసిన దానిలోనూ, ప్రొ. దినేశచంద్ర సేను విచారించి తేల్చిన నిగ్గులోనూ, నిజం దోబూచులాడుతోందని మనం విశ్వసింపవచ్చు.

# ధర్మ ప్రచారం

చైతన్యులు, తమధార్మిక విచారధారనంగీకరించే అనుయాయులనందరినీ సంఘటిత పఱచలేదని మనం గుర్తుంచుకోవాలి. ఆయన సంఘటన కర్త కారు. వారి ఆదర్శమయమైన సన్యాసి జీవితం, ధార్మిక వ్యక్తిత్వమూ, అగ్రశ్రేణికి చెందిన వారి శిష్యుల కొక చక్కని ఆదర్శంగా పనిచేశాయి. వారే యీ నవ్య వైష్ణవ మతాన్ని ఒక భక్తి ఆందోళనగా వికసింపజేశారు. వారి అంతేవాసులు, వారిని ఉపాసనా పద్ధతిని నిర్వచించారు. వారి సిద్ధాంతాలనూ, ప్రమాణాలనూ క్రోడీకరించి, గ్రంథస్థం చేశారు.

వారి అనుయాయులందు రెండు ప్రముఖ వర్గాలేర్పడినాయి. వారికి రెండు ప్రముఖ కేంద్రాలు వెలిశాయి. ఇందులో ఒకటి ఉత్తరప్రదేశ్‌లోని బృందావనం, రెండవది బెంగాలులోని నవద్వీపం. ఒరిస్సాలోని పురిలోకూడా ఒక కేంద్రమున్నది. బృందావనంలో వుండే చైతన్యుల శిష్యులు గౌడీయ వైష్ణవమతానికి చెంది చైతన్యుల శ్రీముఖారవిందం నుండి వెలువడిన సిద్ధాంత వాక్యాల నన్నింటినీ గ్రంథస్థపఱచి, వానికి పరిభాషనే ఏర్పాటు చేశారు. వారి తత్త్వ చింతనను సూత్రబద్ధం గావించారు.

చైతన్యులు, అన్యవైష్ణవాచార్యపురుషుల వలె ఎన్నడూ తమ దార్శనిక విచార సరణిని, లిపి బద్ధం గావించిన వారు కారు, వారే దార్శనిక గ్రంథాన్ని రచించింది కూడ లేదు. ఈ విషయాన్ని మనం జ్ఞప్తి యందుంచుకోవలసి వుంటుంది. వారి ఆధ్యాత్మిక వ్యక్తిత్వం చేత నలువైపులా ఆకర్షింపబడి వారి చుట్టు ఒక సంప్రదాయం తానుగా ప్రోదిచేసుకొన్నది. ఆనంతర కాలంలో ఆయన ప్రధాన శిష్యులు సంప్రదాయాన్ని వికసింపజేశారు. జనం, వారి ప్రయత్నాల వల్లగాక, వారి ఆదర్శమయమైన ధార్మిక జీవితాన్ని ఉదాహరణంగా తీసుకొని వారి మతంలో చేరారు. కవికర్ణపూరుడు రాసినట్లు, చైతన్యుల దివ్యభక్తిని చూసి, తాము కూడ తన్మయులై, జనం మంత్రదీక్ష ఏమీ లేకుండానే వారి మతంలో జేరిపోయేవారు. వారి భక్తులుగా నిలబడేవారు, చైతన్యుల ఆధ్యాత్మిక బోధ, మచ్చుమందు చల్లినట్లు, జనాన్ని ముగ్ధుల్ని చేసి వేసేది. వారిభక్తి పరమైన భావోద్రేకంలో విహ్వలులై పోతూవుండేవారు, వారి ప్రేమ భావనా ప్రధానమైన భక్తి పద్ధతికి జనులు ప్రభావాంకితులై పోయేవారు. వారి అతివేలమైన ధార్మికోత్సాహం వల్ల,

స్థిరచిత్తుడై, వాడుకూడ, ముగ్ధుడై ఉత్సాహప్రేరితుడై పోయేవాడు. ఇందుకుదాహరణంగా, వాసుదేవ సార్వభౌములు చైతన్యమతం స్వీకరించుట, ప్రతాపరుద్ర మహారాజులకు చైతన్యుల యెడగల సమర్పిత బుద్ధి, తదితరుల మతాంతరణమూ, మనం తీసుకోవచ్చు.

చైతన్యుల ఆధ్యాత్మికానుభవం, ప్రధానశిష్యులూ, అనుయాయులతోటి వ్యక్తిగత సంపర్కమూ, ఈ సంప్రదాయాందోళనకు ముఖ్యములైన నిర్వాహక శక్తులుగా పనిచేశాయి. వారి జీవితం, వారి వ్యక్తిత్వం వీనిలోని గరిమ వల్ల ప్రేరితులై వారి పట్ట శిష్యులు, నవ్య వైష్ణవాందోళనకు ప్రచారప్రసారాలు చేకూర్చారు. గురువుల మరణానంతరం కూడ ఈ ప్రచార ప్రక్రియ సాగుతూనే వుంది. వారు వైష్ణవులు స్వీయ జీవితాలలో పాటించవలసిన ఆచార సంహితకు తమ జీవితాలే ప్రమాణంగా ముందుంచారు. రాధాకృష్ణోపాసన గురించి వారు కలుగజేసిన జ్ఞానబోధవల్ల సంప్రదాయానికి, ఆందోళనకు శీఘ్రగతి ఏర్పడింది. ఆదర్శప్రాయులైన వారి శిష్యుల ఒఱవడిలో, గౌడీయవైష్ణవ మతం పేరిట సంఘటితమై వేళ్లు నాటుకొన్నది.

సమాజంలోని విద్వాంసులూ, నైష్ఠికులూ, అయినవారు చైతన్యులకు భక్తులై వారి సంప్రదాయాన్ని సంఘటిత పఱచారు. చైతన్యులు వారిని స్వార్థహీనమైన భక్తి కార్యాన్ని చేయమని ప్రేరేపించేవారు. వారి సరళమైన ఉపాసనా పద్ధతి, మోక్షదాయకమైన వారి శక్తి, వీని వల్ల ప్రేరితులై వారి శిష్యులు సంప్రదాయంలోని సైద్ధాంతిక వ్యవహారిక పక్షాలను వికసింపజేయ గలిగారు. సంక్షేపంగా చెప్పవలెనంటే, చైతన్యులకు, ఆయన సంప్రదాయంలోని ఉపాసనా పద్ధతికి గల పారస్పరిక సంబంధం మీపాటిదే.

III

# బృందావనంలోని గోస్వామి షట్కం

బృందావనంలోని చైతన్యుల అనుయాయులకు వారి ఆందోళనంలోని ఆచార వ్యవహార పక్షాన్ని, సైద్ధాంతిక పక్షాన్ని, వికసింపజేసిన గౌరవం దక్కుతుంది. బృందావనంలోని ఈ భక్తబృందంలో, మేలుబంతికి చెందిన ఆరుగురు గోస్వాములు, 'గోస్వామిషట్కం' అనే పేరుతో ప్రసిద్ధులైనారు. వరుసగా 1. రూపగోస్వామి 2. సనాతన గోస్వామి 3. రఘునాథదాసు 4. రఘునాథ భట్టు 5. గోపాలభట్టు 6. జీవగోస్వామి. అని వీరి పేర్లు. వీరిలో మొదటి అయిదుగురు చైతన్యులకు ప్రత్యక్ష శిష్యులు. రఘునాథభట్టును మినహాయించి మిగిలిన వారందరూ వైష్ణవ మార్గంలోని వివిధ పక్షాలను గురించి విపులంగా వ్రాశారు. వారు తమ అభిప్రాయ వ్యక్తీకరణకై మాతృభాష సంస్కృత భాషల రెంటినీ స్వీకరించారు.

గురుదేవులు అంతర్ధానమై పోయిన కొన్ని యేండ్లలోపలనే గోస్వాములు సమగ్రమైన తమ ధార్మిక వాఙ్మయాన్ని సృష్టించారు. వారందరూ ముఖ్యంగా చైతన్యుల వ్యక్తిగతమైన నిత్యజీవిత సరణివల్లనూ, వారి ధర్మోపదేశం వలనూ ప్రభావితులైనవారు.

చైతన్యులు రూపసనాతనా గోస్వాము లిరువురు సోదరులపైననూ, తత్త్వ వివేచనం పైన, రససిద్ధాంతంపైన నవ్యదృష్టితో రచించు భారముంచారు. ఉద్భట పండితుడైన, వీరి సోదరపుత్రుడు జీవగోస్వామి వీరికి కార్య నిర్వహణమందెంతగానో తోడ్పడ్డాడు. భక్తి మార్గానికి చెందిన సన్యాసులే గాక వీరందరూ, తత్త్వశాస్త్రజ్ఞులుగా, కవులుగా, శ్రేష్ఠసాహితీపరులుగా పేరందినవారు. వీరు ముగ్గురు నవ్యవైష్ణవ దర్శనానికి ఆచార్య పురుషులుగానూ, ఉపాసనా గురువులుగాను సంప్రదాయంతో మన్నింపబడ్డారు. తమ అకుంఠిత భక్తి, విద్వత్తు, త్యాగం, ఆదర్శప్రాయమైన సాధుస్వభావం, ఈ విశిష్ట గుణాల వల్ల, సంప్రదాయంలోని అనుయాయులందరూ వీరి యెడల అందరికం టె మించిన ఆదరాభిమానాలను ప్రకటించేవారు.

గోపాలభట్టు ఈ ముగ్గురి గోస్వాములతో అవినాభావ సంబంధంగా, అతి సన్నిహితంగా మెలగుతూ వుండేవాడు. ఆయన వంగీయుడు కాడు, దక్షిణ భారతీయ బ్రాహ్మణుడు. ఆయన ఒక బృహద్గ్రంథంలో వైష్ణవులు పాటింపవలసిన. సామాజిక, ధార్మికాచారాల్ని క్రోడీకరించి రాశాడు. ఉపాసనారీతులకు సంబంధించినంత వరకు ఆయన సంతరించిన గ్రంథం, అన్నింటికంటె ప్రామాణిక మైందిగా భావింపబడుతోంది. వంగీయ వైష్ణవులు గోపాలభట్టును గూడ ఎంతో గౌరవ దృష్టితో చూస్తారు.

గురుదేవుల ఆదేశానుసారం గౌడీయవైష్ణవ మతానికి చెందిన తత్త్వవేత్తలూ, మరియొక శిష్యుడు లోక నాదుడు బృందావన నగరానికి జీర్ణోద్ధారం గావించి ఆధునిక రూపాన్ని అతి శ్రద్ధా నిష్ఠలతో కల్పించారు. వీరి పరిశ్రమ ఫలితంగా, బృందావనం కేవలం జీర్ణోద్ధారం పొందడం గాక, వీరి ఆదర్శమయాలైన ధార్మిక సాంస్కృతిక కార్యకలాపాలవల్ల, గంభీర మైన వైదుష్యం వల్ల, అనుకరణీయమైన సాధు స్వభావం వల్ల, ఆకర్షకమైన భక్తి పద్ధతి వల్ల, ఆ నగరం సంప్రదాయానికి ఓ ముఖ్యకేంద్రంగా రూపొందింది. గౌడీయ వైష్ణవమతానికి సంబంధించిన సిద్ధాంత పక్షాన్ని సమగ్రంగా యీ ఆరుగురు గోస్వాములే నిర్ధారించారు. వంగీయవైష్ణవ సంప్రదాయానికి చెందిన తత్త్వ విచారం, దర్శనమీమాంస, ఉపాసనారీతి, రసశాస్త్ర చర్చ, ఈ శాఖలన్నింటిపైన కొనసాగిన రచనా కార్యక్రమమంతా వారి ప్రయత్నాలకు కలిగిన సత్పరిణామమే.

ఆధునిక బృందావనం వారి కళ్ల ముందు వారి నిర్దేశాను సారం పరివర్తన చెంది పల్లవించింది. శ్రీకృష్ణస్మృతికి సంబంధించి, ఈ నగరంలోని పవిత్ర స్థానాలన్నింటికీ వారు జీర్ణోద్ధారం కావింపించారు. బృందావనాన్ని సుందర నగరంగా రూపొందింపజేయడానికి, దానిపురా గౌరవాన్ని పునఃప్రతిష్ఠాపించడానికి, వారు ధనాఢ్యులైన తమ శిష్య వర్గాన్ని మందిర నిర్మాణం చేయవలసిందిగా స్నాన ఘట్టాలను, ఉపవనాదికాన్ని తిరిగి నిర్మించవలసిందిగా ప్రేరేపించారు. రాజామాన్‌సింహ్, తనగురువైన సనాతన గోస్వామి ఆదేశానుసారం, గోవిందుని వ్యసుందరమైన మందిరాన్ని నిర్మించాడు. ఆరుగురు గోస్వాముల సర్వవ్యాపక ప్రభావం వల్లనే పవిత్రమైన బృందావనం భారత దేశంలోని అన్య వైష్ణవ సంప్రదాయాలకంటె, వంగీయ గౌడీయ వైష్ణవ సంప్రదాయంతో సంబద్ధమైనదిగా భావింపబడుతోంది.

గౌడీయ వైష్ణవ మత చరిత్రలో బృందావనశాఖకు అనగా గోస్వామిషట్కానికి అన్యతమ స్థానం కద్దు. వారు సంస్కృతభాషామాధ్యం వల్ల గౌడీయ వైష్ణవ మత సిద్ధాంతాలను సమగ్ర భారతవర్షంలోనూ ప్రచారం చేశారు. బృందావనంలోని ఆరుగురు గోస్వాములు, చైతన్యులను మహత్తరమైన ఉద్దేశానికి సాధనభూతులని నమ్మారు. చైతన్యుల వంగీయమండలి గురుదేవుల నిర్యాణానంతరం, గోస్వామిషట్కం నుండి వేరై, ఏ విధంగా వేరేశాఖను ప్రవర్తింపజేశారో, అది మరియొక అధ్యాయంలో రాయవలసిన విషయం. బృందావనంలోని గోస్వాముల అభిప్రాయానుసారం శాస్త్రములలో కూడ శ్రీకృష్ణోపాసనే విహితమై వుంది. అందువలన చైతన్యుల విచారసరణి శాస్త్ర సమ్మతమై, ఎల్లరకూ ఉపాదేయమవుతోందనేది వారి వాద సారాంశం.

బృందావన శాఖ యొక్క వరేణ్యతను తిరిగి నొక్కి చెప్పడమవసరం. గోస్వామి షట్కం గౌడీయ వైష్ణవ సంప్రదాయానికి చెందిన సమ్మాన్యమైన తత్త్వవేత్తల మండలి. వారు సామాన్యంగా బెంగాలు వైష్ణవ సంప్రదాయానుయాయులకు కూడ తగిన సలహాలిస్తూ వుండేవారు. బెంగాలులో రచింపబడే గ్రంధాలు వీరి సమ్మతిని, ఆమోదాన్ని పొందడానికిగాను, బృందావనం పంపబడుతూ వుండేవి. ఆరుగురు భూస్వాముల అంగీకార ముద్రను పొందని పుస్తకాలకు సంప్రదాయ వర్గంలో పంచడానికి వీలుండేది కాదు. వంగ రచయితలు గోస్వామి షట్కమిచ్చే సలహాలను అంగీకరించి, పాటించేవారు. ఇందుకు ఉదాహరణంగా ఈ క్రింది ప్రసంగాన్ని గ్రహింపవచ్చు. బృందావనదాసు తాను రచించిన గురుదేవుల చరిత్రను గోస్వాముల ఆమోదముద్ర కొరకై బృందావనం పంపించాడు. వారు వ్రాత ప్రతిని చదివి ఎంతో సంతోషించారు. అయితే పుస్తకం శీర్షిక 'చైతన్య మంగల్' అని పెట్టబడి వుంది. శీర్షిక గోస్వాములకు అంగీకారం కాలేదు. వారు శీర్షికను మార్చి 'చైతన్య భాగవత్' అని వుంచాలని సూచించారు. వారికి శ్రీమద్భాగవతానికి దీనికి పోలికలు కనబడ్డాయి. అందుకనే బృందావనదాసు రచించిన 'చైతన్య మంగల్' లోక వ్యవహారంలో 'చైతన్య భాగవతం'గా ప్రసిద్ధి పొందింది.

గోస్వాములు ఆరుగురు సంప్రదాయానికి చెందిన మహావిద్వాంసులుగా, దార్శనిక నాయకులుగా మన్నింపబడ్డారు. వారి సాహిత్యకృతులు గౌడీయవైష్ణవ విశ్వాసాలకు ఆధారస్తంభాలుగా నిలిచిపోయినాయి. వారి రచనల బహుముఖీత వ్యాపకమూ, ఉల్లేఖనీయమై ఒప్పుతోంది. తలచు వారి సాహిత్యకృతుల నన్నింటిని

సామూహిక రూపంలో 'బృందావన సాహిత్యం' గా పరిగణించే వారు. అయితే రచయిత యొక్క విశిష్ట ప్రతిభాయోగ్యతల ననుసరించి కృతులలో ప్రత్యేకమైన విశేషగుణాలు కూడా వున్నాయి.

సనాతన గోస్వామి ముఖ్యంగా తత్త్వ విద్య లేక తద్వ్యాఖ్యకు సంబంధించిన గ్రంథాలు రచించాడు. అందుకు కారణం ఆయన ముఖ్యంగా భక్తుడగుటే. అదేవిధంగా గోపాలభట్టు స్వభావంచేత, ఇతర గోస్వాముల కంటె వ్యవహారదక్షుడు. అంచేత ఆయన పూజ, ఉపాసనా పరములైన ఆచార కాండ వీనిని గురించి వ్రాసే బాధ్యత తాను పెట్టుకొన్నాడు. రఘునందన దాసు కవి గద్య పద్య రచనలు రెంటిలోనూ, ఆయన శ్రీ కృష్ణలీలా వర్ణనం చేశారు. ఇదే విధంగా రూపగోస్వామి భక్తుడూ, ఉత్తమ శ్రేణికి చెందిన విద్వాంసుడు కూడ. అంచేత వారు భక్తిరసంపైననే గాక, అనేక నాటకాలు, కావ్యసంగ్రహాలు మొదలైనవి కూడ రచించారు. మరోవైపు జీవగోస్వాముల సర్వతోముఖీనమైన ప్రతిభ వైష్ణవ సంప్రదాయానికి చెందిన అన్ని శాఖలలోనూ ప్రస్ఫుటితమైంది. కాని సహజంగా గొప్పదార్శనికుడు గనుక, ఆయన రహస్యాత్మకమైన తత్త్వ విద్య, సిద్ధాంత వివేచనం వీనిపై మొగ్గుచూపి, తదనుగుణమైన పుస్తకములు, వ్యాఖ్యలు రచించారు. వీరిలో రఘునాథదాసు మాత్రం ఏ పుస్తకమూ రాయలేదని లోగడనే ఒకచోట చెప్పాం. బృందావన గోస్వాములు, సమగ్రవైష్ణవ మత క్షేత్రాన్ని తమదిగా చేసికొని గౌడీయవైష్ణవ మతానుకూలంగా వివిధ దార్శనిక ధార్మిక గ్రంధ ప్రణేతలయ్యారు.

సాధారణంగా గౌడీయవైష్ణవ సంప్రదాయ చరిత్రలో, ఆరుగురు గోస్వాములూ, సామూహికంగానే వారి యోగదానం గురించి స్మరింపబడుతూ వుంటారు. సంప్రదాయ దర్శనం, ఆచారసంహిత, రసశాస్త్రం, వీటిని బోధపఱచడానికి, వారి సమగ్ర రచనలపై సామూహికంగా చర్చలు జరుగుతూ వుంటాయి. కాని ఒచ్చట వారి జీవితవిశేషాలు ధార్మిక కార్యకలాపాలు వీటిని దృఙ్మాత్రంగా తెలుసుకోడానికి, ఒక్కొక్కరి గురించీ, వేరువేరుగా ప్రస్తావింపబడుతోంది.

## 1. రూప గోస్వామి

సనాతనులకు తమ్ముడు రూపగోస్వామి. రూపగోస్వామి కవి, అలంకార శాస్త్రజ్ఞుడు, బహుశ్రుతుడు, తోడ్తో నైష్ఠిక సన్యాసి. చైతన్యుని సన్నిహిత శిష్యులలో రూపగోస్వామియే అందరి కంటె ముందుగా భక్తిలోని ధార్మిక భావానికి శాస్త్రస్థాయి చేకూర్చారు.

భక్తి రసామృతసింధు, ఉజ్వలనీలమణి అనే రెండు ప్రామాణికాలైన సంస్కృత గ్రంధాలు రచించి, భక్తియొక్క ధార్మిక భావానికి పాండిత్య పూర్ణమైన వ్యాఖ్య రచించారు. ఈ రెండు గ్రంథాలలోనూ, భక్తి రసాన్ని గురించి శాస్త్రీయమైన చర్చ సమగ్రంగా జరిగింది.

వారు తొలిదొల్త చైతన్యులను గౌడ రాజధాని దగ్గిర తమ జన్మస్థానమైన 'రామకేలి' లో దర్శించారు. అప్పటికి రూప బెంగాలు శాసకుడైన హుస్సేనుషా ధర్బారులో ఉన్నతాధికారిగా ఉన్నారు. వారి పదవీనామం 'దావిర్ ఖాస్' అని. దావిర ఖాస్ అంటే ఆంతరంగిక కార్యదర్శి అని. ఈ పేరుతోనే వారు జనులలో ప్రసిద్ధులుగా వుండేవారు. ముసల్మాను పాదుషా దర్బారులో వారి ప్రభుత్వ పదవి ఇదే అయివుంటుంది. చైతన్యులు వారికి 'రూప' అనే పేరు పెట్టారు. తర్వాతి కాలంలో వారీ పేరుతోనే ప్రసిద్ధి వహించారు.

వారు, వారి అగ్రజులైన సనాతనులు, చైతన్యులతో కలియక మునుపే వైష్ణవ మతం వైపు ఆకృష్టులైనారు. నవద్వీపంలోని వైష్ణవ మండలిలతో వారికి సంపర్కముంది. వారు రామకేలి పరిసర ప్రాంతంలో కొంతమంది కర్ణాటక బ్రాహ్మణులకు ఆవాసం కూడ కల్పించారు. వారు స్వయం కర్ణాటక బ్రాహ్మణులే. వారి పూర్వీకులు కర్ణాటక ప్రాంతం నుండి వంగ భూమికి తరలి వచ్చారు. ఇరువురన్నదమ్ములూ, తమపైతృక ధార్మిక భావాలతోబాటు 'కృష్ణ లీల' లో గూడ తమకు గల అభిరుచిని పోగొట్టుకోకుండా కాపాడుకుంటూ వచ్చారు. చైతన్యులను కలియడానికి చాలా మునుపే 'రూప', 'దానకేలి కౌముది', 'హంసదూతమ్' అనే రెండు కావ్యాలు రచించారు. ఈ గ్రంథాల వల్ల వారిలోని ధార్మిక జిజ్ఞాస ప్రకటమవుతుంది. చైతన్యులతో రామకేలిలో జరిగిన ప్రథమ సమావేశ సమయానికే ఆయన మనోభూమి, తదున్ముఖంగా సిద్ధమైవుంది.

చైతన్యులను దర్శించిన పిమ్మట, రూప, ఆధ్యాత్మిక నిర్దేశము తనకు ఇచ్చుటకు వీలుగా గురుచరణాలను శరణుజొచ్చి, గార్హస్థ్య జీవనం కూ డ పరిత్యజించుటకు నిశ్చయం చేసుకొన్నారు.

కొన్నాళ్లకు ఆయన సుల్తాను హుసేనుషా కొలువునకు తిలాంజలు లిచ్చేశారు. తర్వాత తమ అనుజుడైన అనుపముని (వల్లభుడని మరోపేరు. ఈయన జీవగోస్వామి తండ్రితో బాటు గృహపరిత్యాగం చేసేశారు. ఆ సమయంలో

చైతన్యులు బృందావనం తీర్థయాత్రనుంచి తిరిగి వస్తూ దారిలో ప్రయాగలో "సంవాసం" చేసి వున్నారు. సోదరుడైన అనుపమునితోబాటు 'రూప' గురు సన్నిధానానికి చేరుకున్నాడు. చైతన్యులు 'రూప' కు బృందావనం వెళ్లి జీర్ణోద్ధారం చేయవలసిందిగా నిర్దేశించారు. 'రూప' గురువులతోబాటు వారణాసికి వెళ్లవలెనని సంకల్పించాడు కాని, వారి నిర్దేశానుసారం వారి వద్ద పదిరోజులున్న తరువాత, 'రూప' బృందావనం వెళ్లి పోయారు. 'రూప' కొంతకాలం బృందావనంలో వుండి తిరిగి చైతన్యులను కలుసుకోడానికి ఊరికి బయలుదేరి వెళ్లాడు. ఆయన వెంట బెంగాలునకు తిరిగి వస్తున్న అనుపముడు,దారిలో బెంగాలులో గంగ ఒడ్డున దివంగతుడైనారు. రూప పురికి చేరి చైతన్యుని సన్నిధిలో పది మాసాలున్నారు. ఆ పిమ్మట బృందావనానికి వచ్చి అచ్చటనే స్థిరనివాస మేర్పఱచుకొన్నారు. వారు మృత్యుపర్యంతం తమ అగ్రజుడైన సనాతన గోస్వామితో బాటు తమ జీవిత లక్ష్యాన్ని నెఱవేర్చడానికని, విద్యావ్యసనులుగా, పవిత్ర జీవితం గడిపారు.

రూపగోస్వాములు రచించిన గ్రంధాలు : ఉద్ధవ సందేశం, విదగ్ధ మాధవం, లలిత మాధవం, హంసదూతం, భక్తి రసామృతసింధు, దానకేలి కౌముది, ఉజ్వలనీలమణి, మధురా మహిమ, నాటక చంద్రిక, పద్యావళి, భాగవతామృతం, ఇంకా వివిధస్తోత్రాలు మొదలైనవి.

## 2. సనాతన గోస్వామి

సనాతనుడు ముగ్గురు సోదరులలోను పెద్దవాడు. రూపగోస్వామి మధ్యముడు. ఆయన కూడ హుస్సేను షా దర్బారులో ఉన్నతాధి కారంతో పని చేసినవాడే. ఆయన వ్యవహార నామం 'సర్కార్ మాలిక్' అని. అది బహుశా ఆయనకు లభించిన పదవీ నామం కావచ్చు. సనాతనుడే పేరు గురుదత్తమైనది. చైతన్యులతో సమావేశమైన సందర్భంలో ఆయన కూడ 'రూపు' నితో బాటు 'రామకేలి' లోనే వుంటూ వుండేవాడు.

జీవితం తొలి నాళ్లల్లో సనాతనుడు 'పురీ'లో చైతన్యుల ప్రశంసకులలో ఒకరైన వాసుదేవ భట్టాచార్యుల తమ్ముడు నవద్వీప పండితుడు, పండిత విద్యావాచస్పతి వద్ద సంస్కృతాధ్యయనం చేశాడు. పిమ్మట అరబ్బీ పారసీ భాషలను కూడ నభ్యసించాడు. తన తమ్ముడు 'రూపుని' వలెనే తాను గూడ చైతన్యుని మ్రోల ఆత్మార్పణం చేసికొన్నాడు. లౌకిక జీవిత బంధనం నుంచి

ముక్తి పొందవలెననే కోరిక గురు సమక్షాన వెల్లడించాడు. గురుదేవులు "కృష్ణ ప్రభువు నీ వాంఛ నీడేర్చు గాక" అని ఆశీర్వదించారు. "నీ జీవితలక్ష్యం బృందావన ప్రాచీన గౌరవ పునః ప్రతిష్ఠ. దానిని సాధించడానికి పూనుకో" అని ఆదేశించారు.

అటు పిమ్మట చైతన్యులు 'పురి'కి తిరిగి వచ్చేశారు. మొదట అనుపమునితో బాటు 'రూపు' సన్యాస జీవితాన్ని స్వీకరించడానికై గృహ త్యాగం చేశాడు. చైతన్యుల తోటి సంపర్కం ఏర్పడ్డ తర్వాత సనాతనుడు కూడ అదే ధోరణిలో ఆలోచింపసాగాడు. సర్కారు నౌకరిలో అతని మనస్సు లగ్నం కావడం లేదిప్పుడు. మెల్లిమెల్లిగా అతడు దర్బారుకు పోవడం చాలించుకున్నాడు.

సుల్తానుకు, ఇతడు కూడ తన సోదరునివలెనే తన ఉద్యోగాన్ని వదిలేస్తాడనే అనుమానం కలుగనే కలిగింది. అంచేత సనాతనుని పిల్పించి, తన శత్రువుపైకి దండయాత్రలో అతన్నికూడ వెళ్లవలసిందిగా ఆజ్ఞాపించాడు.

జంకు గొంకు లేకుండా సనాతనుడు జవాబిచ్చాడని అంటారు. "బహుశః మరికొన్ని దేవాలయాల్ని ధ్వసం చేసి, హిందువుల మనోభావాలకు నొప్పి కలిగించవచ్చు. దయచేసి అటువంటి కార్యకలాపాల్లో, నా సహకారాన్ని అభ్యర్థించకండి. మీ దర్బారులో ఎందరో ముసల్మాను వజీరు లున్నారు. వాళ్లను కొంత మందిని మీతోబాటు తీసికొని వెళ్లండి."

ఈ జవాబు విని హుస్సేను షా మండి పడ్డాడు. కాని తన దండయాత్రలో దేనిలోనూ, సనాతనుని ఉండే తీరాలని నిర్బంధించలేదు.

అయినా సనాతనుడు దర్బారులోని తన ఉద్యోగాన్ని నిర్వహించడం మానేశాడు పూర్తిగా. దాంతో సనాతనుని బందీ చేయవలసిందిగా సుల్తాను ఆజ్ఞాపించాడు. సనాతనుడు కైదీగా పట్టుబడ్డాడు. హుసేనుషా ఎవరో శత్రువు మీదికి దండెత్తి వెళ్లాడు.

ఈ లోపల సనాతనుని చుట్టాలు, కారాగారాధికారులకు సనాతనుని వదిలివేయడానికి, కావలసినంత లంచ మిచ్చారు. ఆ పిమ్మట సనాతనుడు సన్యాసి వేషం ధరించి, రహస్యంగా గౌడ దేశాన్ని వదలి వెళ్లిపోయాడు. ఆయన వారాణాసికి వెళ్లి, అక్కడ చైతన్యులను సందర్శించాడు. ఆ పిమ్మట గురువుగారి ఆజ్ఞానుసారం బృందావనం వెళ్లి, 'రూపు'నితో బాటు అచ్చటవుండి పోయాడు. తర్వాత, కొన్నివాళ్లకు సనీతనుడు పూరీ జగన్నాథానికి వచ్చాడు. చిట్టచివరికి,

బృందావనంలోనే వుండడానికి నిశ్చయించుకొని 'రూపు'నితో బాటు బృందావనానికి తిరిగి వెళ్లిపోయాడు.

రూపుని వలెనే సనాతనుడు కూడ, చైతన్యులతో సమావేశం కాకమునుపే. శాస్త్రవిద్యలో ఆరితేరిన పండితుడు. అంతేగాక మొదటినుంచీ వైష్ణవమతం వైపు అతడు మొగ్గుచూపుతూనే వచ్చాడు. అందుకనే, చైతన్యులు, సోదరు లిర్వురికీ, తత్వ విద్య, కావ్య శాస్త్రం వీనిపై గ్రంథరచన చేయవలసిందిగా ఆదేశించారు.

రూపునివలెనే సనాతనుడు కూడ మహావిద్వాంసుడు, వేదాంతజ్ఞుడు, కవి, నైష్ఠికుడైన సన్యాసి. ఆయన ఆదర్శమయమైన నిస్వార్థ భక్తితో పనులు నిర్వహించేవాడు. సంప్రదాయానికి చెందిన అనుయాయులు 'రూపు'నితో బాటు, సనాతనుని కూడ హెచ్చుగా గౌరవిస్తూ వుండేవారు.

బృందావన జీర్ణోద్ధార కార్యక్రమంలో సనాతనుని సహకారం చాలా గొప్పది. ఆయన ధనికులైన భక్తులను మందిర నిర్మాణానికి ప్రేరేపించేవారు. రాజామాన్‌సింగ్, సనాతన రూప గోస్వాముల ఇరువురి ప్రేరణ వల్లనే గోవింద మందిర నిర్మాణం చేశాడు. సనాతనుని ప్రభావం వల్లనే రామదాస్‌కపూరీ నాయక్ అనే వర్తకుడు బృందావనంలో మదన మోహనుని దేవాలయం కట్టించాడు. ఈ యిర్వురి సోదరుల ప్రోత్సాహం వల్ల, కేవలం మందిర నిర్మాణమే గాక, ధనికులైన వారెందరో స్నాన ఘట్టాలు, ఉద్యానవనాలు, ఇతర భవనాలు, ఎన్నో కట్టించారు. రాజస్థానానికి చెందిన శాసకులెందరో సనాతునుని యందు గౌరవ ప్రపత్తులు కలవారు.

'రూపు'ని వలెనే సనాతనుడు కూడ, కేవలం భిక్షాన్నం మీద ఆధారపడి ఆదర్శమయమైన సన్యాసి జీవితాన్ని గడుపుతూ వుండేవాడు. లౌకిక సుఖాలను పరిత్యజించేవాడు. లబ్ధ ప్రతిష్ఠులైన ఈ ఇద్దరు సోదరులూ, బృందావనంలోని వైష్ణవ బృందానికి ముఖ్యప్రేరణ స్రోతస్సులుగా, నాయకులుగా వుండేవారు. సోదర కుమారుడైన జీవగోస్వామి కథనానుసారం సనాతనుడు నాలుగు గ్రంథాలు రచించాడు. అవి 1. భాగవతామృతం (రెండు భాగాలు) 2. హరిభక్తి విలాసం. 3. లీలాస్తవం. 4. వైష్ణవతోషిణి.

## 3. రఘునాథ గోదాస గోస్వామి

బృందావనంలోని ఆరుగురు గోస్వాములలో రఘునాథదాసు ఒక్కడే అబ్రాహ్మణుడు. కాని అంచేత ఆయన కెటువంటి గౌరవలోపం కలగలేదు. వైష్ణవ క్షితిజం మీద జాజ్వాల్యమానంగా వెలిగే నక్షత్రాల్లో ఆయన ఒకరు. ఆయన తనంతట, తాను సుఖభోగాల్ని ధనధాన్యాల్ని, వైభవప్రభావాల్ని ఉజ్జగించి,

కష్టమయమైన సన్యాస జీవితాన్ని చేపట్టాడు. ఆయన గొప్ప జమీందారుడైన గోవర్ధనుని పుత్రుడు. గోవర్ధనునికి కింద ఏడు గ్రామాలుండేవి. జమీందారీపై సంవత్సరానికి పంద్రెండు లక్షల రూపాయల ఆదాయం వస్తూవుండేది.

బాల్యంనుండి, రఘునాథునిలో తీవ్రమైన దార్శనిక జిజ్ఞాస కానవచ్చేది. రామకేలికి వెళ్లుతూ చైతన్యులు శాంతిపురంలో ఆగినప్పుడు, రగునాథు వారిని కలుసుకొన్నాడు. అప్పట్లో ఆయన పదహారు సంవత్సరాల బాలుడు, రఘునాథు సంప్రదాయంలో దీక్ష పొందవలెననే తన కోరికను వెల్లడించాడు. కాని చైతన్యులు దానికంగీకరింపలేదు. ఆయన రఘునాధుకు సలహా ఇచ్చాడు. "ఇప్పుడే తొందరపడి, సన్యాసం స్వీకరించకు. ప్రస్తుతానికి వెనక్కు ఇంటికి వెళ్లిపో. నిష్కామభావంతో నీ కర్తవ్యాలన్నంటినీ నెఱవేర్చు. నీలో కానవచ్చే త్యాగప్రవృత్తి నిజమైంది కాక పోవచ్చు. సన్యాస జీవితానికి యోగ్యత సంపాదించాలంటే, ముందు నీ కర్తవ్యాలన్నింటినీ పూర్తి చేసికో. "

రఘునాథు ఆవిధంగానే ఇంటికి వెనక్కు వెళ్లిపోయాడు. తండ్రి గోవర్ధనుడు, కుమారుని మనోదశను గ్రహించి, ఒక అందమైన పిల్లతో రఘునాథుకు పెళ్లి చేసి వేయాలని సంకల్పించాడు. దానికి తగిన ఏర్పాట్లన్నీ చేశాడు. రఘునాథు తన తండ్రి పట్ల పైకి ఏమీ అవజ్ఞాభావాన్ని ప్రకటించ లేదు సరిగదా, ఆయన చెప్పిన పనులన్నీ చక్కగా చేస్తూ వచ్చాడు. అతడు తన భార్యను గూడ లోక సాధారణ రీతిగానే గ్రహించాడు. కాని మానసికంగా ఆతడు భార్యపట్ల, ధనం పట్ల వైముఖ్యమే కలిగి వుండేవాడు. రెంటియందూ నిరాసక్తుడు. ఇంతోటి ధన సంపదలున్నా, అతడు ఆంతరంగికంగా అసంతుష్టుడుగానే వుండేవాడు. ఆధ్యాత్మిక ప్రగతి వైపు మనసు మొగ్గిన కొద్దీ అతడు మరింత వివశుడుగా, విహ్వలుడుగా తయారైనాడు. సాంసారికాలైన సమస్త సుఖాల్ని వదిలివేయాలనే దృఢ నిశ్చయానికి వచ్చాడు. ఒకరోజు, ఎవరికీ చెప్పకుండా ఇంటినుండి కాలికి బుద్ధి చెప్పాడు. అప్పుడతని వయస్సు 19 సంవత్సారాలు. రెండు వారాలపాటు నిర్విరామంగా నడిచి, నడిచి, చిట్టచివరికి పూరీ జగన్నాథం చేరుకున్నాడు.

ఈ తడవ చైతన్యులు అతని కోరికను నిరాకరింప లేదు. రఘునాధునికి ఆధ్యాత్మిక శిక్షాప్రదానానికై స్వరూప దామోదరుని కప్పగించారు. ఆరుగురు గోస్వాములలో అత్యధిక సమయం గురుదేవుల సన్నిధిలో వుండే మహద్భాగ్యానికి

రఘునాధే నోచుకున్నాడు. ఆయన పూరిలో చైతన్యులతో బాటు దాదాపు పదహారేండ్లున్నాడు. గురుదేవులు దివంగతులైన పిమ్మట, ఆయన బృందావన నివాసానికై బృందావనం వెళ్లాడు.

రఘునాధు పూరీ జగన్నాథంలో వుంటూ వున్నప్పుడు కఠోర వ్రత చర్యలతో జీవితం గడిపేవాడు. అంచేత ఆయనంటే అక్కడి ప్రజలెంతో ఆదరాభిమానాలతో వుండేవారు. ఆయన ఒక ఆదర్శ సన్యాసిగా భావింప బడేవాడు. చైతన్యులు కూడ, ఆయన ఆచరణలోకి తెచ్చిన కొన్ని నియమనిబంధనలను గమనించి, రఘునాధుని ప్రశంసిస్తూ వుండేవారు. చైతన్యుల నిర్యాణానంతరం, ఆయన 'పురి' వీడి బృందావనం వెళ్లిపోయారు. అచ్చట తన సాధు సోదరులైన సనాతన గోస్వాములతో బాటు కలిసి మెలిసి వుండేవాడు. ఆయన రాధాకుండం వద్ద వుంటూ కఠోరమైన సన్యాసి జీవితాన్ని గడుపుతూ వుండేవాడు.

చైతన్య చరితామృతం రచించిన ప్రసిద్ధ రచయిత కృష్ణదాసు కవిరాజు, రఘునాధుని వృద్ధాప్యంలో ఆయనకు శిష్యుడైనాడు. బృందావనంలో వారిద్దరూ ప్రగాఢమైన సహకర్ములుగా కూడా వుండి వుండిరి. చైతన్యుల జీవితంలోని చరమభాగాన్ని గురించి వర్ణించిన విస్తృత వివరాలన్నీ కృష్ణదాసునకు గురువైన రఘునాధు ద్వారా ప్రత్యక్షంగా తెలిసివుంటాయి.

రఘునాథదాసుకు శ్రీకృష్ణుని పాషాణమూర్తి రూపంలో గోవర్ధన శిల, గురువుల ద్వారా లభించింది. ఆయన దానిని జీవిత పర్యంతం నిత్యమూ పూజిస్తూ వుండేవారు. 'పూరీ' లో లాగానే ఆయన బృందావనంలో గూడా నియమ బద్ధమైన కఠోర జీవితాన్ని గడుపుతూ వుండేవాడు.

వార్ధక్యంలో ఆయన గ్రుడ్డివాడైనాడు. పేరుపడ్డ ఆయన రచన 'దానకేలి చింతామణి' ఆయనకు గ్రుడ్డితనం వచ్చిన తర్వాతనే రచింపబడ్డది.

రఘునాధుని రచనలు పరిణామంలో అంతగా పెద్దవి లేవు. కాని ఆయన తన గుణముల ద్వారా అందరి గౌరవానికి పాత్రుడయినాడు. అందుచేత ఆయన అవశ్యస్మరణీయుడు. ఆయన కృతులన్నీ సంస్కృతంలో గద్యంలోనూ, పద్యంలోనూ కూడ వున్నాయి. ఆయనలో ప్రతిభ కావలసినంత వుంది. చక్కని కవి. చక్కని రచయిత. ఆయన రచనా వస్తువు, ముఖ్యంగా, రాధాకృష్ణుల ఉపాసనావైఖరిలో రహస్య పక్షానికి చెందింది. ఆయన కృతులలో ఎక్కువ పాలు,

భావసంపన్నములైన గీతాత్మిక శ్లోకలు, స్తోత్రాలూ, స్తవాలు. వీనినన్నింటిని 'స్తవావలి' అనే పేరుతో ఆయన సంకలన పఱిచాడు. రఘునాథుని మరో కృతి పేరు 'ముఖ చరిత్ర'. ఇది చంపూకావ్యం. అనగా గద్య పద్యాత్మకం. ఇందులో వాక్చాతుర్య పూర్ణములైన సంవాదాలు. కూడా వున్నాయి. 'ముఖచరిత్ర'లో కొన్ని భాగాలలో, ఇల్లే స్తవాలలో కూడ ఆయన రూప, సనాతన జీవగోస్వాముల ముగ్గురునీ ఎన్నోసార్లు అభినందించాడు. ఆయన ఆ ముగ్గురుకి తనయందు గల స్నిగ్ధ ప్రణయ భావాన్ని, సకృతజ్ఞంగా స్మరించాడు. 'ముఖ చరిత్ర' చివరిభాగంలో, తాను జీవితం చరమభాగంలో, కలిసి వున్న కృష్ణదాసుని (చైతన్య చరితామృత రచయితను) పేర్కొన్నాడు.

కృష్ణదాసు కవిరాజు కథనానుసారం, రఘునాథదాసు చైతన్యుల జీవితాన్ని దైనందిన వివరణ పద్ధతిలో ఒక గ్రంథ రూపంగా రాశాడు. వైష్ణవదాసు ద్వారా సంకలితమైన 'పదకల్పతరు' అనే బెంగాలీ సంగ్రహ గ్రంథంలోని ఒక మూడు పదాలు రఘునాథ కర్తృకాలు అనితజ్ఞాలు భావిస్తారు. ఇవి తప్ప మిగతా ఇతని అన్ని కృతులు సంస్కృతంలోనే వున్నాయి.

## 4. గోపాలభట్ట గోస్వామి

గోపాలభట్టు వ్యక్తిగత జీవితంలోని విశేషాలు అంతగా తెలియవు. ఆయన దక్షిణ భారతదేశానికి చెందిన బ్రాహ్మణుడు. ఆయన తండ్రి పేరు తిరుమల భట్టు అని చెబుతారు. చైతన్యులు దక్షిణ భారతయాత్ర చేసినప్పుడు, ఆయన శ్రీరంగంలో తిరుమలభట్టు అతిథిగా వుండి వున్నారని కూడ చెబుతారు. మరో ఆకారాన్ని బట్టి, గోపాలుని తండ్రిపేరు వేంకటభట్టు. గోపాలుని తండ్రి చైతన్యుల ఆధ్యాత్మిక వ్యక్తిత్వం వల్ల చాలా ప్రభావితుడయ్యాడు. ఆయన ప్రశంసకులలో ఒకడుగా మారిపోయినాడు.

చైతన్యులు వర్షాకాలంలో ఆయన ఇంటనే చాతుర్మాస్య దీక్షలో వున్నారు. అప్పట్లో గోపాలుడు పసిబాలుడే. కాని కొద్ది సమయంలోనే గోపాలుడు చైతన్యుల వశీకరణ శక్తికిలోనై, ఆయన భక్తుడుగా రూపొందాడు.

గోపాలభట్టు గురుదేవులను సందర్శించడానికని పూరీకి వెళ్లినట్లు కనబడదు. ఆయన బృందావనవాసం కోరే బృందావనానికి వచ్చాడు. రూప సనాతన, రఘునాథులు అంతకు ముందుమంచే బృందావనంలో వుంటూ వున్నారు.

గోపాలభట్టు రూప సనాతన గోస్వాముల కంటె చాలా చిన్నవాడు.

బృందావనంలో వారి మృతి తర్వాత కూడ ఆయన అక్కడనే తన జీవిత యాత్ర చాలాకాలం సాగించాడు.

కర్ణపూరకవి రాసిన ఒక శ్లోకాన్ని బట్టి గోపాలభట్టు నాట్య సంగీత కళలందు మేటి. గోపాలుని ప్రధాన శిష్యుడు శ్రీనివాసు. జీవ గోస్వాములు, శ్రీనివాసుని కి'ఆచార్య' బిరుదం ప్రసాదించారు. అనంతర కాలంలో, శ్రీనివాసాచార్యుడు, బెంగాలులోని వైష్ణవులకు నాయకత్వం వహించిన ముగ్గురిలో ఒక్కడుగా గణనకెక్కాడు. మిగిలిన ఇర్వురూ 1. నరోత్తమఠాకురు. 2. శ్యామానందు అనువారు. శ్రీనివాసు గోపాభట్టు. జీవగోస్వాముల వద్ద వైష్ణవాగమాలను అధ్యయనం చేశాడు.

గోపాలభట్టు వ్యక్తిగత జీవితాన్ని గురించే గాక అతని కృతులను గూర్చి కూడ వివిధాలైన జనశ్రుతులూ, కింవదంతులూ ఉన్నాయి. ఆయన రచనల గురించి విద్వాంసులలో ఏకాభిప్రాయం లేదు. 'భాగవత భక్తి విలాస' అనే గ్రంథాన్ని గోపాలభట్టు కర్తృకమని చెబుతారు. డా॥సుశీలకుమారదే, డా॥బిమాన బిహారీ మజుందార్, వీరి అభిప్రాయానుసారం 'హరిభక్తి విలాస' మనే బృహద్గ్రంథం సనాతన, గోపాలభట్టుల ఉభయకర్తృకం కావచ్చు.

## 5. రఘునాథభట్ట గోస్వామి.

గోస్వామి రఘునాథభట్టు జీవితాన్ని గురించి, ఆయన కార్యకలాపాల్ని గురించి మనకు చిక్కే ఎఱుక మిక్కిలి తక్కువ. విద్వాంసుల అభిప్రాయానుసారం, రఘునాథభట్టు (ఈయన రఘునాథ దాస గోస్వామి కంటె భిన్నుడు) పుస్తక రచన ఏమీ చేయలేదు.

రఘునాథభట్టు వలెనే గోపాలభట్టు కూడ బాల్యావస్థలోనే చైతన్యుల సంపర్కంలోకి వచ్చాడు. చైతన్యులు బృందావనం నుంచి తిరిగివస్తూ వారణాసిలో రఘునాథభట్టు తండ్రి తపన మిశ్రుని యింట అతిధిగా వుండి వున్నారు. రఘునాథు అప్పుడు చిన్న పిల్లవాడు. ఆ వయస్సులోనే ఆయన గురుదేవుని సంపర్కంలోకి వచ్చాడు. చైతన్యుల ఆధ్యాత్మిక మోహకత్వంచే ఆయనకు వశీభూతుడైనాడు.

తర్వాత రఘునాథభట్టు చైతన్యులను కలియడానికి పూరీజగన్నాథం వచ్చాడు. ఈతడవ, ఆయన గురువు గారి దగ్గర ఎనిమిది నెలలు అంతేవాసం చేశాడు.

ఆ పిమ్మట, చైతన్యులు బృందావనం వెళ్లి రూపసనాతనులకు చేదోడు వాదోడుగా వుండి వారు సంకల్పించిన పనుల్ని నెఱవేర్చవలసిందిగా హితం

గటిపారు. చైతన్యులు రఘునాథభట్టుకు తులసిమాల ఒకటి సమర్పించారు.

కృష్ణదాసకవిరాజు వ్రాసిన దాని ప్రకారం, రఘునాథభట్టు శ్రీమద్భాగవతం చక్కగా హృదయంగమం చేసికొన్న వ్యక్తి. ఆయన శ్రీమద్భాగవతపారాయణ చేస్తూ వుంటే రూపగోస్వామి వీనుల విందుగా విని సంతోషిస్తూ వుండేవారు.

రఘునాథభట్టు గోస్వామి కూడ బృందావనంలోనే తన ఇహలీల చాలించాడు.

## 6. జీవగోస్వామి

జీవగోస్వామి సనాతన రూపగోస్వాముల కనిష్ఠ సోదరుడు అనుపముని (వల్లభునికి చైతన్యులు స్వయంగా పెట్టిన పేరు ఇది) ఏకైక పుత్రుడు. రూప గోస్వామి జీవితం, కార్యకలాపాలు వర్ణించిన చోట, లోగడనే అనుపముని అకాల మృత్యువుని గురించి కూడ చెప్పడమైంది.

జీవగోస్వాములు, తాము ఎన్నడూ చైతన్యుల వ్యక్తిగత సపర్కంలోకి వచ్చిన జాడ పొడగట్టరు. ఈ విషయంలో బృందావనంలోని ఇతర గోస్వాములకు ఆయన అపవాద రూపము. ఆయన రఘునాథ దాసు, గోపాలభట్టు, రఘునాథభట్టు వీళ్ల తరానికి చెందినవాడు. ప్రసంగవశాత్తు, ఇక్కడ చెప్పవలసిన విషయ మొకటి వుంది. చివరి నలుగురు గోస్వాములు చైతన్యులు కంటె వయసులో చాలా చిన్నవారు. సనాతన రూప గోస్వాము లిర్వురూ చైతన్యుల కంటె పెద్దవారు.

రూప సనాతను లిర్వురూ బృందావన నివాసానికి వచ్చినప్పుడు జీవగోస్వామి బాలుడు. చైతన్యులను జీవగోస్వామి చూచి కూడ యుండక పోవచ్చు. కాని చైతన్యుల పరోక్ష ప్రభావం ఆయన మీద చిఱుత ప్రాయమునుండే పడనారంభించింది. ఆయన తండ్రి, అనుపముడు, అకాలమృతికి అవ్యవహిత పూర్వమందే చైతన్యుల వైపు ఆకర్షింపబడినాడు. ఆయన పినతండ్రులిరువురూ చైతన్యుల శిష్యఱికాన్ని స్వీకరించారు. వారిద్దరు గుర్వాజ్ఞానుసారం, బృందావనంలోనే వుంటూ వచ్చారు. జీవగోస్వామి కుటుంబంలోని ఇతరులనుండి ఈ సంగతులన్నీ తెలుసుకుంటూనే వున్నాడు. చైతన్యుల త్యాగమయజీవితం, వారి ఆధ్యాత్మిక వ్యక్తిత్వం, వాళ్లయింటిలో, ప్రతిదినమూ చర్చావిషయాలై, 'జీవు'నిలో జిజ్ఞాసను మఱింత రేకెత్తించాయి.

'జీవుడు' పెద్దవాడైన పిమ్మట ఆయన స్వభావంలో ధార్మిక ప్రవృత్తి దృఢపడిపోయింది. ఆయన మనః పటలంపై చైతన్యులను తనయిర్వురి పిన తండ్రులను దివంగతుడైన తన పితృపాదులను, ఆదర్శముగా వుంచుకొని, తన

జీవితంలో వారి మార్గాన్ని అనుసరించవలెననే తీవ్రమైన ఆకాంక్ష ఉదయించింది. 'జీవుడు' చిన్న వయస్సులోనే తాను సన్యాసాశ్రమం స్వీకరించవలెననే నిర్ణయానికి వచ్చాడు.

'జీవు'నిలో పసితనము నుంచే శాస్త్రాధ్యయనం చేయడానికి కావలసిన ప్రతిభారేఖలు కానవచ్చేవి. ఇందువల్ల గూడ, ఆయన భావిజీవితానికి కావలసిన మనోభూమి చక్కగా ఏర్పడింది.

తురీయాశ్రమ జీవితాన్ని గడపవలెననే ధ్యేయం ఆయనలో స్థిరపడి, చివరకు చైతన్య సంప్రదాయంలో దీక్ష పొందవలెననే అభిప్రాయంతో, ఆయన గృహత్యాగం చేసేశాడు.

అప్పట్లో, సనాతన రూప గోస్వాముల కుటుంబాలకు చెందిన వారంతా ఫతేయాబాదులో వుంటూ వుండేవారు. 'జీవు'డు సన్యాసి వేషంలో మొట్టమొదట నవద్వీపయాత్ర చేయడానికని బయలుదేరి వెళ్లాడు.

అచ్చట శ్రీనివాసుని ఇంట్లో ఆయన నిత్యానందుని కలిసి కొన్నాడు. చైతన్యుల పవిత్రస్మృతులు నింపుకొని వుండడంచేత, ఆ చోటు ఆయనకు తీర్థస్థలమే అయింది.

నవద్వీపంలో కొంతకాలమున్న పిదప, ఆయన వారణాసికి వెళ్ళారు. అచ్చట ఆయన వ్యాకరణం, శ్రుతిస్మృతులు, వేదాంతం మొదలైన విద్యలను ప్రసిద్ధ పండితులైన మధుసూదన వాచస్పతుల సన్నిధానంలో అభ్యసించాడు.

'జీవు'డు వారణాసి నుండి బృందావనంలో నివసించాలనే కోరికతో అక్కడకు వెళ్లాడు. అచ్చట ఆయన తన పిన తండ్రుల సన్నిధానంలో వుంటూ వచ్చాడు. అప్పటి నుంచి బృందావనంలో సంయమంతో గూడిన సాధుసన్యాసి జీవితాన్ని గడుపుతూ వచ్చాడు. బృందావనంలో ఆయన తన పినతండ్రుల వద్ద భక్తి శాస్త్రాన్ని గురించి, విశేషించి, అభ్యసించాడు. పిమ్మట వారిరువురూ రచించిన గౌడీయ వైష్ణవ సంప్రదాయానికి చెందిన అనేక సాహితీకృతినిర్మాణంలో తానెంతో సహకరించాడు. జీవగోస్వామి సర్వతోముఖ పాండితీ మండితుడుగా అనతికాలంలోనే పేరు సంపాదించాడు. ఆయన ప్రతిభాపూర్ణమైన వైదుష్యానికి, వైష్ణవ జగత్తులోపల దానికి బైటను గూడ విద్వజ్జనం, నివాళులర్పించ సాగింది. ఆయన సంస్కృత భాషలో ఇంచుమించు ఇరవై గ్రంథాలు రచించాడు. ఆ గ్రంథాలన్నీ సంప్రదాయంలో

యశోగౌరవాల్ని సంపాదించుకొన్నాయి. వానిలో గౌడీయ వైష్ణవ మతం యొక్క సారమంతా పిండేకృతమై వుంది.

సనాతన రూపగోస్వాము లిర్వురూ గోలోకవాసులైన పిమ్మట జీవగోస్వామి గౌడేయవైష్ణవ సంప్రదాయాని కంతటికీ సమాదరణీయుడైనాడు. ఉపాసనా పద్ధతిని గురించి గాని, ఆచరణ పక్షానికి సంబంధించి గాని, ఏ దైనా విషయం వివాదానికి వచ్చినప్పుడు, జీవగోస్వాములిచ్చే నిర్ణయమే తుది తీర్పుగా అంగీకరింపబడేది. అందరూ ఆయన నిర్ణయాన్ని శిరసావహించేవారు. శాస్త్రపంక్తుల్ని అన్వయించుకోవడంలో, సందేహాలు వచ్చినప్పుడు బెంగాలులోని వైష్ణవులు గూడ జీవగోస్వాములతో పత్రవ్యవహారం సలిపేవారు. వారిచ్చిన అభిప్రాయాన్ని ఔదల దాల్చేవారు. శ్రీనివాసు, సరోత్తమ్, శ్యామానందు – బెంగాలు వైష్ణవులకు, తర్వాతి కాలంలో ఆచార్యపురుషులుగా గౌరవింపబడేవారు. అట్టి ఈ ముగ్గురు కూడా జీవగోస్వామికి శిష్య పరమాణువులు. ఈ ముగ్గురి శిష్యుల ద్వారానే జీవగోస్వామి, బెంగాలులో వైష్ణవ సంప్రదాయ ప్రచారం సాగించాడు. గౌడీయ వైష్ణవ మతానికి ఆధారభూతమైన తత్త్వశాస్త్రం (దర్శనం) ముఖ్యంగా జీవగోస్వామిషట్కంలో, జీవగోస్వామి, సర్వాధిక రచయితగా, బహుముఖ జీవ ప్రతిభా సంపన్నుడుగా పేరు గడించాడు. ఆయన గ్రంథాలు పరిమాణంలో చాలా పెద్దవి. వివిధ విషయాన్వితాలైనవి కూడ. ఉదాహరణకు ఆయన మనకు తత్త్వ విద్య, కవిత్వం, రసశాస్త్రం, వైష్ణవ దర్శనం, వ్యాకరణం – వీటన్నిటి మీద గ్రంథాలు రాసి ఇచ్చాడు.

ఇతర గోస్వాముల వలెనే జీవగోస్వామి కూడ మృత్యుపర్యంతం బృందావనంలోనే సన్యాస జీవితాన్ని వెళ్లించాడు.

గోస్వాముల జనన మరణ తిథులను గుఱించి సునిశ్చితంగా చెప్పడానికి వీలు పడదు.

ఆరుగురు గోస్వాముల అస్థిశేషాలు బృందావన సమాధుల్లో భద్రపఱువబడి వున్నాయి. వైష్ణవ భక్తులకు మిగుల సాధారణమైన స్థితిలో, నిర్మింపబడిన ఈ సమాధులు, గోస్వాముల స్మృతి చిహ్నాలుగా ఆదరభాజనాలై, తీర్థస్థలాలుగా రూపొందాయి.

# IV

# బెంగాలులోని వైష్ణవ సాంప్రదాయం

## – చైతన్యులు

బృందావనంలోని అగ్రశ్రేణికి చెందిన వైష్ణవాచార్య పురుషులు, నవద్వీపంలోని నైష్ఠిక వైష్ణవ బృందం చైతన్యుల ప్రథమ శిష్య వర్గంలోని వారే. అయితే నేం? కొద్ది రోజులలోనే ఉభయ పక్షాలమధ్య ధార్మిక సిద్ధాంతాల వ్యాఖ్యా పద్ధతిలో అభిప్రాయ భేదాలేర్పడసాగాయి.

మనమొక విషయం ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి. బెంగాలులోని వైష్ణవులందరూ, వంగ వైష్ణవ సంప్రదాయానుగాములు కారు. నిజానికి, వంగ ప్రాంతంలోని వైష్ణవులెంతో మంది, చైతన్యమతానికి చెందిన బృందావనం లోని గోస్వామి షట్కం ద్వారా ప్రతిపాదితమైన వ్యాఖ్యనే అంగీకరించే వాళ్లు. బృందావన గోస్వాముల ద్వారా ప్రతిపాదితమైన సిద్ధాంతాన్నే బెంగాలులోని వైష్ణవులు కూడా ప్రచారంలోకి తెచ్చారు. దానినే వారు పాటించడం మొదలు పెట్టారు. ఈ పనిని నిర్వహించిన వారిలో ముఖ్యులు జీవగోస్వామి శిష్యులైన శ్రీనివాసాచార్యులు, నరోత్తమ ఠాకూరు.

కాని యిది ప్రత్యేకించి నవద్వీపంలో పుట్టి పెరిగిన మూల సిద్ధాంతం కాదు. మూడు ముక్కల్లో చెప్పాలంటే వంగ వైష్ణవం ప్రకారం, చైతన్యులు స్వయం శ్రీకృష్ణ భగవానులే. ఆయనకు పూజాపునస్కారాలు జరిగి తీరాలి. వంగ సంప్రదాయానికి చెందిన వారిలో ప్రముఖులు, మురారి గుప్త కవికర్ణపూరుడు, బృందావన దాసు, మొదలైనవారు. వీరందరూ, చైతన్యుల గురించి గ్రంథరచన చేసిన వారే. వీరి కృతులలో నవ ద్వీపంలో చైతన్యులు గడిపిన జీవితాన్ని గురించి ఎక్కువగా వర్ణింపబడి వుంటుంది. నవద్వీపవాసియైన చైతన్యులే వారికి పూజా పాత్రుడు. మురారి, కవికర్ణపూరుడు, బృందావనదాసు, లోచన దాసు, జయానందుడు,

చైతన్యులు ఒరిస్సాలో గడిపిన చివరి పండ్రెండేళ్లను గురించి ఎక్కువగా రాసి వుండలేదు. ఇందుకు భిన్నంగా, సనాతన గోస్వామి రూపగోస్వామి, రఘునాథదాను, జీవ గోస్వామి వంటి బృందావనంలోని నైష్ఠిక వైష్ణవుల కృతులలోనూ, కృష్ణదాసకవిరాజు (రఘునాథదాసు శిష్యుడవడం చేత, బృందావన సంప్రదాయానికి చెందినవాడు) రచించిన 'చైతన్య చరితామృతం' లోనూ, చైతన్యుల పురీక్షేత్ర నివాసం గురించి, విశేషించి వారి 'దివ్యోన్మాద' దశను గురించి విస్తృతంగా వర్ణించబడడం చూడవచ్చు.

బృందావన సంప్రదాయం ప్రకారం, చైతన్యులు శ్రీకృష్ణ పూజా విధానంలో ఓ మహత్తరమైన మాధ్యమముగా భావింపబడ్డారు. వంగ సంప్రదాయంలో, చైతన్యులే సాధనమూ, సాధ్యమూకూడ. ఇదే ఈ రెండు సంప్రదాయాలలోని ముఖ్యమైన అంతరువు. ఈ విషయం ఈ సంప్రదాయాలకు చెందిన వివిధ రచయితల కృతులలో నుండి, పదముల నుండి, మనం గ్రహింపవచ్చు.

నవ ద్వీపానికి చెందిన మురారి గుప్త, కాంచనపల్లికి చెందిన శివానందసేను, (కవికర్ణపూరుడు లేక పరమానంద సేనుని తండ్రి) శ్రీఖండానికి చెందిన నరహరి సర్కారు, చైతన్యులనే పూజా స్థానీయులుగా, మొదట ప్రతిపాదించినవారు.

చైతన్యుల పరమభక్తుడు శివానందసేను పుష్కలంగా ధనం గలవాడు. అంతేగాక సంఘంలో మంచి పలుకుబడి గలవాడు. ఆయన ఏటేటా, రథయాత్రా సందర్భంలో చైతన్యుల సందర్శనం కోసం బెంగాలు నుండి పూరికి వెళ్ళే యాత్రిక బృందానికి నాయకత్వం వహించేవారు. శివానందుడు చక్కని పద రచయిత కూడ. ఆయన పుత్రుడైన పరమానందుడు (కవి కర్ణ పూరుడు) తర్వాతి కాలంలో, చైతన్య చంద్రోదయం (నాటకం), 'మహాకావ్యం' రచించిన గొప్ప రచయితగా పేరు పొందాడు.

శివానందుడు, చైతన్యుల ప్రథమ శిష్య వర్గంలో ప్రముఖ స్థానీయుడు, నరహరికూడ భక్తి మయపద రచయితగా వీను మిగిలినవాడు. చైతన్యుల స్తోత్రాలలో, ఆయన పదాలకు గౌడీయ వైష్ణవ సాహిత్యంలో ప్రధానమైన స్థానం కద్దు. శివానందుని వలెనే, ఆయన కూడ అనేక పదాలలో విశ్వంభరునే (చైతన్యుని) కృష్ణ స్వరూపంగా భావించి కీర్తించాడు.

మురారి గుప్త, నవ ద్వీపంలో చైతన్యుల తొలి సహ యోగులలో గణనీయుడు.

ఆయన అనుచరవర్గంలో మేలి పంక్తికి చెందినవాడు. ఆయన చైతన్యుల వరిష్ఠ సహకర్ములలో ఒకడు. గురుదేవులకు నవద్వీపంలో అనుభూతాలైన ఆధ్యాత్మికానుభవాల కన్నింటికీ ప్రత్యక్షసాక్షి. మురారి ఇంట్లోనే తొలి సారిగా చైతన్యులు భావ సమాధి మగ్నులైనారు. మురారి కవి ప్రతిభా సంపన్నుడు. అందుచేత నవద్వీప భక్తులందరూ, ఆయన గురుదేవుల ధార్మికానుభూతుల నభివర్ణించవలెనని కాంక్షించారు. మురారి స్వయంగా 'కదచ' అనే (డైరీ పద్ధతిని రచించిన కృతిలో, ఈ విషయం పేర్కొన్నాడు.

డా॥ బిమాన బిహారీ మజుందారు ఉద్దేశం ప్రకారం, మురారి చైతన్యులు మృతి చెందిన రెండు సంవత్సరాల లోపలనే'కదచ' రచన పూర్తి చేశాడు. అందుచేత చైతన్యుల జీవితాన్ని గురించి రచించిన గ్రంథాల్లో దీనియందు విద్వాంసులకు హెచ్చు ప్రామాణిక బుద్ధి కలదు. గురుదేవులపై కవి కర్ణపూరుడు 'మహాకావ్యం' రచించాడు. అందులోని ఆధారసామగ్రికి, మురారి గుప్త రచించిన 'కదచ'కు కర్ణపూరుడెంతో ఋణపడి వున్నాడు.

మురారి చైతన్యునికి పరమ భక్తుడు. ఆయన గురుదేవుల నవద్వీపలీలలకు సాక్షీభూతుడుగా వున్నాడు. చైతన్యులు ఈశ్వరుని అవతారమేనని ఆయన విశ్వాసం. లోగడనే మేము చెప్పినట్లు, వంగ భూమిలోని ఇతర వైష్ణవులకు వలెనే, ఆయనకు గూడ చైతన్యులు ఆరాధ్య దైవమే గాని వేరు కాదు అని దృఢమైన విశ్వాసం. ఈ సందర్భంలో కవి కర్ణపూర రచితమైన చైతన్యభరితామృత మహాకావ్యంలో వర్ణింబడిన ఒక ప్రసంగాన్ని మన మిక్కడ ఉటంకింపవచ్చు.

ఓ సారి మురారి అద్వైతాచార్యులతో బాటు, పూరికి వెళ్లారు. నరేంద్ర సరోవరం దగ్గిరకు వచ్చి మురారి కూచున్నాడు. ఆయనతో అన్నాడు "నేనిక్కడదాకా మీ దయవల్ల రాగలిగాను. కాని ఇంకా ముందుకు రాలేను." నేనుజగన్నాధస్వామి దర్శనం కూడ చేసుకోలేను. కారణం మరేమీ కాదు. నేను చాలా పాపిని. కుపాత్రుడను. దయచేసి గురుదేవులకీ విషయం విన్నవించండి. బహుశా వీలైతే, నేను తర్వాత వస్తే రావచ్చు".

ఈ మాట చెప్పి ఆయన అక్కడనే చదికిలబడిపోయాడు.
ఇతర భక్తులు చైతన్యులు ముందుగా చెప్పినదాన్ని అనుసరించి, మొదట జగన్నాధుని దర్శనం చేసికొని, ఆ పిమ్మట గురు దేవుని దర్శనార్థం, వారి

సన్నిధికి వెళ్లారు.

అప్పుడు చైతన్యులు మిగుల వ్యాకులతతో అడిగారు. "మురి ఎక్కడ? ఎక్కడ మురారి?" అని భక్తులీ విషయం మురారికి చెప్పడానికి సిరోవర సరోవరానికి వచ్చారు. ఈ సంగతి విని, మురారి, అశ్రుధారా వర్షంతో,డగ్గుత్తిక వడ్డ గొంతుతో, ముకుళిత హస్తుడై పరుగెత్తుకుంటూ గురు సన్నిధానానికి వెళ్లి, వారి దర్శనం చేసికొన్నాడు. గురుదేవులు ఏమీ మాట్లా లేక పోయారు. వారు మురారిని కౌగిలించుకొని, ఆయన వీపును అశ్రుధారలతో తడిపివేశారు. ఈ ప్రసంగాన్ని బట్టి చైతన్యులకు మురారి ఎంత ప్రీతిపాత్రుడో మనకు అర్థమవుతుంది. ఈ వివరణను బట్టి మనం గ్రహించే మరో విషయం - మురారి దృష్టిలో చైతన్యులు తన ఉపాస్యదైవమైన శ్రీకృష్ణుడే గాక అన్యులుకారు.

ఈ సంఘటన చైతన్యపూజాసూచకం. ఇతర భక్త జనాళి. గురుదేవుల ఇచ్ఛానుసారం, మొదట జగన్నాథ దర్శనం చేసికొని, తర్వాతగాని గురుదేవుల సన్నిధికి వెళ్లలేదు. మురారి వారి వలెగాక, చైతన్య సందర్శనం ప్రథమంగా చేసి ప్రణమిల్లాడు. ఈ విధంగా చైతన్యుని యందాయనకు గల శ్రీకృష్ణ స్వరూప భావనము సార్థకమైంది. ఆయన మనోవాంఛ ఈడేఱింది.

బెంగాలులోని వైష్ణవీ సంప్రదాయం చైతన్యులను శ్రీకృష్ణాభిన్నులుగనేభావిస్తుంది. మురారి గుప్త కవి కర్ణ పూరుడు రచించిన సంస్కృత కృతులలోను, వైష్ణవ పదకర్తలు రచించిన వంగ పదాలలో,వ్రజబోలి పదాలలో చైతన్యులు పూజా లక్ష్యంగానే భావింపబడి, ఈ విచారధారకు పుష్టి చేకూరింది.

చైతన్యుని జీవిత కాలంలోనే, ఆయన ఈశ్వర స్వరూపులుగా పూజింపబడే వారు. ఈ విషయం వంగ భాషలో రచింపబడ్డ ఆయన జీవిత చరిత్రలను బట్టి విశదమవుతుంది. కాని బృందావన విద్వాంసులైన,గోస్వామి షట్కం, రచించిన సంస్కృత కృతుల లక్ష్యమిది కాదు. వారు సంప్రదాయంలో, పరమారాధ్య స్వరూపంగా శ్రీకృష్ణ భగవానులనే అంగీకరించారు. శ్రీకృష్ణుడొక్కడే ఆరాధ్యుడు. ఆ స్వరూపమొక్కటే పూజా పాత్రము. శ్రీకృష్ణుడొక్కడే పరమేశ్వరుడు. కాని వంగ వైష్ణవంలో చైతన్యులవతారమేగాదు, స్వయం అవతారి స్వరూపుడు. స్వయం పరమేశ్వరుడందుచేత పరమారాధ్యుడు. ఇట్లు భావించుట వంగవైష్ణవులకు

ప్రీతికరమైన విషయం.

## వంగ భూమిలో చైతన్యమత కేంద్రాలు

గౌడీయ వైష్ణవ సంప్రదాయానికి చెందిన ప్రధాన కేంద్రాలు మూడు. 1. వంగ దేశంలోని నవ ద్వీపం, 2. ఉత్కలంలోని పురీక్షేత్రం, 3. ఉత్తర ప్రదేశ్‌లోని బృందావనం.

వంగ భూమిలోని ప్రధాన కేంద్రం నవ ద్వీపమే. అచ్చటనే కదా గురుదేవుల ప్రాకట్య లీల! బెంగాలులో నవద్వీపం చైతన్య మతానికి ప్రధాన కేంద్రం. అక్కడే చైతన్యుల ప్రథమ శిష్య బృందం బెంగాలు వైష్ణవానికి సంబంధించిన ప్రచారానికి, కార్యకలాపాలకు, పునాదులు వేశారు. తర్వాతి కాలంలో వంగ భూమిలో అనేక స్థలాల్లో శాఖా కేంద్రాలేర్పడ్డాయి. ఎక్కడెక్కడ చైతన్యుల సహకర్మలుంటూ వచ్చారో, అక్కడక్కడమత ప్రచార కేంద్రాలు వెలిశాయి. చైతన్యుల మిత్రుల, అనుయాయుల నివాస స్థానాలు 'శ్రీపద' ములని వ్యవహరింపబడ్డాయి. ఈ స్థానాలన్నీ, గౌడీయ వైష్ణవ సంప్రదాయానికి ప్రచార కేంద్రాలుగా వుండడం చేత, తర్వాతి కాలంలో తీర్థస్థానాలుగా భావింపబడ్డాయి. ముందు పంక్తుల్లో డాంబిమాన బిహారీ మజుందార్ ద్వారా నిర్ణీతమైన,ఆ స్థానాల సూచిక ఇస్తున్నాం.

ప్రధాన కేంద్రమైన నవద్వీపంగాక, చైతన్యుల శిష్యులు, అభిమానులు, నదియా, బర్ద్వాన్, హుగ్లీ, ఇరవై నాలుగు పరగణాలు, జైసోర్ జిల్లాలో పెక్కు చోట్ల వుంటూ వచ్చారు. ఆయా చోట్ల మత ప్రచారం గానిస్తూ వచ్చారు. ఈ జిల్లాలలోని కొన్ని తావుల గురించి ఇక్క వ్రాస్తున్నాం. ఈ చోట్లు చైతన్యుల అగ్రశ్రేణికి చెందిన శిష్యుల ఉనికి పట్టువై వైష్ణవ మత కేంద్రాలుగా ఉంటూ వచ్చాయి. నదియా జిల్లాలో నవద్వీప నగరం చుట్టు ప్రక్కలచైతన్యుల అనేక భక్తులు, బర్ గాభి,డోగాభీ, మాన్‌గాభీ,కులియా, పహాడ్‌పూర్, చంపాహాటీ, సాలిగ్రాం మొదలైన గ్రామాల్లో ఉంటూ వుండేవారు. ఇవన్నీ వైష్ణవ క్షేత్రాలుగా భావింపబడుతూ వచ్చాయి. వీనిలో బర్‌గా భి గ్రామంలో కృష్ణదాసు, చైతన్యులతోనూ, నిత్యానందునితోనూ కలిసి వుండవలెననే కోరికతో, వచ్చి ఉండ నారంభించాడు. కృష్ణదాసుని స్వస్థలం బీహారులో.

నదియా జిల్లాలోని 'పులియా' ఒక ప్రసిద్ధమైన వైష్ణవ కేంద్రం. సుగ్రీవ మిశ్ర, గోవిందు, శివానంద పండితుడు, కాశీశ్వరమిశ్ర, జీవపండితుడు, తపన ఆచార్యుడు,

మొదలైన చైతన్యుల ప్రధాన సహ కర్ములక్కడ వుంటూ వుండేవారు.

శాంతిపురంలో సాధుశీలి యైన అద్వైతాచార్యులు వుండేవారు. అదే ముకుందరాయి, ఉద్ధరణ దత్తు, కృష్ణానందరాయి, అనువారికిజన్మస్థలం. కలకత్తా రాణా ఘాటుల మధ్య గంగ యొక్క తూర్పు ఒడ్డున, కలకత్తా గుప్తపాడాల మధ్య గంగానది పశ్చిమ తీరాన, ఎన్నో చోట్ల చైతన్యుల భక్తులనేకులుంటూ వచ్చారు. వరాహనగరం, సుఖచారా, పానీహాటీ, అరి ఆదహా, ఖరదహా, కాంచనపల్లి, కుమారహటలు అల్లే తూర్పు తీరమందునూ ఆకనా, మహేశ, తారా ఆటపుర్, జీరాట్, గుప్తపాడా, పశ్చిమ తట మందునూ వైష్ణవ మత ప్రసారానికి సంబంధించిన కేంద్రాలు ఇదే విధంగా బర్ద్వాన్ జిల్లాలోని కాలనా కులిన గ్రాం, దాయిహాట్, కట్వా, కులీ, శ్రీఖండ, మరియు వెలగాన వైష్ణవక్షేత్రాలలో విఖ్యాతికెక్కాయి.

చైతన్యుల సుప్రసిద్ధ సహకర్ములలోని నిత్యానందుని జన్మభూమి వీర భూమ్ జిల్లాలో వుండి వున్నది. నిత్యానందుని మరణాంతరం, ఈ జిల్లాలోని మాయానదల్, మంగల్ డిహి, కాదరా, మొదలైన అనేక స్థానాలు కీర్తన పద్ధతులను, వైష్ణవాగము సంస్కృతులకు కేంద్రాలుగానూ ప్రసిద్ధికెక్కాయి. జైసూరు జిల్లాలోని బోధఖనీ, జనహరా, బూణరాన్ శ్రీపద స్థానాలుగా ప్రసిద్ధాలు.

రాజశాహి జిల్లాలోని, ఖేడాఘాట్, గోకులానందు, వనమాలీదాసు జన్మ స్థానాలుగా ప్రసిద్ధినందాయి. ప్రసిద్ధికెక్కిన సోదరులు, సనాతనుడు, రూపగోస్వామి మాలదహ జిల్లానివాసులు. జంగలీ అని ప్రసిద్ధి కెక్కిన మరొక వైష్ణవ భక్తుని నివాసస్థానం, ఈ జిల్లాకే చెంది. జంగలీ టోటా అనే గ్రామం. 'జంగలీ' సీతా ఠకురాని శిష్యుడు. పబ్నా జిల్లాలోని సోనతాల కాల కృష్ణదాసుని 'శ్రీపదం'.

తూర్పు బెంగాలులోని చట్ట గ్రామ్ జిల్లాలో పుండరీక విద్యానిధి, వాసుదేవదత్తు, గదా ధర పండితుని తండ్రి మాధవ మిశ్రుడు జన్మించారు. చట్ట గ్రామం (చిటగాంగ్)లో, తర్వాతి కాలంలో వైష్ణవ సాహిత్యానికి సంబంధించిన ఎన్నో వ్రాతప్రతులు మనకు లభించాయి. చైతన్యుల భక్తులెందరో త్రిపురాజిల్లాలో కూడా వుండి వున్నారు. ఒకసారి రథయాత్రా సందర్భంలో పురీలో గుమిగూడిన భక్తుల సమక్షంలో అద్వైతాచార్యులు 'చైతన్యులు భగవత్స్వరూపులు' అని బాహాటంగా చాటారు. ఆ రోజు ఆ సమావేశంలో, చిట్టగాం, త్రిపురా, శ్రీహట్ట మొదలైన తూర్పు జిల్లాలకు చెందిన భక్తులెందరో వున్నారు.

చైతన్యుల జీవిత కాలంలో, వైష్ణవ మతం పశ్చిమ వంగ ప్రాంతంలో ఎక్కువ

వ్యాపకంగా ప్రచలితమై వుండేది. తర్వాతి కాలంలో తూర్పు బెంగాలులో వైష్ణవ మత ప్రభావం జనులపై సర్వాధికంగా ముద్రితమైంది. ఈ పరిణతికి, ముఖ్య కారణం - అద్వైతాచార్యులు, నిత్యానందులు, గదాధరుడు, విష్ణుదాసు - వీళ్ల వంశజులు నిరంతరం చేస్తూ వచ్చిన వైష్ణవ ధర్మ ప్రచారమే - తూర్పు బెంగాలోని ఢక్కా మరి మిగతా జిల్లాలలో ఎన్నో వైష్ణవ కేంద్రాలు వెలిశాయి. ఈ కేంద్రాలలో, అంతటా, వైష్ణవం జనప్రీతి సంపాదించుకున్న మతంగా రూపొందింది. తూర్పు బెంగాలులో, వైష్ణవ మతానికి, మిక్కిలి పేరు పడ్డ కేంద్రం ఢక్కా. ఢక్కా క్షేత్రంలోని, వైష్ణవ మతానికి చెందిన కొన్ని జనప్రియ రూపాలు - భారీ ఎత్తున కృష్ణ జన్మాష్టమి వేడుకలు సలుపుట, విశాలకీర్తన మండలులు, శోభాయాత్రలు, యితర విధాలైన సార్వజనీన సామూహిక కీర్తన మేళాదికాలు.

# V

# చైతన్య మతమూ – సాహిత్యమూ

గౌడీయ వైష్ణవ మతంయొక్క పరిణామం మధ్యయుగాన వంగ సంస్కృతికి సంబంధించిన వివిధ క్షేత్రాల్లో మనకు కానవస్తుంది. చైతన్య విచార ధార, బెంగాలులోను, విశేషించి బెంగాలు, ఒరిస్సా, బృందావనంలోనూ, సంప్రదాయానికి చెందిన అనుయాయుల్లో సాంస్కృతిక కార్యకలాపాలకు సంబంధించిన ఓ మహాయుగాన్నే తెచ్చిపెట్టింది.

ఈ విచార ధార, సాహిత్యం, సంగీతం, నాటకం, మొదలైన క్షేత్రాల్లో సృజనాత్మక శక్తిని అద్భుత పూర్వంగా ప్రేరేపించింది. మధ్య యుగంలో సాహిత్యము, సంగీతము, ఎక్కువగా పెనవైచికొని వికసించిన మాట నిజమే అయినప్పటికీ, ఇవి రెండూ, రెండు వేరే విషయాలు గనుక వీటిని గూర్చి రెండు ప్రత్యే అధ్యాయాల్లో వ్రాస్తున్నాం.

మధ్య యుగాన వంగ సాహిత్యం, చైతన్యమతం యొక్క ఆందోళన ఫలితంగాపల్లవించింది. ముఖ్యంగా ఇందుకు కారణ భూతులు చైతన్యుల అనుయాయులే. ఈ సాహిత్య సామగ్రి విపులమైంది కాబట్టి,దీన్ని గురించి ప్రత్యేకంగా తెలుసుకోదగి వుంటుంది.

ముందుగా మనం, సంస్కృతంలోని వైష్ణవ సాహిత్యం గురించి తెలుసుకుందాం. ఈ సంస్కృత సాహిత్య నిర్మాణం, బృందావనంలోని చైతన్యుల శిష్యుల ద్వారా జరిగింది. బృందావనంలోని గోస్వాములు, తమ కృతులలో వైష్ణవ ధర్మ దర్శనంలోని ఉదాత్తతను ప్రతిపాదించారు. ఈ కృతులన్నీ సంస్కృత భాషలో ఉన్నాయి. అందుచేత, మధ్య యుగంలో, ధర్మ గ్రంథాల వల్ల, దార్శనిక కృతుల వల్లా, సంస్కృత సాహిత్యమెంతో అభివృద్ధి గాంచింది. గోస్వాముల సంస్కృత కృతులు కూడ ప్రసిద్ధి గడించుకొన్నవే. ఈ కృతులన్నిటా, ఎంతో వైదుష్యం అద్వితీయమైన ప్రతిపాదన ప్రతిభా పాటవం, నిండి వున్నాయి. బృందావనం

గోస్వామి షట్కం గురించి చెప్పినప్పుడు, ఆయా విషయాలన్నీ కొంత వరకు వర్ణింపబడ్డాయి.

చైతన్యుల మృతి తరువాత, బెంగాలులోని వైష్ణవ బృందం, ఒంటిపాటుతనం, దుఃఖం మొదలైన నిరాశా ప్రవృత్తుల మూలాన నిర్జీవమై పోయింది. కీర్తనలు, భజనలు, వీనిలోని ఆకర్షణ శక్తి, అంతమై పోయింది. ఈ మధ్యకాలంలో, కర్ణ కుహరాల్లో అనవరతం, గంగా తీరాలపై మార్మోగుతూ వుండే కీర్తన సంగీతం, ఇప్పుడెక్కడా వినబడడంలేదు. గురువుగారిని కోల్పోయిన చైతన్యుల అనుయాయులు, దుఃఖ భావంలోనే ఒకరొకరుగా కాలాంతరంలో కాలకబళితులై పోయారు. గురునిర్యాణం తర్వాతి ఏభై ఏండ్లకాలంలో, ఎక్కడా ఉత్సాహపూర్ణమైన వాతావరణం ఉన్నట్లు కానరాదు. అయితే బృందావనంలోని సనాతన, రూప, లోకనాథ, గోపాలబట్ట, రఘునాధ దాస గోస్వాములు తమ కర్తవ్యాన్ని ధైర్యంగా నిర్వహిస్తు వచ్చారు. ఆ నిర్వహణ వెనుక, గుర్వాదేశం ప్రబలంగా పని చేసింది. సనాతన రూప గోస్వాములుచైతన్య నిర్దేశానుసారం, అనవరత సాహిత్య సృష్టిలో నిమగ్నులై వుండే వారు. బెంగాలు లోని వైష్ణవ బృందం గురు మరణ దుఃఖం నుంచి తెప్పరిల్లి తేరుకొనేటప్పటికి, చైతన్య విచారధారకు వుండవలసినంత గౌరవం, సమాజంలో వుండకుండాపోయింది. నిత్యానందు, అద్వైతాచార్యులు, అప్పటకిఇహలీల చాలించారు. వారు పోయిన కొద్ది కాలానికే, నరహరి కూడ వారి ననుగమించి శరీర యాత్రచాలించాడు.

వైష్ణవ భక్తుల, అనుయాయుల దృష్టి ఇప్పుడు 'పురి' నుండి వైదొలగి బృందావనం వైపు మళ్ళింది. గొప్ప గొప్ప గ్రంథాలు రచింపబడ్డాయి. ఎందరో రచయితలు వైష్ణవోపాసనా పద్ధతిని క్రోడీకరింపసాగారు. ఈ అందరి ప్రయాస ప్రయత్నాల వల్లనే, మధ్య యుగ మందలి, వంగవైష్ణవ మతం ఓ ప్రత్యే సంప్రదాయంగా పరిణమించింది. ఎంతో పుష్కలమైన దార్శనిక సాహిత్యం, కావ్యసాహిత్యం సృష్టింపబడింది.జనులలో విరివిగా ప్రచారం పొందింది. చైతన్యుల అనుయాయుల దృష్టిలో బృందావన మంటే ఓ ప్రత్యేకమైన గౌరవ భావం నెలకొన్నది వంగ వైష్ణవ బృందం, బృందావనంలోని వైష్ణవ స్వాముల మన్ననపొందని ఏ పుస్తకాన్ని గౌరవించేది కాదు.

బృందావన గోస్వామి షట్కరచితమైన సంస్కృత సాహిత్యం ద్వారా వైష్ణవ

బృందంలో, ఆ స్థైర్యపూర్ణమైన విశ్వాసం రేకెత్తింది.

చైతన్యోపాసన, ప్రారంభదశనుండి కూడ, అసాధారణమైన సాంస్కృతిక కార్యకలాపాలు నడుస్తూ వుండేవి. నిజం చెప్పాలంటే,చైతన్య విచారధార చేత ప్రేరితమైన, తొలినాటి సాహిత్య మంతా, సంస్కృతంలోనే రచింపబడింది. ఈ రచనా వ్యాసంగంలో, ప్రధానంగా పేర్కొదగ్గది బృందావనంలోని గోస్వామి షట్కానికి చెందిన, సాహిత్య నిర్మాణమని వేరుగా చెప్పనక్కరలేదు. వంగ శాఖకు చెందినవైష్ణవ సాహిత్యంలో ఇద్దరే ముఖ్యంగా పేర్కొదగ్గవారు. 1. మురారి గుప్త 2. కవి కర్ణపూరుడు. చైతన్య మతానికి చెందిన సాహిత్యం ప్రధానంగా రెండువిధాలు. 1. గీతాత్మక సాహిత్యం 2. జీవిత చరిత్రలు. గీత రచనలతోనూ, జీవన కథాతత్వంతోనూ, నిండి యున్న ఈ సాహిత్యంలో మరోవైపు దర్శనం, కావ్య శాస్త్రం మొదలైన వానిని గురించి కూడ పుష్కలంగా రచనలు సాగాయి. ఈ విధంగా చూస్తే, మొత్తం మీద వైష్ణవ సాహిత్యం పుష్టిమంతమూ, పుష్కలమూ, సర్వతోముఖమూ, అని చెప్పక తప్పదు.

చైతన్యుని ద్వారా ప్రేరితమైన మధ్య యుగాన చరిత్రాత్మక కృతులకూ, వర్ణనాత్మక కృతులకూ, మురారి గుప్త రచనలూ, కవి కర్ణపూరుని రచనలూ ప్రాతినిధ్యం వహిస్తాయి. కాని వైష్ణవ, ధురంధరులైన గోస్వాముల రచనలు సాహిత్యక దృష్టితో చూచినపుడు మరింత విలువైనవిగా కానవస్తాయి. ఈ రచనలే సంస్కృత సాహిత్యంలో చిరస్మరణీయులుగా నిలిచేవి. రూప గోస్వామి, రామానందరాయ్, రఘునాథదాసు, కవి కర్ణపూరుడు, జీవ గోస్వామి, కృష్ణ దాస కవిరాజు, మొదలైన వారి కవితలు, కృతులు,నాటకములు, పదసాహిత్యం, చంపూ కావ్యాలు, గేయాలు మొదలైన వాటిని ఈ సందర్భంలో పేర్కొనవచ్చు. రూపగోస్వాముల ద్వారా సంకలితమైన బృహత్సంగ్రహం 'పద్యావళి' వైష్ణవ కవుల భావాత్మకమూ, కావ్యాత్మకమూ అయిన రచనలకొక చక్కని ఉదాహరణం. ఈ వైష్ణవ కవులలో ఎందరో చిన్న చిన్న చిల్లర కవులు భక్తి పరములైన తమ రచనలకు పేరు సంపాదించుకున్నారు.

అప్పుడప్పుడు సంస్కృతంలోని వైష్ణవ సాహిత్యం, బెంగాలీలోని రచనల కొలవడి దిద్దింది. వంగభాషలోని జీవిత చరిత్రకు సంబంధించిన కావ్యాలు ఇందుకు ఉదాహరణం. మురారిగుప్త, కవి కర్ణపూరుడు సంస్కృతంలో చైతన్యుల

జీవిత చరిత్రను రచించారు. చరిత్రాత్మకాలైన ఈ కృతులు, వంగ భాషలో, కృష్ణ దాస కవిరాజు, బృందావనదాసు, లోచన దాసు, జయానందుడు,తదితరులు రాసిన జీవిత చరిత్రలకంటె ముందు రచింపబడ్డాయి. వంగ భాషలోనూ విరివిగా జీవిత చరిత్రలు రాయబడినాయి. చైతన్యులు వంగ భూమిలో అవతరింపక మునుపు వంగ భాషలో జీవిత చరిత్రలు రచించే పరిపాటి వున్నట్లు కనబడదు.

మురారి గుప్త సంస్కృతంలో రచించిన 'చైతన్య చరితామృత' మనే గ్రంథం గురుదేవులకు సంబంధించిన తొలి 'జీవన చరిత్ర' కావ్యం. కావ్యరూపంలో రచింపబడిన ఈ గ్రంథం పౌరాణిక శైలిలో నడిచింది. అనగా వక్త శ్రోతలకు కథ వినిపించే ఫక్కి ఇందులో స్వీకరింపబడ్డది. మురారి గుప్త ఈ కావ్యంలో వక్త. దామోదర పండితుడు శ్రోత. మురారి గుప్త గ్రంథారంభంలోనే, తానీ గ్రంథాన్ని శ్రీవాసుని నిర్దేశానుసారం రచించినట్లు చెప్పాడు. [శ్రీవాసుని గృహంలోనే చైతన్యులు తమ తొలి నాటి శిష్య మండలిని కలుసుకుంటూ వుండేవారు; కీర్తనలతోను భజనలతోను, భావ విహ్వల మైన దశలో రాత్రులు గడిపేవారు. ఈ పుస్తకంలో శ్రోతగా నిరూపింపబడ్డ దామోదరం పండితుడు, గురువు ద్వారా సన్న్యాస గ్రహణం చేసిన పిమ్మట, గురువు వెంట 'పురీ' యాత్రకై వెడలిన, నల్గురి శిష్యులలో ఒకడనే సంగతి కూడ మనమిక్కడు గుర్తుంచుకోవాలి. మురారి గుప్త, రచించిన సర్వాంగ సుందరమైన ఈ కావ్యంలో78 సర్గలున్నాయి.

పరమానందసేను (కవి కర్ణపూరుడు మురారి గుప్త కృతి చే ప్రేరితుడైనాడు) 'చైతన్యచరితామృతం' నుండి బాహటంగా వస్తు సంగ్రహం చేశాడు. కాని కవి కర్ణపూరుని కావ్యం కావ్య దష్టితో చూసినప్పుడు మరింత మహత్త్వ పూర్ణమైంది. ఈ కావ్యం 20 సర్గలలోనే పరి సమాప్తమైంది. కాని పరిమాణంలో మురారి గుప్త కృతితో సమానమైందే. కవికర్ణపూరుడుమొదటి పది సర్గలలో చైతన్యుల సన్న్యాస జీవితాన్ని వర్ణించాడు, మిగతా పది సర్గలలోనూ, ఆయన మిగతా జీవితాన్ని వర్ణించాడు.

కవి కర్ణ పూర్ణుడు రచించిన 'చైతన్య చంద్రోదయ నాటకం, అతడు రచించిన కావ్యం కంటె ఎక్కువ పేరు సంపాదించుకున్నది. ఇది గూడ గురు దేవుల జీవిత చరిత్రమే. నాటక రూపంలో వుంది, అంతే తేడా. పది అంకాల్లో రచించిన చైతన్య చంద్రోదయంలో చైతన్యుని జీవితానికి సంబంధించిన ముఖ్య ఘట్టాలు

వర్ణింపబడ్డాయి. ఈ కృతి నాటక రూపంలో రాయబడ్డది కాని ఇది నిశ్చితంగా వాస్తవిక నాటకం గాదు ఎందుకంటే రచయిత ఏ విధమైన నాటకీయ శైలిని ప్రయోగింపకుండా, గురుదేవుల ఆధ్యాత్మిక జీవితంలోని ప్రముఖ సంఘటనలను, అనుభూతులను మాత్రమే వర్ణించాడు. చరిత్ర పోషణ కూడ ఉత్తమ స్థాయిలో జరుగలేదు. కాని రచయిత గురుదేవుని జీవితాన్ని విశదంగా అంకితం చేయగలిగాడు. నాటకం యొక్క ప్రస్తావనలో రచయిత, సూత్రధారుని ద్వారా, ఈ నాటకం ప్రతాపరుద్రగజపతి మహారాజుగారి ఆదేశానుసారం, పురీక్షేత్రంలో జగన్నాథ రథయాత్రా ఉత్సవ సందర్భంలో ప్రదర్శింపబడుతున్నట్లు చెప్పించాడు.

రూపగోస్వామి రచించిన నాటక కృతులు వివిధములు. వానిని ఉదాత్తకృతులుగా లోకం స్వీకరిస్తుంది. కాని రూప గోస్వాముల నాట్య కృతులు చైతన్య లీలా సంబంధులు కావు. వానిలో కేవలం కృష్ణ లీలలు వర్ణింపబడ్డాయి. బృందావన గోస్వాముల కావ్య వస్తువు ప్రధానంగా కృష్ణ లీలాత్మకం. ఈ విధంగా పర్యాలోచిస్తే రూప గోస్వాముల కావ్య వస్తువు చారిత్రకం గాదు, కాల్పనికం మాత్రమే. అయితే ఈ కృతుల ద్వారా, వైష్ణవ మతతత్త్వం అభివర్ణించి, దానిని మహిమాన్వితంగా నిరూపించడమే, రచయిత ముఖ్యోద్దేశం.

రాధాకృష్ణోపాసన,నాటక రూపంలో గౌడీయ వైష్ణవ మతానురూపంగా వీనిలో వివేచింపబడ్డది. ఈనాటకాల రచన కావ్య శాస్త్రంలోని భక్తి రస భావనలకనుకూలంగా నడిచింది.

రూపగోస్వామి రచించిన మూడు నాటకాల్లోనూ, 'కౌముది' దాన ప్రధానమైనది. అది ఒక అంకంతోనే ముగిసింది. ఈ నాటకంలో గీతాలేమి లేవు. సంవాదం గద్యంలోనూ, పద్యం లోనూ నడిచింది. రూపగోస్వామి నాటకాల్లో ఇది అన్నింటికంటె చిన్నది. వస్తువు కూడ ఉదాత్తమైనది కాదు. కాని ఈయన రచించిన 'విదగ్ధ మాధవ' నాటకం ఏడంకాలది. శృంగార లీలా ప్రధానమైంది. రూపగోస్వామి విస్తృతమై, నియమబద్ధమైన ఈనాటకంలో, రాధా కృష్ణుల బృందావన లీలలన్నిటిని చక్కగా అభివర్ణించాడు. ఈ నాటకంలో ఒక శ్లోకం ద్వారాచైతన్యుల నభినందించాడు. ఈ నాటకం బృందావనంలో రంగస్థలంపై ప్రదర్శింపబడింది కూడా.

రూప గోస్వామి రచించిన మూడవ నాటకం 'లలిత మాధవం'. ఇది

విదగ్ధమాధవం కంటె కూడా విస్తృతమైంది. పది అంకాల్లో పరి సమాప్తిచెందింది. దీనిలో కూడా రచయిత చైతన్యులను అభినందించాడు. లలిత మాధవంలో శ్రీకృష్ణుని కేవలం బృందావన లీలలుగాక, ఆయన మధుర లోని జీవిత విశేషాలు, ద్వారక లోని విశేషాలు కూడా, చోటు చేసికొన్నాయి. ఈ నాటకం కూడా, బృందావనంలోని రాధాకుండంలోని మాధవ మాధవీ మందిరంలో వైష్ణవ భక్తుల సమక్షంలో అభినయింపబడింది. దీపావళి పర్వ సందర్భంలో, గోవర్ధన గిరిపూజా సమయంలో, ఈ నాటకం ప్రదర్శింపబడ్డది. రూపగోస్వామి నాటకాలన్నీ రాధాకృష్ణుల లీలా కథలపై నాధారపడి భక్తి సిద్ధాంతాలకు రూపకల్పన చేస్తాయి. గౌడీయ వైష్ణవ భక్తులు, రూప గోస్వామి రచించిన ఈ కృతులకు, వాని కావ్య చమత్కారానికి గాక, ముఖ్యంగా వానిలో నిరూపితమైన భక్తి తత్త్వం కారణంగా, ఎంతో గౌరవమూ, సమున్నత స్థానము ఇస్తారు.

చైతన్యమతం ద్వారా ఉత్ప్రేరితావైన నాట్య రచనల వలెనే సంస్కృత కావ్య రచనలు కూడ, కృష్ణ లీలలు, ఆధారంగా గలవే. బృందావనంలోని కృష్ణ లీలలు ముఖ్యంగా గౌడీయ వైష్ణవ కవులు రచించిన సంస్కృత కవిత్వానికి వస్తువులు. ఎందుచేతనంటే, ఈ కావ్యములు గూడా, నాటకాల వలెనే వైష్ణవ భక్తి ఆందోళనం ముమ్మరంగా సాగిన దినాల్లో ఉవ్వెత్తుగా పొంగి వచ్చిన రచనలు. ఇందలి ధార్మిక భావనలు, మానవ స్వభావం లోని భావనాత్మక సౌందర్యాత్మక వృత్తులను సమ్మిళితం చేసుకొనే మానవ తత్త్వం మనకు ప్రదర్శిస్తాయి. మధ్య యుగంలోని ధర్మ ప్రవణమైన భక్తి మార్గంలో ఒక వినూతమైవ భావాత్మకత కూడ చోటు చేసికొన్నది.

గౌడేయ వైష్ణవ భక్తితో కూడిన సంస్కృత కావ్యాలలోని వస్తువు సాధారణంగా స్వచ్ఛందమైన మోహకత్వంతోనూ, గీతాత్మకమైన ఉద్రేకంతోనూ కూడి వుంటుంది. కృష్ణుడు రాధ వీరిద్దరి బృందావన లీలలు, ప్రధాన వస్తువైంది మిగతా వాటి అన్నిటికంటె రూప గోస్వామి, రఘునాధ దాసు, కవి కర్ణపూరుడు,జీవగోస్వామి, కృష్ణదాసకవిరాజు మొదలైన వారి చంపూ గ్రంథాలలోనూ, కావ్యాలలోనూ మనకీ విషయం ప్రధానంగా కనబడుతుంది. రూప గోస్వామి నాటకాలు,కవి కర్ణపూరుని 'ఆనంద బృందావన చంపువు' జీవగోస్వామి రచించిన గోపాల చంపువు, మాధవ మహోత్సవం, కృష్ణదాసకవిరాజు రచించిన గోవింద లీలామృతం, ప్రబోధానంద

సరస్వతి రచించిన, 'సంగీత మాధవం' మొదలైన కృతులన్నీ ముఖ్యంగా రాధాకృష్ణుల బృందావన లీలలపైన ఆధారపడ్డవే.

గౌడీయ వైష్ణవ రచయితలచే శ్రీకృష్ణుని బృందావన లీల ముఖ్యంగా 'నిత్యలీల' రూపంలో ఉద్భావింపబడింది. వారు బాలకృష్ణుని, కిశోర కృష్ణుని, ఈ రెండు రూపాలనే భక్తికి పరమ లక్ష్యాలుగా భావించారు.

మధ్య యుగం నాటి సంస్కృత సాహిత్యంలో జీవిత చరిత్రలు, కావ్యాలు, నాటకాలే గాకుండా వైష్ణవ స్తోత్రాలు, గేయాలు, పదాలు మొదలైనవి కూడ ముఖ్యమైనవే. చైతన్యుల అనుయాయులు ద్వారా రచింపబడ్డ స్తోత్రాల్లో, తీవ్రమైనభావనాత్మక తత్త్వ, శృంగారిక రహస్య తత్త్వం మనకు గోచరిస్తాయి. వైష్ణవ భక్తి ఆందోళనానికి చెందిన ఈ స్తోత్రాలు, ఈ సందర్భంలో, మామూలు పరిపాటిగా, పరంపరగా రాసే స్తోత్రాలకంటె వేరని మనం గమనించాలి.

రాధాకృష్ణ కథా తత్త్వం, చైతన్య సంప్రదాయానికి చెందిన వైష్ణవ భక్తులు రాసిన స్తోత్రాలకు ఒక నూత్న దిశను ప్రసాదించాయి. గౌడీయ వైష్ణవ మతానికి చెందిన రమణీయాలు, కళాత్మకాలూ, అయిన ఈ స్తోత్రాలు, తఋుచు ఆ కవులే రచించిన కావ్యాల ముందు ఎంచి చూస్తే ఎంతో చిన్నవి. కాని వీటిలో ఎన్నో స్తోత్రాలు వైష్ణవ భక్త బృందానికి కంఠహారాలైనాయి. ఈ స్తోత్రాలు, వారి ధార్మిక విచారాల్ని భావనలను, అభివ్యక్తం చేస్తూరావడం వల్ల వీటికి వారు నియతంగా, అనుదిన పారాయణం చేసేవారు.

లోగడ ఓసారి మేం చెప్పనే చెప్పాం, బృందావనం లోని గోస్వాములు చైతన్యుని సర్వోచ్చమైన ఈశ్వరదృష్టితో గాని, ఆయనను శరీరధారియైన ఈశ్వరునిగా గాని భావించేవారుకారు. వారి అభిప్రాయం ప్రకారం, కృష్ణుడే సర్వేశ్వరేశ్వరుడు. వారు చైతన్యుని కృష్ణుని వలెనే ఒక అవతారపురుషునిగా మన్నించేవారు. వారు తమ ధార్మికనిక కృతులలో ముఖ్యంగా కృష్ణ లీలా వివేచనం మాత్రమే చేశేవారు. చైతన్యుల లీలలను ఆ స్థాయిలో వారు చెప్పలేదు. చైతన్యుల దివ్య వ్యక్తిత్వాన్ని వారవశ్యం అభినందించారు నిజమే; కాని నవద్వీపంలోనూ, ఉత్కళం లోనూ, గురు పూజా విధానం ప్రచారంలో ఉన్నట్లుగా, బృందావనంలోని గోస్వాములలో అది ప్రచారంలో వున్నట్లు కనబడదు.

రఘునాథ దాసు రచించిన 'స్తవావళి'లో కూడ చైతన్యుడు చెప్పబడ్డాడు.

బృందావన గోస్వాములలో రఘునాధ దాసే అందరికంటె గురువు సాన్నిహిత్యంలో ఎక్కువగా ఉన్నవాడు. ఆయన ఏకధాటిగా పదహారేళ్ళపాటు 'పురి'లో గురువుగారిచెంత ఉన్నవాడు. రఘునాధ దాసుని స్తవావళిలో మొదటి రెండుస్తోత్రాలు ప్రత్యక్షంగా చైతన్యులకు సంబంధించినవి. కవి మొదటి స్తోత్రంలోనే ఒక మార్మికమైన విషయం చెప్పాడు. ఓసారి శ్రీకృష్ణుడు దర్పణంలో తన్నుతాను చూసుకుంటూ తన అందానికి తానే పరవశించి పోయాడట. ఆయనకు లోపల కోరిక పుట్టిందట. రాధ ఏ విధంగా తన అందాన్ని అనుభవించి, సుఖం పొందుతోందో, అదే విధంగా తాను కూడా తన సౌందర్య సుఖాన్ని పొందితే ఎంత బావుంటుంది అని అనుకున్నాడుట. తన ఆ కోరికనుతీర్చుకోడానికే, కృష్ణుడు 'గాండా'లో రాద యొక్క గౌర శరీరంలో తానుకూడ అవిభక్తంగా జన్మించాడుట. అంటే గౌరాంగుడుగా జన్మించాడు. శ్రీకృష్ణుడే రాధా భావాన్ని పొంది గౌరాంగుడైన చైతన్యుడుగా జన్మించాడని భావం.

రఘునాథదాసు తాను రచించిన 'గౌరాంగస్తవ కల్పతరువు'లో 'పూరీ'లో చైతన్యులు, కాశీశ్వర మిత్రుని ఇంటిలో వుంటునప్పుడు, గడిపిన భక్తిజీవితాన్ని అభివర్ణించాడు. దీనిలో గురుదేవుల మహా భక్త స్వరూపం చిత్రించబడింది.

చైతన్య మతానికి చెందిన ఈ కావ్యాత్మకమూ, భావనా పరమూ అయిన స్తోత్ర వాఙ్మయంలో ప్రబోధానంద సరస్వతి రచించిన 'చైతన్య చంద్రామృతా'న్ని కూడా మనం పేర్కొనవలసి వుంటుంది. చైతన్యుల మహిమ గానం చేసే ఈ కృతి సంప్రదాయ విరుద్ధమైన భావాలను ప్రకటిస్తూ వుండడం వల్ల, వైష్ణవ మతాచార్యుల అంగీకార ముద్ర పడయలేక పోయింది. అయినప్పటికీ, బోధానందుల ఈ కృతి తీవ్ర భావుకతా పూర్ణమైనదీ, ఆకర్షకమైనదిగానూ మనం గ్రహించవచ్చు.

ఈ కవిదే మరో కృతి'బృందావన మహిమామృతం' కూడా వైష్ణవ భక్త బృందంలో ప్రీతిని సంపాదించుకుంది. దీనిలో ప్రబోధానందుడు కృష్ణుని నివాస భూమి, కృష్ణుని లీలా విహార భూమి అయిన బృందావనంతో రాగాత్మక తాదాత్మ్యం స్థాపించుకొని, ఉజ్వలంగా ఉన్ముక్తం గా అయా ఘటనల నన్నింటినీ వర్ణించాడు.

రూప గోస్వామి రచించిన స్తోత్రాలను, గీతాలను, బిరుదు గద్యలను ఆయన సోదర పుత్రుడైన జీవగోస్వామి 'స్తవమాల' అనే గ్రంథంలో సంకలన పఱిచాడు.

ఇవి రఘునాథ దాసు తదితర వైష్ణవ సంస్కృత కవుల రచనల కంటె వేరుగా వుంటాయి. రూపగోస్వామి రచించిన ఈ కృతులలో ఎక్కువ భాగం బృందావనంలో నడచిన రాధాకృష్ణ లీలలే వర్ణింపబడినాయి. ప్రారంభంలోనిమూడు అష్టకాలు మాత్రం చైతన్యుని గూర్చి రాయబడినాయి. రూపగోస్వాముల ఈరచనల్లో సాహిత్య శైలీ సౌందర్యం, భాషా గరిమ అలంకార సన్నివేశ చారుత్వం, మొదలైన సల్లక్షణాలు గోచరిస్తాయి. ఎక్కువ భాగం ఇవన్నీ ఆకారంలో చిన్నవే. ఈ లఘు కృతులు గీతాత్మక గుణాలతో కూడి, శ్రుతి మధురంగా వుంటాయి.

సామాన్యంగా, బిరుద కావ్యమంటేగద్యాత్మకంగాగాని, పద్య మయంగాగాని, రాజుల ప్రశంసార్థం వ్రాయబడే రచనగా భావింపబడుతుంది.కాని వంగ భూమిలోని వైష్ణవ బిరుద కావ్యాలు,దేవీ దేవతా స్తుతి పరకాలుగా వుంటాయి. ఇవ్వి ఓ ప్రత్యేకమైన గద్య శైలిలో గాని, పద్యశైలిలోగానినడుస్తాయి.గౌడీయ బిరుద కావ్యముల రచనల్లో ఈ మౌలికత, ముఖ్యంగా రూపగోస్వామి ద్వారా సంక్రమించింది. ఆయనే ఈ విధానాన్ని వికసింపచేశారు.

విద్వాంసుడూ, కవీ అయిన రూప గోస్వామి సామాన్య బిరుదావ విలక్షణ' మనే ఒక విస్తృతమైన లక్షణ గ్రంధాన్ని రచించాడు. ఈ గ్రంధంలో బిరుద సాహిత్యానికి చెందిన రమారమి ఏభై విధలను లక్ష్య లక్షణ సమన్వితంగా నిరూపించాడు. పిమ్మట వల్లభ విద్యాభూషణుడు 'గోవింద బిరుదావలి' టీకలో రూపగోస్వామి రచించిన ఈ గ్రంథం నుండి ఎన్నో లక్ష్యాలను ఎత్తి చూపించాడు. జీవగోస్వామి, ఈ గ్రంథాన్ని అనుకరిస్తూ తాను 'గోపాల బిరుదావళి' అనేగ్రంథాన్ని రచించాడు. ఆయన తాను రచించిన 'గోపాల చంపు' వనే గ్రంథంలో కూడా, చివరి అధ్యాయంలో కొన్ని బిరుదస్తోత్రాలును సమావేశపటిచాడు.

రూప గోస్వామి 'గోవింద బిరుదావళి'లో 49 ప్రకారాల బిరుద పదాలను రచించి, ఒక అద్భుతమైన సాహిత్య ప్రక్రియను సఫలంగా చేసిన వాడైనాడు.

సంక్షేపంగా చెప్పాలంటే - రూపగోస్వామి స్తోత్రాలలోగానీ,బిరుద సాహిత్యంలోగాని, వర్ణన సన్నివేశాలు సజీవాలేగాక, భావభక్తితో అనగా భక్తి యొక్క మాధుర్య భావంతో నిండి తొణికిసలాడుతూ వుంటాయి. వీనిలోని అలంకార సన్నివేశం,సంగీతాత్మక లక్షణం, ప్రగీతాత్మకతా, ఇవన్నీ కూడా మెచ్చుకోదగ్గవే.కవి రచించిన స్తోత్రాలు, గీతాలు, ఆయన భక్తి భావానికి, సాహితీ ప్రతిభకు

దర్పణాలు.రఘునాథ దాసు రచనలు, ఇంతటి కళా వైభవంతో కూడుకొన్నవి కావు. కాని వానిలో రచయిత యొక్క నిష్ఠాపూర్ణమైనసరళ వ్యక్తిత్వం ప్రతిబింబిస్తూ వుంటుంది.

గౌడీయ వైష్ణవులచే సృజింపబడ్డ సంస్కృత సాహిత్యాన్ని గురించిన ఈ సంక్షిప్త వివరణం ముగించే ముందు రూపగోస్వామి యొక్క 'పద్యావళి' అనే సంగ్రహ గ్రంథాన్ని కూడా మనం స్మరించాల్సి వుంటుంది.

ఇది ప్రాచీన నవీన వైష్ణవ భక్తి పదసంకలనం. గౌడీయ వైష్ణవ మతంలోని భక్త్యుపాసనలను చిత్రించడం కొఱకు ఈ సంగ్రహ గ్రంథం నిర్మింపబడింది. ఈ పుస్తకంలో సంగృహీతాలైన పదాలన్నీ కృష్ణ లీలాపరాలే. కృష్ణ సంబంధాలైన వివిధ ఘట్టాలను, కృష్ణ భక్తికి సంబంధించిన, వివిధ పక్షాలను, ఆధారం చేసి కొని, ఒక సునిశ్చితమైన యోజన ననుసరించి సంకలిత మైంది ఈ గ్రంథం. పరిశీలించి చూస్తే వైష్ణవ రసశాస్త్రంలోనిఆలంకారిక వర్గీకరణం అనుసరించి దీనిలోని పదాలు వ్యవస్థీకరింప బడ్డాయనిపిస్తుంది. ఈ సంగ్రహ గ్రంథం యొక్క ముఖ్యమైన విలువ – కృష్ణ సంబంధమైన వివిధ పదాల సక్రమ సంకలనంలోవుంది. ఈ సంగ్రహం యొక్కప్రధానోద్దేశం, కృష్ణ భక్తికి సంబంధించిన భావాత్మక భక్తి (మధురాభక్తి)ని, దాని వివిధ పక్షాలను, చక్కగా వివేచించడమే. తన ఉద్దేశసాధనలో ఈ గ్రంథం కృతకృత్యత సంపాదించుకున్నది.

కావ్యాలు,నాటకాలు, స్తోత్రాలు, చంపూ గీతకావ్యాలు మొదలైన వివిధ రూపాలను ఒక్కసారి పర్యాలోచిస్తే చైతన్య మతం సంస్కృత సాహిత్య చరిత్రలోనే ఒక గణనీయమైన యుగానికి నాంది పలికిందనే సత్యం మనకు స్పష్టమవుతుంది.

నిజానికి చైతన్య మతం మధ్య యుగీన బెంగాలీ సాహిత్యం మీద మరింత ప్రభావ ముద్ర వేసింది.

చైతన్యుని సహకర్ములు, అనుయాయులు వీళ్ల ద్వారా బెంగాలీ భాషలో విస్తృతంగా రచింపబడ్డ సాహిత్యాన్ని గురించి ఏదో ఒక అధ్యాయంలో వర్ణించడమంటే సాధ్యమయ్యేపని కాదు. నిజానికి ఇది చాలా విపులమైన విషయం.

చైతన్య మతం మూలంగానే మధ్య యుగంలోని బెంగాలీ సాహిత్యంలో గీతాలు,జీవిత చరిత్రలూ, తొలిసారిగా రాయబడ్డాయి. ఈ రెండు సాహిత్య ప్రక్రియల మూలంగా బెంగాలీ సాహిత్యానికి కావలసినంత పుష్టి చేకూరింది.

బెంగాలీలో సర్వ శ్రేష్ఠమైన జీవిత చరిత్ర గ్రంథాలు ఈయుగంలో నేరచింపబడ్డాయి. చైతన్య మతం వల్ల ప్రేరణ పొంది వైష్ణవ కవులద్వారా రచింపబడిన గీతాలు, పదాలు కేవలం మధురమోహకములే గాక, వంగ సాహిత్యంలో వెలసిన వెలలేని మణిపూసలుగా రాణించాయి.

చైతన్య మతం ప్రభావం వల్ల క్షేత్రీయ సాహిత్యంలో రచింపబడే ఈ రెండు సాహిత్య ప్రక్రియల్లో మొదటి దానిలో రచన ముందే ప్రారంభమైంది. చైతన్యుల జీవిత చరిత్ర సంస్కృతంలోగాని, వంగ భాషలో గాని రాయబడడానికి పూర్వమే, చైతన్యల మీద గీతాలు, పదాలు రాయబడినాయి. గురుదేవులు నవద్వీపంలో వుంటూ వున్నప్పుడే ఇట్టి రచన లెన్నో వెలిశాయి. వారు గయ నుండి ఆమూల మూడంగా పరివర్తన చెందిన దివ్య పురుషులుగా అక్కడి నుంచి నవ ద్వీపం తిరిగి వచ్చారు. ఒక నాలుగు నెలల పాటు అతి కష్టం మీద వారు తమ పాఠశాలను నడుపుతూ వచ్చారు. కాని అటు పిమ్మట, ద్వీపంలో వారున్న చివరి ఎనిమిది నెలల్లోనూ, ఆయన ఆధ్యాత్మిక వ్యక్తిత్వం వికసించింది.

ఆయన ధర్మ ప్రవణమైన భావవిహ్వలత, రహస్యానుభూతి, మనోహర కీర్తన పద్ధతి,ఉన్మత భక్తి భావంతో కూడిననృత్యవిలాసం, వీని అన్నింటి వల్ల ఆకర్షింపబడి, నవద్వీపంలోని, ఆ చుట్టు ప్రక్కల ప్రాంతంలోని అనగా కల్వా, శ్రీఖండం, కులీన గ్రామం, కాంచన పల్లి మొదలైన చోట్లలోని భక్త బృందం చైతన్యుల చెంత చేరనారంభించారు.

వాళ్లకు ఆయన సాన్నిహిత్యంలో వుంటూ, ఆయన మండలిలో చేరి చూస్తూ వుంటే, శ్రీకృష్ణుడే, గౌరాంగ భగవానుడుగా అవతరించాడన్న విశ్వాసం దృఢపడింది. ఆ కాలంలో చైతన్యుడు ప్రదర్శించిన జీవిత ఘట్టాలకు భక్తులు ముగ్ధులై వారిలో కొంతమంది వారిమీద పద్యాలు, గీతాలు, గేయాలు అల్లనారంభించారు. వారి ఉత్కృష్టమైన ఆధ్యాత్మిక వ్యక్తిత్వం, సుందరమైన గౌరవర్ణం, వాళ్ల రచనలకు ప్రాణప్రదమైన విషయమైంది.

చైతన్యుల మీద బెంగాలీలో పదాలు రచించే ప్రథమ పంక్తిరచయితల్లో శ్రీఖండానికి చెందిన నరహరి సర్కారు ఒకడు. నరహరి సర్కారు రాసిన ఓ పదం నుంచి మనం చైతన్యుల జీవిత చరిత్రలు ప్రారంభం కాక మునుపే ఆయనపై పద రచన సాగివున్నట్లు మనం నిర్ధారింప వచ్చును, నరహరి ఆ పదంలో ఈ విధంగా

రాశాడు" గౌరాంగుని లీలలు జూచి నేను, వానినన్నింటిని భాష (వంగభాష)లో వర్ణించాలనుకుంటాను. నేను చాలా అల్పప్రాణిని.నాకు అక్షరాలు కూడ సరిగ్గా రావు. అటువంటి వాడిని నేను ఆయనను గురించి ఏంరాస్తాను, ఏం రాయగలను? నిజానికి అట్లా రాయగల సమర్థుడైన రచయిత ఇంకా ఇంత వరకు ఎవడూ జన్మించనే లేదు. పుస్తకం దేశ భాషలో రాస్తే అందరూ అర్థం చేసికొని ఆనందిస్తారు. గౌరకృష్ణుని (చైతన్యులు) లీలలు శిలలను కూడ ద్రవింప జేస్తాయి. అట్టి లీలలను ఎవడుకడముట్ట వర్ణింపగలడు? ... నేను నా అల్ప మతికి తగినట్లు కొన్ని పదాలు మాత్రం రాస్తున్నాను. వీటిని చూసి మరి ఎవరైన ప్రభులీలలు చక్కగా వర్ణింపగలరు ...."

పై పదంలో నరహరి చైతన్యుని విషయమై దేశ భాషలో రాయవలసిన ఆవశ్యకత గురించి ముచ్చటించాడు. ఆయన ఉద్దేశంలో దేశభాష అంటే వంగ భాష అని. ఈ సందర్భంలో మనం, నవ ద్వీపంలోని చైతన్యుల శిష్యులు అప్పటికే మురారి గుప్తను సంస్కృతంలో చైతన్యుని లీలలను రాయవలసినందిగా అనుమతించి వుండిన మాట మనం స్మరించవలసిన వుంటుంది. కాని ఎంత వాడైనప్పటికి, గురుదేవుల ఆధ్యాత్మిక వ్యక్తిత్వాన్ని వర్ణించడమనేది అసంభవమైన విషయం. నరహరి ఈ విధంగా చెప్పాడు. "అటువంటి సమగ్రమైన గ్రంథం రాసేవాడు జన్మించలేదు" అని ఘంటాపథంగా ఉద్ఘోషించాడు. ఆయన ఇంకా ఈ విధంగా వితర్కించాడు. "అట్టి రచన మాతృభాషలో వుంటే జనమంతా చదువుకోగలుగుతారు."

చైతన్యుల ఇతర సమకాలికులలో కవి ప్రతిభగలవారు నవద్వీపంలోని వంశీ వాదనుడు, మురారి గుప్త కాంచనపల్లికి చెందిన శివానందసేను, ఆయన పుత్రుడు, పరమానందుని విక్రర్ణపూరుడు, కట్వా దగ్గిర కోలయీ గ్రామానికి చెందిన ముగ్గురు సోదరులు,వాసుదేవ ఘోషు, గోవింద ఘోషు, మాధవ ఘోషు అనే వారు, కులీన గ్రామానికి చెందిన రామానంద వసువు ముఖ్యంగా చెప్పదగ్గవారు. వీరంతా చైతన్యుని జీవితం మీద ఆధారపడడమేగాక తాము కళ్లతో చూసిన విషయాల్ని పద రూపంగా రచించి ప్రసిద్ధులైనారు.

భగవాను గౌరాంగునిపై గీత రచన చేసిన వారిలో తొమ్మండుగురుపదకర్తలను అందరికంటె ప్రధానులుగా భావించేవారు. వారు వర్ణించిన విషయాలు చైతన్యుల

విషయంలో ప్రామాణికంగా భావింపబడ్డాయి.

ఈ తొమ్మండుగురేగాక గీత రచన చేసిన వాళ్ళు ఇంకా ఎందరో వున్నారు. వీరి పదాలు 'పదకల్పతరు' 'గౌరపద తరంగిణి' అనే శీర్షికలతో రెండు బృహత్సంకలన గ్రంథాలుగా సంగ్రహింపబడినాయి. చైతన్యుల సమాకాలికులైన ఈ పద కర్తల పేర్లు : అనంతా చార్యులు, అనంతదాసు, ఉద్ధవదాసు, కంద ఠాకురు, గోపాల భట్టు, ధనంజయపండితుడు, నవనీత మిశ్ర, పరమానంద గుప్త, పరమేశ్వర దాసు, పురుషోత్తమ దాసు, బలరామదాసు, బృందావన దాసు, యదు, యదు నాథ చక్రవర్తి, యదునాథుడు, రఘునాథదాసు, రామానందరాయి, శంకర ఘోషు, సులోచనుడు,హరిదాస ద్విజుడు అనేవారు.

నరహరి సర్కారు, ఇతరులు రచించిన పదాలలో గీతాత్మక సౌందర్యమేగాక, ఐతిహాసిక మహత్త్వం కూడా నిండి వున్నది. నరహరి సర్కారు అందరికంటె ముందుగా గురువుగారిపై గీత రచన చేసినవాడు. ఈవిషయం, మరో సమకాలిక కవియైన వాసుదేవ ఘోషు వెల్లడించాడు. నరహరి చైతన్యులకంటె వయస్సులో కొంచెం పెద్దవాడు. తన గాన మాధుర్యంవల్ల, సేవా భావం వల్ల గురువులకు ప్రీతి పాత్రుడై, సన్నిహితుడైనాడు.

ఈ సందర్భంలో మనం మరోమాట కూడా స్మరించాలి.

నరహరి, గౌరనాగరీ సిద్ధాంతాన్ని ప్రచారం చేసిన వాడని -

సర్కారు వలెనే, శివానందసేను, వాసుదేవఘోషు, మొదలైన ఇతర సమకాలిక కవులు కూడా చైతన్యుల గురించి స్తోత్రరూపంగా ఎన్ని మధుర పదరచనలు చేశారు. వారి అభిప్రాయానుసారం చైతన్యులు సాక్షాత్తుశరీరధారియైన ద్వితీయ కృష్ణుడే.

వాసుదేవ ఘోషు కూడ, చైతన్యులకు, ఆయన గయనుండి తిరిగి నవద్వీపానికి వచ్చిన తర్వాత, ముఖ్య సహకర్ములలో ఒకడుగా మారాడు. వసు గోవిందుడు, మాధవుడు ముగ్గురు సోదరులు, అప్పటికి నవద్వీపం వచ్చి చేరుకున్నారు. గురుదేవుల దివ్య జీవితాన్ని గురించి పేద రచన చేయసాగారు. ముగ్గురులో వసు, సర్వోత్తమ పదకర్త. ఆయన మిగతా ఇద్దరి కంటె పరిమాణంలో కూడా ఎక్కువగా రచించాడు. తర్వాతి కాలంలో ముగ్గురు సోదరులూ, అప్పుడప్పుడూ చైతన్యులను కలుసుకోడానికిగా 'పూరి' క్షేత్రానికి వెళ్తు వుండే వాళ్ళు.

సంస్కృతంలో, చైతన్య చరితామృతం, శ్రీ చైతన్య చంద్రోదయం(నాటకం) ఆనంద బృందావన చంపువు మొదలైన గ్రంథాలనురచించిన పరమానందసేను (కవికర్ణపూరుడు)చైతన్యుల గురించి వంగ భాషలో కూడా, గీతరచన కావించాడు. 'గౌరపద తరంగిణి' అనే సంగ్రహ గ్రంథంలో ఆయన రచించిన పది పదాలు సంకలితాలయినాయి. ఈ పదాలను చక్కగా పరిశీలిస్తూ పఠిస్తే ఈ రచయితలందరికీ చైతన్యుల యెడ గలుగు గౌరవ భావం సువ్యక్తమవుతుంది.

తర్వాతి కాలంలో మధ్య యుగం నాటి వంగ సాహిత్యంలో ఎందరో ఇతర పదకర్తలు వెలిశారు. వీరిలో కొందరు గోవిందదాసు, జ్ఞానదాసు వంటి ప్రతిభా సంపన్నులు కూడా వున్నారు. వైష్ణవ పదకర్తలు వెలయించిన సాహిత్యంద్వారా వంగ సాహిత్యం ఎంతో పుష్టిని, తుష్టినీ, చేకూర్చుకున్నది. కాగా సాహిత్యవేత్తలు ఈ యుగాన్ని వంగ సాహిత్య చరిత్రలో గౌరవ(గౌరాంగుని) యుగంగా భావిస్తారు. ఉత్కృష్టమైన గీతాత్మక గుణం వల్ల, వైష్ణవ పదాలను మధ్యయుగం వంగ సాహిత్యంలో ఆణిముత్యాలుగా భావిస్తారు.

చైతన్య జీవిత చరిత్రల వల్ల ప్రభావితులై ఇతర కవులు, వంగ భాషలో జీవిత చరిత్రలు రాయడం మొదలుపెట్టారు.

తర్వాతి కాలంలో వంగ భాషలో చైతన్యుల గురించి లెక్కలేనన్ని జీవితచరిత్రలు రచించబడ్డాయి. వాటి మూలంగా సంస్కృతంలో రచింపబడిన జీవితచరిత్రలు తెలుచాటుగా వెళ్ళాయని మనం చెప్పవచ్చు. వంగభాషలో రచితమైన చైతన్యజీవిత చరిత్రలు, మధ్యయుగ భాషా సాహిత్యానికి వెలచేకూర్చే కావ్యకృతులుగా, సాహితీమూల్యం కలవిగా భావింపబడతాయి.

ప్రారంభంలోనే, మనం, బెంగాలీ భాషలోని ఈ జీవిత చరిత్రలన్నీ కావ్యరూపంలోనే రచింపబడినాయనే విషయం గుర్తుంచుకోవాలి. మధ్యయుగంలో కవితారూపమే సాహిత్యానికి ప్రధానమైన ప్రక్రియ. కృష్ణ దాసకవి రాజు రచించిన 'చైతన్యచరితామృతం' వంగభాషలోని జీవిత చరిత్ర కావ్యాలలోనేగాక, వంగ సాహిత్యంలోనే ఒకానొక శ్రేష్ఠకావ్యంగా పరిగణింపబడుతుంది. కృష్ణదాసుని ఈ కృతిని గురించి చెప్పడానికి పూర్వం, మనం బృందవన దాసు రచించిన జీవిత చరిత్ర గురించి ముచ్చటించుకోవాలి.

బృందావన దాసు రచించిన 'చైతన్య భాగవతం' వంగభాషలో గురుదేవులపై

వ్రాయబడిన తొలి రచన. బృందావన దాసు చైతన్యులు నిర్యాణం పొందిన పదిహేను సంవత్సరాలలోపలనే ఈ జీవిత చరిత్రను పూర్తిచేశాడని విద్వాంసులభిప్రాయ పడుతున్నారు.

గురుదేవుల జీవితంలోని మొదటి భాగానికి సంబంధించినంతవరకూ, చైతన్య భాగవతం ఎక్కువ మహత్త్వపూర్ణమైంది. బృందావన దాసు నిత్యానందుని ఆజ్ఞానుసారం రచించాడు.

పుస్తకానికి కవిపెట్టిన మొదటి పేరు 'చైతన్యమంగల్' అని. అయితే బృందావనం లోని గోస్వాముల కోరిక మేరకు 'చైతన్య భాగవతం' గా పేరు మార్చబడింది. వ్రాతప్రతిని బృందావనం లోని గోస్వాముల అభిప్రాయార్థం పంపించడం జరిగింది. గోస్వాములు ఈ రచనకెంతో సంతోషించారు, తమ ఆమోదాన్ని ప్రకటించారు. అయితే చైతన్యుని బాల్యంలోనూ, శ్రీకృష్ణుని బాల్యంలోనూ, ఎంతో సామ్యముండడంవల్ల, 'చైతన్య మంగల్' అనే పేరు మార్చి 'చైతన్య భాగవతం' అని పేరుపెట్టమని సలహా ఇచ్చారు. బృందావన దాసు రచనపై శ్రీమద్భాగవతం యొక్క ప్రభావముద్ర పడిందని తజ్ఞుల అభిప్రాయం.

వంగభూమిలోని చైతన్య మతానుయాయులు, 'చైతన్య భాగవతాన్ని' అన్నింటికంటె ఎక్కువగా సమాదరిస్తారు. బృందావ దాసు చైతన్యులతో పాటు, నిత్యానందుల ధార్మిక జీవితాన్ని కూడా సరళ సుందరమైన భాషాశైలిలో, చిత్తాకర్షకంగా అభివర్ణించాడు. ఆయన చైతన్యుల వెంట తనకుగల ఆస్థ వల్లనే ప్రేరేపింపబడి నిత్యస్మరణీయమైన ఈ కృతిని నిర్మించాడు.

బృందావన దాసు ఎన్నడూ స్వయంగా గురుదేవులను చూసినట్లులేదు. కాని ఆయన పుట్టుక, పెరుగుదల, అంతా చైతన్యమతంతో నిండివున్న వాతావరణంలో జరిగింది. ఆయన శ్రీవాసుని ఒక సోదరుని పుత్రియైన నారాయణికి జన్మించాడు. [చైతన్యులకు శ్రీవాసు చిక్కని అనుయాయుల్లో ఒకడనీ, ఆయన ఇంట్లోనే చైతన్యులు, తమ ధార్మికాందోళనం తొలి రోజుల్లో తమ శిష్యమండలిని కలుసుకుంటూ వుండేవారనీ లోగడనే మనం గమనించాం] శ్రీవాసుని ప్రాంగణం గురుదేవుల నవద్వీపలీలతో ఇతిహాసిక మహిమ గడించుకొన్నది గదూ.

బృందావన దాసు తన తల్లి నారాయణి నాలుగు సంవత్సరాల వయస్సులో వున్నప్పుడే, చైతన్యుల ఉచ్ఛిష్టాన్ని పరిగ్రహించినట్లు వ్రాశాడు. చైతన్యులు

బృందావన దాసుని తల్లి యెడల వాత్సల్య భావాన్ని ప్రదర్శించేవాడని చెబుతారు. నారాయణి నిత్యానందునికి శిష్యురాలు. నిత్యానందు, నారాయణి పినతండ్రి శ్రీవాసుని ఇంట్లో కొంతకాలమున్నాడు.

తన తల్లివలెనే, బృందావన దాసు కూడ నిత్యానందునికి శిష్యుడు. ఆయన నిత్యానందునికి విశ్వాసపాత్రమైన శిష్యుడు. ఆయన ఆదేశానుసారం, చైతన్య జీవిత చరిత్రను బృందావన దాసు రచించాడు. గురుదేవుల జీవిత ఘట్టాలను వర్ణించడంలో బృందావన దాసు ఎక్కువగా నిత్యానందుడు చెప్పిన దానిమీదనే ఆధారపడ్డాడు. నిత్యానందుడే వలసిన విషయ సామాగ్రి ఆయన కిచ్చాడు.

చైతన్య భాగవతంలో అనేకాలైన అతిమానుష వివరణలున్నాయి. అయినా చైతన్యుని ఆరంభజీవనాన్ని, సమకాలిక ఘట్టాలను తెలుసు కోవడానికి, ఈ పుస్తకానికి గూడ చారిత్రక మహత్త్వం తజ్ఞులిస్తారు.

బర్ద్వాన్ జిల్లాలోని దేనూర్ అనే గ్రామంలో వుంటూ బృందావన దాసు ఈ గ్రంథాన్ని రచించినట్లు చెబుతారు. అక్కడ ఆయన 'శ్రీపదం' వున్నది.

బాల్యం నుంచే బృందావన దాసు, నిత్యానందునికి పరిచితుడు. 'చైతన్య భాగవతం' వంటి బృహద్గ్రంథ రచనకు ముందు, బృందావన దాసు పర్యాప్తమైన విద్వత్తును సంపాదించుకున్నాడు. ఆయన శ్రీమద్భాగవతాన్ని ఆమూలాగ్రంగా పారాయణంచేశాడు. దానినినుండి ఎన్నో సాహితీ మర్మాల్ని సంగ్రహించాడు. ఆయన పురాణాలనుండి, మహాభారతం నుండి, ఇతర సంస్కృత గ్రంథాలనుండి కూడ ఉదాహరణ లిచ్చాడు.

బృందావన దాసు విద్వాంసుడు మాత్రమే కాడు, సంగీతంలో కూడ దిట్ట. ఆయన తాను రచించిన పాటలకు తానే స్వరపఱచి, రాగ నిర్దేశం చేశాడు. చైతన్య భాగవతాన్ని పరిశీలించినా, మనకి సత్యం గోచరిస్తుంది.

బృందావన దాసు తన కావ్యానికి నిత్యానందుడే గాక, చైతన్యుల మరియొక ముఖ్య శిష్యుడు గదా ధరపండితుని దగ్గరనుండి కూడ సామాగ్రి సేకరించాడు.

చైతన్య భాగవతం మూడు ఖండాల్లో వుంది. మొదటి ఖండంలో చైతన్యులు గయవెళ్లడం దాకా వర్ణింపబడింది. ద్వితీయ ఖండం సన్న్యాస గ్రహణంతో సమాప్తమవుతుంది. చివరి ఖండంలో గురుదేవుల శేషజీవితం గూర్చి రాయబడింది.

ఈ పుస్తకంలో బృందావన దాసుని కావ్య ప్రతిభ ఎంత ఉన్నతమైనదో మనకు

తెలుస్తుంది. కవి ప్రతిభా మండితంగా చైతన్యుల ఆధ్యాత్మిక జీవిత మీ కావ్యంలో వర్ణింపబడింది. ఆయన చైతన్యుల ప్రభావంతో వికసించిన ఆధ్యాత్మిక వాతావరణంలో మిగుల ప్రామాణికంగా ఈ గ్రంధాన్ని తీర్చిదిద్దాడు. ఆయన వర్ణించే తీరు సరళమైంది, అయితే చిత్రాత్మకమైన సజీవంగా వుంటుంది. ఆయన తన పుస్తకంలో కవిగా, కావ్యశైలిలో, చైతన్యుని దైవభక్తిని వర్ణించిన విధానానికి ముగ్ధులై చైతన్య శిష్యులంతా ఆయనకు, నివాళులు పట్టారు.

మొత్తంమీద చైతన్యభాగవతం, పదహారవ శతాబ్దంలోని వంగీయ ధార్మిక, సామాజిక సాంస్కృతిక జీవితాలకు సంబంధించిన చారిత్రక సామాగ్రిని అందిచ్చే మహాకృతిగా, ఆకర గ్రంధంగా పేరుపడ్డది. బృందావన దాసు ఈ జీవిత చరిత్ర కావ్యాన్ని క్రీ.శ. 1584 దరిదాపుల రచించాడు.

చైతన్య భాగవతం తర్వాత కాలక్రమానుసారం, జయానందుడు రాసిన 'చైతన్య మంగల్' కావ్యాన్ని మనం పేర్కొనాలి. చైతన్యుని నిర్యాణం గూర్చి వ్రాసిన సందర్భంలో మనం ఈ కృతిని గూర్చి చెప్పుకున్నాం.

జయానందు చైతన్యుల జీవిత చరిత్రను క్రీ.శ. 1560 లో రచించాడు. బెంగాల్‌లోని రూఢీ వాదులైన వైష్ణవులలో ఈ గ్రంధానికి మాన్యత ప్రాప్తింపలేదు. జయానందుని ఈ పుస్తకానికి గౌరవం లభింపక పోవడానికి రెండు కారణాలు మన మూహించుకోవచ్చు. 1. పుస్తకం వ్రాయడంలో రచయిత సాధారణమైన వైష్ణవ మర్యాదలను పాటించకపోవడం 2. గోస్వామి షట్కం ప్రతిపాదించిన సిద్ధాంతాలను అనుసరించి, చైతన్యుల ధార్మిక విచారాలను వివేచింపక పోవడం. అంతేగాక, చైతన్యుల లీలావర్ణనలో చారిత్రక క్రమ బద్ధత కూడా ఏమీలేదు. గురుదేవుల జీవితంలోని సర్వసమ్మతాలైన అనేక తథ్యాలను, తద్విపరీతంగా వర్ణించడం.

ఈ కారణాలన్నింటి మూలాన జయానందుని 'చైతన్య మంగల్' కృతిని ప్రామాణికంగా స్వీకరించడానికి వీలుపడదు. కాని ఈ పుస్తకంలో, ఇతర గ్రంధాలలో లేని ఎన్నో ఇతర తథ్యాలెన్నో మనకు లభిస్తాయి. ఇందువల్లనూ, పదహారవ శతాబ్దిలోని వంగీయులు సామాజిక రాజనైతిక పరిస్థితులకు ఒక ఆకర గ్రంధంగాను, జయానందుని ఈ కృతి కొంతవరకు ఉపయోగపడుతుంది. దీని రచయిత జయానందుడు బర్ద్వాన్ జిల్లాలోని అమయీపూర్ గ్రామనివాసి. చైతన్యులొకసారి ఆయన తండ్రి సుబుద్ధి మిశ్రునికి అతిథిగా వుండివున్నాడు. ఎప్పుడంటే

'గురుదేవులు బృందావన యాత్రకై వెడలి గౌడదేశం నుంచి తిరిగి వెళ్లేటప్పుడు – చైతన్యులు సుబుద్ధి మిశ్రుల ఇంట అతిథిగా వున్నప్పుడు, జయానందుని తల్లి రోహిణీదేవి గురుదేవుల కొరకై వంటచేసింది. అప్పట్లో జయానందుడు పసిబాలుడు. జయానందుని తండ్రి సుబుద్ధి మిశ్రులు చైతన్యుల విశ్వసనీయుడైన అనుయాయి గదాధరునికి శిష్యుడు. బహుశా, జయానందుడు కూడా గధాధరునికి శిష్యుడై వుండవచ్చు.

జయానందుని 'చైతన్య మంగల్' తర్వాత వంగభాషలో రచితమైన గురుదేవుల మరొక జీవితచరిత్ర, లోచనదాసు రచించిన 'చైతన్య మంగల్' అనే పుస్తకమే.

లోచనదాసు బర్ద్వాను జిల్లాకు చెందిన ఒకానొక గ్రామంలో వుంటూ వుండేవాడు. ఆయన తల్లిదండ్రులు కమలాకర్‌దాసు, సదానంది అనేవారు. ఆయన తన మేనమామయైన పురుషోత్తమదాసు వద్ద విద్యాధ్యయనం చేశాడు. లోచనదాసు ప్రసిద్ధ పదకర్త. చైతన్యుల అనుయాయి, శ్రీఖండ నివాసియైన నరహరి సర్కారుకు శిష్యుడు.

ఆయన చక్కని విద్వాంసుడు. సంస్కృత భాషపై చక్కని అధికారం సంపాదించుకొని శాస్త్రాధ్యయనం కూడా చేశాడు. ఆయన పైనిపేర్కొన్న తన పుస్తకంలో ఎన్నో ఉద్ధరణలు సంస్కృత గ్రంథాలనుండి ఇచ్చాడు. లోచనదాసు 'చైతన్యమంగల్' కృతిని నిర్మాణంలో మురారి గుప్తద్వారా సంస్కృతంలో రచించబడ్డ గ్రంధాన్ని పలుతావులలో అనుసరించాడు. అయితే ఆయన ప్రతిభాప్రాబల్యం వల్ల, ఆయన కృతికి ఒక నూత్నశోభ వచ్చింది.

రచయిత వంగభాషలో ఎన్నో పదాలు రచించినవాడు. ఆయన 'జీవిత చరిత్ర' లో కూడా ఎంతో గేయాత్మకతత్వం నిండి వున్నది. సాధారణంగా గాయకులు ఈ కృతిని పాడివినిపిస్తూవుంటారు. ఇందువల్ల కూడా, దానిలోని సంగీతగుణం యొక్క ఉత్కృష్టత బుజువవుతుంది.

కాని చైతన్యుల 'జీవితచరిత్ర' కు సంబంధించి లోచనదాసు కృతిలో ఒక్క విషయాన్ని మినహాయిస్తే, మరేకొత్త తథ్యము మనకు లభింపదు.

డా॥ విమాన బిహారి మజుందార్ అభిప్రాయానుసారం లోచనదాసు ఈ పుస్తకాన్ని క్రీ.శ. 1560–1566 ల మధ్య రచించాడు. 'చైతన్యమంగల్' నాలుగు భాగాల్లో విభక్తమైంది. మొత్తంమీద లోచనదాసు కృతి చారిత్రక తథ్యాలకంటె, కావ్యాత్మక

గుణాలు కలిగి వున్నదని భావించడం లెస్స.

మనమిక్కడే మరోవిషయం గమనించాలి. స్వరూప దామోదరుడు, పంచతత్త్వవాద నిర్మాత. ఆయన చైతన్యులు, నిత్యానందుడు, అద్వైతాచార్యుడు గదాధరుడు, శ్రీవాసు వీరిని మతంలోని అయిదు తత్వాలకు ప్రతినిధులుగా నిరూపించాడు. లోచనదాసుని మతం ప్రకారం పంచతత్త్వ సిద్ధాంతం, ఆయనకు అంగీకార్యమే. ఆయన గురువు నరహరి సర్కారు. అంచేత కొంచెం మార్పుచేశాడు. లోచనదాసు పంచతత్త్వ స్వరూపులలో ఒకడైన శ్రీవాసునికి మారుగా తన గురువు నరహరి సర్కారును ఆయన స్థానంలో ప్రతిష్ఠించాడు. ఈ విషయం ఆయన వ్రాసిన 'చైతన్య మంగల్' లోని సూత్రఖండంలో స్పష్టమవుతుంది. లోచనదాసు, తన గురువు నరహరి సర్కారు ప్రతిపాదించిన 'గౌరనాగరీ' సిద్ధాంతాన్ని కూడా జనంలో ప్రచారం చేయాలనుకొనేవాడు. ఈ అన్నింటి వల్ల, వంగసాహిత్యంలో చైతన్య మతానికి చెందిన 'చైతన్య మంగల్' కు ఓ విశేష స్థానముంది.

బెంగాలీలో చైతన్యుల మరోజీవిత చరిత్రగా మిగుల విఖ్యాతి నార్జించుకొన్న కావ్యగ్రంధం కృష్ణదాసు కవిరాజు రచించిన 'శ్రీ చైతన్య చరితామృత' మనే సుప్రసిద్ధ గ్రంధం. ఇది భక్తిపరమూ, చారిత్రకమూ అయిన గొప్పకృతి. ఇది మహాకావ్య ధోరణిలో విపులంగా, సర్వాంగ సుందరంగా వ్రాయబడిన మహనీయమైన గ్రంధం. ఈ కృతి విశేషము, చైతన్యుల జీవితంలోని చివరి బాగాన్ని, బృందావన దాసు రచించిన 'చైతన్య భాగవతంల' లో లేనిదాన్ని పూరించడం. ఈ విధంగా శేష పూరణం దీని విశిష్టత.

భక్తుడూ, విద్వాంసుడూ అయిన కృష్ణదాస కవిరాజు, ఈ విశాల జీవితచరిత్ర కావ్యం నిర్మించడంలో బృందావనంలోని గోస్వాముల నుండి చక్కని దీప్తి స్ఫూర్తులను పొందాడు. రచయిత తాను రఘునాధ గోస్వామిక శిష్యపరమాణువుగా జీవితం గడుపుతూ వుండేవాడు.

కృష్ణదాసు కవిరాజు, ఈ గ్రంధ నిర్మాణానికి తన చరమ వయస్సులో పూనుకొన్నాడు. ఏడు సంవత్సరాల నిరంతర కృషి ఫలితంగా దీనిని పూర్తిచేసి కృతకృత్యుడైనాడు. ఈ కృతి కృష్ణదాసు కావ్య ప్రతిభకే ఆయన తదేకదీక్షకు, అధ్యవసాయానికి దర్పణప్రాయమైనట్టింది.

రచయితను, బృందావనశాఖకు చెందిన గౌడీయ మతానుయాయిగా లోకులు

భావించేవారు. ఆయన కావ్యం 'చైతన్య చరితామృతం' కేవలం చైతన్యుల జీవితాన్నేగాక, బెంగాలులోని వైష్ణవ మత దర్శనాన్ని చక్కగా నిరూపించు వైదుష్య పూర్ణమైన మహాగ్రంధం. ఇది గాఢేయ వైష్ణవ శాఖకు చెందిన ప్రామాణిక గ్రంధంగా భావింపబడుతోంది. గౌడీయ వైష్ణవ మత దర్శనాన్ని గురించి అనేక గ్రంథాలు సంస్కృతంలో వ్రాయబడి వున్నాయి. అయితే ప్రచలితమైన దేశ భాషలో ఆ దర్శనాన్ని చక్కగా నిరూపించే ఏకైక ప్రామాణిక గ్రంథంగా కృష్ణదాసుని ఈ కృతి ప్రశస్తి గడించుకున్నది. ప్రతిభాసంపన్నమైన ఈ కృతిలో, కావ్యాత్మక శక్తి, కవి విదగ్ధత రెండు సమ్యక్సమన్వయం పొందాయి.

కృష్ణదాస కవిరాజు ఎన్నో సంస్కృత గ్రంథాలు కూడా రచించాడు. కాని ఆయన దేశ భాషలో వ్రాసిన 'చైతన్య చరితామృతమే' ఆయన్ని అజరామరునిగా చేసింది. వంగ సాహిత్యంలోని శ్రేష్ఠకృతులలో ఇది ఒకటి. చైతన్యుల పాత్ర పోషణ, చరిత్రచిత్రణం, ఒక విశిష్టమైన రీతిలో దీనిలో చేయబడ్డాయి. చైతన్యుల జీవితంలోని ఆంతరికమైన అధ్యాత్మిక తత్వాన్ని గురించి దీనిలో ఎక్కువగా చెప్పబడింది. ఆయన జీవితంలోని బాహ్య సంఘటనలకంటె – ఇందువల్ల కవియొక్క ప్రతిభా వైశిష్ట్యం మనకు గోచరిస్తుంది. సుకుమారములైన భావాలను వ్యక్తీకరించడంలో ఆయన చూపిన కౌశలం, భాషపై ఆయనకు గల అధికారం, ఇంతటి బృహత్కావ్యంలో శైథిల్యం రాకుండా, కావ్యగుణాలను సమరసంగా నిర్వహింపగలగడం – ఈ సమస్తగుణాలు రచయిత యొక్క అద్వితీయమైన సాహిత్య విదగ్ధతను ఋజువుపరుస్తాయి.

"చైతన్య చరితామృతం' ఓ గురుదేవుల జీవితాన్ని అభివ్యక్తం చేయడమేగాక వైష్ణవ మతానికి సంబంధించిన దార్శనిక తత్వంకూడ సంపూర్ణంగా చెప్పబడింది. రచయిత బృందావన గోస్వాముల చరణకమల సన్నిధానంలో వుంటూ వైష్ణమత దర్శనాన్ని చక్కగా అభ్యసించాడు. ఆయన గోస్వాముల కంతేవాసి. అందులోనూ ముఖ్యంగా రఘునాధ దాస గోస్వామికి – ఈ విధంగా మధ్యయుగాన వంగ సాహిత్యానికి చెందిన ఈ మహాకృత ద్వారా గాడేయ వైష్ణవ ప్రదర్శనాన్ని ఆయన ప్రచారం గావించాడు. ఆయన ప్రతిపాదించిన దార్శనిక సిద్ధాంతాలన్నీ ఆయన తన గురువుల ముఖతః నేర్చుకున్నదే అని వేరే చెప్పనక్కరలేదు. పడమరకు వ్రాలిపోయిన వయసులో వ్రాసిన ఈ గ్రంధం పరిసమాప్తి చెందేనాటికి గోస్వామి

షట్కంలో ఎవరూ సజీవులుగా వుండివుండరని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఈయన గ్రంథంలోని కావ్యవస్తువు, మిగిలిన ప్రాసంగిక విశేషాలను గురించి చెప్పుకోడానికి ముందుగా కవిరాజా జీవిత విశేషాలు సంక్షేపంగానైనా తెలుసుకోవడం వాంఛనీయం.

రచయిత యొక్క వ్యక్తిగత జీవితంగురించి, చాలా తక్కువ తథ్యాలు మనకు తెలుస్తున్నాయి. అందులకు కారణం వైష్ణవ సమ్మతమైన వినయప్రవృత్తే. ఆయన తనను గురించి చెప్పుకొన్నది చాలా తక్కువ. ఆయన చాలా గంభీరుడైన విద్వాంసుడు. తోడ్తో అత్యంత వినయశీలి. 'వైష్ణవ వినయం' అనే నానుడి కూడ ఆయన మూలంగానే వాడుకలోకి వచ్చిందని చెబుతారు. ఆయన తనను గురించి ఇలా చెప్పుకున్నాడు. "నేను జగాయి, మగాయిల కంటె కూడా చాలా పాపిని. నా పేరు స్మరించడం కూడా పాపమే" అని.

ఆయన జీవితానికి సంబంధించి, ఉపలబ్ధమైన అల్పసామాగ్రి మూలంగా, కృష్ణదాసు బర్ద్వాను జిల్లాలోని కట్వాకు సమీపంగా వున్న ఝామట్ పూర్ అనే గ్రామంలో జన్మించాడని తెలుస్తుంది. ఆయన తండ్రి భగీరధుడు, తల్లి సునంద, శైశవంలోనే కృష్ణదాసు తల్లి దండ్రులు స్వర్గస్థులైనారు. ఆయన అసలుపేరు బహుశః కృష్ణదాసు కాకపోవచ్చు. తర్వాతకాలంలో, దీక్షాగ్రహణ సమయలో ఆయనకి పేరు గురువులు పెట్టి వుంటారు. పడుచుదనంలోనే ఆయన ఇల్లూవాకిలీ వదిలిపెట్టి సన్యాసం గ్రహించాలనుకొన్నాడు. ఆయన ఆ విషయం విశదంగా ప్రథమ ఖండంలో వ్రాశాడు. నిత్యానందుడు ఆయనను బృందావనం వెళ్లమని పురిగొల్పాడుట.

ఆ పిమ్మట, కృష్ణదాసు భక్తుడుగా శిక్షార్థిగా జీవితం గడపనారంభించాడు. బృందావనంలో ఆయనకు అదృష్టవశాత్తు, విద్వాంసులైన గోస్వామిషట్కం సాహచర్యంలో నివసించే అవకాశం లభించింది. వారి శిక్షణవలన తాను కొంతకాలానికి మహా విద్వాంసుడుగా రూపొందాడు. 'చైతన్య చరితామృతం' ప్రథమఖండంలో కృష్ణదాసు బృందావనంలోని గోస్వాములను తన శిక్షాగురువులుగా స్వీకరించినట్లు వ్రాశాడు. తన పుస్తకంలో ప్రతి అధ్యాయం చివర రచయిత, రూపగోస్వామిని, రఘునాధదాస గోస్వామిని తప్పకుండా నుతించాడు. రఘునాధదాసే ఆయనకు సన్యాస దీక్ష ఇచ్చాడు.

కృష్ణదాసు సంస్కృతంలో పరిణతమైన ప్రతిజ్ఞకలవాడు. ఆయన గ్రంథంవల్ల ఆయన గోస్వామిషట్కం రచించిన కృతుల నన్నింటితోనూ చక్కని పరిచయం గలవాడనే సంగతి విశదమవుతుంది. తన గురువులైన బృందావన గోస్వాములచే ప్రతిపాదింపబడిన రస సిద్ధాంతాన్ని అనుసరించే ఆయన చైతన్యుల జీవితాన్ని వర్ణించాడు. ఆయన ప్రథమ ఖండంలో, బృందావన గోస్వాముల ప్రేరణవల్లనే తానీ గ్రంథాన్ని రచిస్తున్నట్లు ప్రకటించాడు.

ఆయన గోవిందలీలామృతం' 'సారంగరంగద' వంటి సంస్కృత కావ్యాలను గూడా రచించాడు. ఆయన జన్మతిధిగాని, మృత్యుతిధిగాని, 'చైతన్య చరితామృతం' రచనాతిధిని గురించి గాని మనకేమి తెలియరాదు. డా॥ విమాన బిహారీ మజుందారు తమ పరిశోధనా వ్యాసంలో కృష్ణదాసు కవిరాజు జన్మతిధిగా క్రీ.శ. 1527 ని నిర్ధారించాడు. ఆయన అభిప్రాయానుసారం, కృష్ణదాసు క్రీ.శ. 1557 ప్రాంతంలో బృందావన నివాసం కోసరం వెళ్లివుంటాడు. చైతన్య చరితామృతం క్రీ.శ. 1612, క్రీ.శ. 1615 మధ్య పరిసమాప్తి చెందివుంటుంది. (డా. యస్.కే.జే మతానుసారం కృష్ణదాసు క్రీ.శ. 1530 లగాయతు క్రీ.శ 1616 వరకు జీవించివుంటాడు.)

డా. మజుందారు, బృందావనం వెళ్లడానికి పూర్వం, కృష్ణదాస కవిరాజు బెంగాలీ వైష్ణవుల రచనలన్నింటిని చదివివుంటాడని అభిప్రాయపడ్డాడు. ఎందుకంటే, మురారిగుప్త రచించిన సంస్కృతకృతి 'కదచ' కవి కర్ణపూరుని 'చైతన్య చంద్రోదయ' కృతి, ఆయన రచించిన శ్రీ చైతన్య చరితామృతం, ఇవన్నీ క్రీ.శ.1557 కు పూర్వమే వెలసిన కృతులు. ఈ ప్రాంతంలోనే కృష్ణదాసు బృందావన ప్రవాసార్థం వెళ్లాడు. అచ్చటకు చేరిన తర్వాత ఆయన రూపసనాతన తదితర గోస్వాముల సాన్నిధ్య భాగ్యాన్ని పొందాడు.

అటుపిమ్మట మూడు సంవత్సరాల తర్వాత 2500 శ్లోకాలకు పైబడిన 'గోవిందలీలామృతం' అనే సంస్కృత మహా కావ్యాన్ని రచించాడు. ఇది పరిమాణంలోనూ, గుణంలోనూ కూడా అద్వితీయమైన రచన. దీనికిదేసాటి. రఘునాథదాసు తాను రచించిన 'ముక్తా చరిత్ర' లోని అంతిమ శ్లోకంలో కృష్ణదాస కవి రాజును 'కవి భూపతి' గా భూషించాడు. డా॥ మజుందారు అభిప్రాయానుసారం, కృష్ణదాసునకు 'గోవిందలీలమృత' కావ్యం పైననే కవిరాజు బిరుదం లభించింది.

కృష్ణదాస కవిరాజ రచితమైన రెండవ సంస్కృత కృతి 'సారంగరంగద' లీలా

శుకరచితమైన 'శ్రీకృష్ణకర్ణామృతం' పై ఆయన వ్రాసిన టీకాగ్రంథం.

ఆయన చివరి కృతి వంగ భాషలో వ్రాసిన 'చైతన్య చరితామృతం'. ఇది ఆయన తన సుదీర్ఘమైన వైరాగ్యజీవితం చివరి క్లాంతదశలో రచించింది. ఆయన బృందావనంలోని వైష్ణవస్వాముల కోరిక మేరకే గ్రంథం రచించాడు. దీన్ని పూర్తి చేయడంలో ఏడు సంవత్సరాలు పట్టింది.

కృష్ణదాస కవిరాజు ఈ కృతి నిర్మాణం పూర్తి చేసేటప్పటికి ఆయనను 86 సంవత్సరాల వయస్సు వుంటుంది. ఆ తర్వాత కొద్దికాలానికే ఆయన కాలధర్మం పొందాడు.

చైతన్యజీవిత చరిత్రలోని సామాగ్రి చాలా భాగం కృష్ణదాసు, మురారిగుప్త, స్వరూప దామోదరుడు, కవి కర్ణపూరుడు, బృందావన దాసు వీళ్ల గ్రంథాలనుంచి సేకరించాడు. బృందావనంలోని అగ్రవంక్తికి చెందిన గోస్వాముల నుండి వ్యక్తిగత సంస్మరణలు ఆయన సంగ్రహించాడు, ఈ సందర్భంలో, ఆయన ముఖ్యంగా, పూరీలో గురుదేవులతోబాటు 16 ఏండ్లపాటు అవిచ్ఛిన్నంగా వుంటూ వచ్చిన రఘునాధ గోస్వామిపై ఎక్కువ ఆధారపడ్డాడు. ఇందువల్ల చైతన్యుల జీవితంలోని చరమ భాగానికి సంబంధించిన 'చైతన్య చరితామృతం' లోని చివరిభాగం మిగుల ప్రామాణికంగా విద్వజ్జనం భావిస్తుంది.

కృష్ణదాసుని కృతి మూడు ఖండాలు. ఆదిలీల, మధ్యలీల, అంతిమ లీల అని. ఇందులో 62 అధ్యాయాల్లో గురుజీవితానికి సంబంధించిన మూడు పక్షాలు పరిసమాప్తినందాయి. మొదటి భాగం చైతన్యుల సన్యాసానికి పూర్వం నడిచిన జీవిత చరిత్రకు సంబంధించింది. రెండోభాగంలో, గురుదేవులు ఆరు సంవత్సరాలపాటు సాగించిన తీర్థయాత్రా వివరణం. మూడోభాగంలో, పూరీలో వారు గడిపిన చివరి 18 సంవత్సరాల జీవిత వృత్తం ఇవ్వబడింది. రచయిత ఇందులో చైతన్యుల ఉత్తరకాల జీవితాన్ని చక్కగా వర్ణించాడు.

చైతన్య మతం, ఆదోళనం, వీనిని అవగాహన చేసుకోవాలంటే, ఈ పుస్తకం అపరిహార్యంగా చదివితీరాలి. కృష్ణదాస కవిరాజు చైతన్యుల జీవిత చరిత్రతోపాటు, గౌడీయ వైష్ణవ మతదర్శనం, దాని తాత్త్విక చర్చకూడ ఇందులో చూపించాడు. బృందావనంలోని గోస్వాములు ఈ విషయాలపై సంస్కృతంలో వ్రాసిన మాట నిజమే, కాని వంగీయ వైష్ణవులలో ఈ సిద్ధాంతాలను ప్రచారం చేయడానికి ఈ

గ్రంథమెంతో తోడ్పడింది. అందుచేత ఈ గ్రంథానికి ఎనలేని ప్రాశస్త్యం చేకూర్చింది.

కృష్ణదాసుని పుస్తకం తర్వాత అనేకులు ఇతర జీవన చరిత్రలు – ముఖ్యంగా చైతన్యులపై వంగభాషలో రచించారు. కాని అవి అంత విలువైనవికావు. అందువల్ల వాటినిగురించి ఇక్కడ ప్రస్తావించడంలేదు.

వంగసాహిత్య క్షేత్రంలో చైతన్యమత ప్రభావ ఫలితంగా మరో సాహిత్య ప్రక్రియ కూడ వికసించింది. అదే గీతరచన లేక పదసృష్టి – చైతన్యుల సమకాలికులు మొదట చైతన్యుల గురించి పదగానం చేశారు. నరహరి సర్కారు మిగిలిన ఎనమండుగురు కవులూ, చైతన్యులను వర్ణిస్తూ శ్రుతిమధురాలైన పదరచన గావించారు. మరి తొమ్మండుగురు గీతకారుల గురించి, లోగడనే చెప్పాం.

చైతన్య ప్రేరితమై రచింపబడ్డ పదసాహిత్యానికి ఇది తొలితరంగం. గౌడీయ వైష్ణవ మతంమీద ఆధారపడి, కళాత్మకములైన వంగగీతరచన పదరచన వాస్తవానికి మరికొంతకాలం గడిచిన పిదప సృజనాత్మకమైన యుగ విశేషంగా ఏర్పడింది. బెంగాలులో తర్వాతికాలంలో వైష్ణవ పదావళులు కావ్యాత్మక ధోరణిలో విపులంగా వ్రాయబడినాయి. వంగ సాహిత్యం చైతన్య మతానుయాయుల ద్వారా రచింపబడ్డ పద సాహిత్యానికి కారణంగా రూపొందింది. వంగ సాహిత్యంలోని కొందరు మహాకవులు చైతన్యమతానుయాయులైన పదకర్తలే.

చైతన్యులు ఉదయించిన దానికి ఫలితంగా వికసించి, పుష్కలంగా రచితమైన పదావళి సాహిత్యం వంగసాహిత్య చరిత్రలోనే గౌరవయుగంగా మనం భావింపవచ్చు. ఈ యుగంలోని సమస్త సాహిత్య సృష్టికి, చైతన్యమతం అద్వితీయ ప్రేరణ స్రోతస్సుగా నిలిచింది. ఉపాసన, భక్తి దైవచితనం, వీనిని రూపొందింప చేయడానికే పదావళి సాహిత్యం ఏర్పడింది.

గోవిందదాసు, జ్ఞానదాసు, నరోత్తమదాసు, బలరామదాసు, ఘనశ్యామదాసు వీరి రచనలను పదసాహిత్యంలో మణిపూసలుగా మనం భావింపవచ్చును. వీళ్లంతా చైతన్యోత్తర యుగానికి చెందినవాళ్లే. అనేకులు చండీదాసుని పదాలను ఉత్తమ వైష్ణవ పదాలుగా భావిస్తారు. కాని చండీదాసు విషయంలో విద్వజ్జనంలో అభిప్రాయభేదమెంతో వుంది. ఏకవాక్యతలేదు. చండీదాసు పేరుతో ఎందరో కవులున్నట్లు పండితులు అభిప్రాయపడుతున్నారు. వీరిలో ఒకడు మాత్రం,

చైతన్యులు వెలయుటకు ముందే 'శ్రీకృష్ణకీర్తన' మనే పద గ్రంధాన్ని రచించాడు. ఒకరో, ఇద్దరో లేక ముగ్గురో, చైతన్యుల తర్వాత వెలసిన చండీదాసులు. ఇక్కడ మనమీ వివాదంలో తలదూర్చ నక్కరలేదు.

చైతన్యుల తర్వాత సుమారు మూడువందల ఏభై సంవత్సరాల కాలపరిమితిలో ఎందరో పదకర్తలు, ఎన్నో వైష్ణవ పదావళులను సృజించి వంగ సాహిత్యానికి పుష్టినీ, తుష్టినీ చేకూర్చారు. చైతన్య మతానుయాయులు కూడ ఎంతో సాహిత్యాన్ని నిర్మించారు. వీరి సంఖ్యకూడ అపరిమితమే. పదావళి రచన ఎంత విశాలమో మనకు ఒక్క 'గౌరవపద తరంగిణి' అనే సంగ్రహ గ్రంథంలో సంకలితాలైన పదిహేనువందల సంఖ్యనుమించిన పదాలను బట్టి అర్థమవుతుంది. ఈ సంఖ్య కేవలం ఎంపిక చేసి కూర్చిన పదాల సంఖ్య మొత్తం పదాల సంఖ్య కాదు.

వంగ సాహిత్యంలో యైతన్య మతోన్ముఖమైన మూడువందల యాభై ఏండ్లకాలాన్ని మనం రెండు తరంగాలుగా విభజింపవచ్చును. మొదటి ఉత్థానకాలం (తరంగం) పదునారవ శతాబ్ది ఆరంభంనుండి 17వ శతాబ్దం ఆఖరువరకు. రెండవ ఉత్థానం (తరంగం) 17వ శతాబ్దం నుండి 19వ శతాబ్దం మధ్యవరకు.

మొదటి తరంగంలో కాంతిమంతమైన ఉజ్జ్వలమైన వైష్ణవ పదరచన సాగింది. వివాదాస్పదులైన చండీదాసుని ప్రక్కకునెట్టితే, ఈ యుగంలో అందరికంటె పేరెన్నికగన్న పదకర్త గోవిందదాసే అని మనం చెప్పవచ్చు. ఆయన బృందావనంలో ఆ సమయంలో మౌళిభూతుడైన జీవగోస్వామికి సమకాలికుడు. 1. గౌడీయ వైష్ణవుల కాచార్య పురుషుడైన జీవగోస్వామికి గోవిందదాసు రచించిన పదాలు వినడమంటే చెవులు కోసుకొనేవాడు. అయనకెంతో ప్రీతి. ఆయన గోవింద దాసునికి ఎన్నో ప్రశస్తిపత్రాలు వ్రాసి అభినందించాడు. ఇందులో కొన్ని పత్రాలు భక్తి రత్నాకరంలో సంకలింపబడినాయి. భక్తిరత్నాకరం, ప్రేమవిలాసం, కర్ణానందం మొదలైన పుస్తకాలు గోవిందదాసుని, సఫల పదకర్తగా ఉవ్వెత్తుగా ఎత్తి చూపుతాయి.

పదావళీ సాహిత్య రచన యొక్క రెండ ఉత్థానం (తరంగం) పదిహేడవ శతాబ్దం చివరినుండి 19వ శతాబ్దం మధ్యదాకా వుంది. ఈ ఉత్థానంలోని పదరచన గుణం దృష్టితో చూసినప్పుడు మొదటి తరంగంలోని రచనలంత ఉత్కృష్టంగా లేవు. ఈ కాలంలోని వైష్ణవ కావ్యరచనలలో కృష్ణకమల గోస్వామి రచించిన, 'దివ్యోన్మాదం'

సర్వోత్తమైనది అని చెప్పవలసి వుంటుంది.

ఈ విధంగా చైతన్యమతం మొత్తం మూడువందల యాభై సంవత్సరాలపాటు మొత్తం పదసాహిత్య రచనకు అద్వితీయ ప్రేరణ స్రోతస్సుగా పనిచేసింది. వైష్ణవ జీవన చరిత్రలు, పదాలు వీని పరిమాణం బట్టి, చైతన్యమత ప్రభావం ఈ సాహిత్య ప్రక్రియలపై ఎంతగా పనిచేసిందో మనం సహజంగానే ఊహించుకోవచ్చు. అందువలన వంగసాహిత్యం ఎంత సమృద్ధమైందీ మనకు తెలుస్తుంది.

మహామహోపాధ్యాయ హరిప్రసాధ శాస్త్రి వైష్ణవ పదావళి సాహిత్యం యొక్క విస్తృతిని గమనించి సరిగానే ఇలా చెప్పాడు. "పద కీర్తనల సంఖ్యను బట్టి ఆకాలంలోని ప్రతి వైష్ణవుడు, పదరచనకు పూనుకొన్నామనీ, సమయం పెట్టిన ఒఱవడిలో నిగ్గుదేలిన పదాలే మనకు మిగిలినాయని స్పష్టమవుతుంది."

సుప్రసిద్ధమైన ఈ విద్వాంసుని పై అభిప్రాయాన్ని బట్టి, చైతన్యమతం తన అనుయాయులలో ఎటువంటి సృజనశక్తిని పురిగొల్పిందీ మనం ఊహించుకోవచ్చు. గౌడీయ వైష్ణవ పదావళి సాహిత్యం గురించిన ప్రసంగం సమాప్తి గావించేముందు మహామహోపాధ్యాయులు చెప్పిన మరోవిషయం కూడా మనం స్మరించవలసి వుటుంది.

ఇంతమంది పదకర్తలకు చైతన్యుని ఆధ్యాత్మిక వ్యక్తిత్వం జీవప్రేరణగా స్రోతస్సుగా పనిచేసింది. కాని గురుదేవులు స్వయంగా ఒక్క పదమైన రచించి వుండలేదని పలువురు విద్వాంసుల అభిప్రాయం. కానీ పండిత హరిప్రసాదశాస్త్రి అభిప్రాయం ఈ సందర్భంలో ఇందుకు బిన్నంగా వుంది.

"చైతన్యులు స్వయం పదకర్తలుగా భావింపబడుతున్నారు. 'ఏరే జగాయీామఘూ ఈ ఏహంనామే మతబీ జదిఏ' ఈ సుందరపదం రచించింది వారేనని చెబుతారు. భక్తి భావంలోని లోతును, భావాలలోని ఔన్నత్యం, వ్యాపకత, రెండింటినీ అందుకోవడం, ఒక గొప్ప సంస్కారికి అసంభవాలైన విషయాలుగాని, అయోగ్యాలైన విషయాలు గాని కావు."

చైతన్యులకు సంస్కృతంలోని 'శిక్షాష్టక' కర్తృత్వ గౌరవం ఆపాదింపబడుతూ వుంటుంది. దానిని ఈ క్రింద ఇస్తున్నాం. దాని తెలుగు అనువాదం కూడా ఇస్తున్నాం.

చేతోదర్పణ మార్జనం భవ మహాదావాగ్ని నిర్వాపణం

శ్రేయః కైరవ చంద్రికాతరణం విద్యావభూజీవనం
ఆనందాంబుధివర్ధనం ప్రతిపదం పూర్ణామృతాస్వాదనం
సర్వాత్మ స్నపనం పరం విజయతే శ్రీకృష్ణ సంకీర్తనం ।। 1 ।।
నామ్నామకారీ బహుధా నిజసర్వశక్తిః
తత్రార్పితా నియమితః స్మరణే న కాలః
ఏతాదృశీ తవకృపా భవనం మమాపి
దుర్దైవ మీదృశ మిహాజనీ నానానురాగాః ।। 2 ।।
తృణాదపి సునీచేన తరోరివ సహిష్ణునా
అమానినా మానదేన కీర్తనీయస్సదాహరిః ।। 3 ।।
నధనం నజనం నసుందరీం
కవితా వా జగదీశకామ యే?
మమజన్మని జన్మనీశ్వరే
భవతాద్భక్తి రహేతుకే త్వయి ।। 4 ।।
అయి నందతనుజ కింకరం
పతితం మాం విషమే భవాంబుధే
కృపయా తవ పదపంకజ
స్థితధూళి సదృశః విచింతయ ।। 5 ।।
నయనం గళదశ్రు ధారయా
వదనం గద్గద రుద్ధయా గిరా
పులకై ర్నిచితం వపుఃకదా
తవ నామగ్రహణే భవిష్యతి ।। 6 ।।
యుగాయితం నిమేషేణ చక్షుషా ప్రావృషాయితమ్
శూన్యాయితం జగత్సర్వం గోవిందవిరహేణమే ।। 7 ।।
ఆశ్లిష్య వాపాదరతాంపినష్టుమా
మదర్శనాన్మర్మ హతాం కరోతువా ?
యథాతథా వా విదధాతు లంపటో
మత్ప్రాణ నాధస్తుత ఏవనాపరః ।। 8 ।।
"శ్రీకృష్ణ సంకీర్తనం వల్ల చేతోదర్పణము మాలిన్యం లేకుండా శుభ్రపడుతుంది.

ప్రపంచ మహాదావాగ్ని చల్లారుతుంది. మనుష్య జీవితం శ్రేయస్సు సంపాదించుకుంటుంది. ఇందువలన మనస్సులో భక్తి దర్శనం భక్తి భావన జాగృతాలవుతాయి. ఇది కాంతా సమ్మితమైన శిక్షనిస్తుంది. ఇందువలన ఆనందసాగరం ఉప్పొంగుతుంది. దీనియందలి ప్రతిచరణమూ, పూర్ణామృతాస్వాదం మనకు కలగజేస్తుంది. (అనగా సర్వభావనలు జాగృతాలై అనుభూతికి వస్తాయి). దీనివల్ల సర్వేంద్రియాలు తుష్టిని సంపాదించుకుంటాయి. । 1 ।

ఈశ్వరుడు నిజ నామాన్ని అనేక విధాలుగా అభివ్యక్తం చేశాడు. తన సర్వశక్తులను ఆ నామానికే ప్రదత్తం చేశాడు. ఆయనను స్మరించడానికి ఒక ప్రత్యేకమైన సమయమంటూలేదు. హే భగవన్! నీవింతటి దయాళుడవు కాని నా దురదృష్టం వల్ల నాకు నీ నామ స్మరణపై అనురాగమే ఏర్పడలేదు! ఎంతటి మంద భాగ్యుడను । 2 ।

తృణంవలె వినయినై, నతశిరస్కుడవై, వృక్షంవలె సహిష్ణుడవు కమ్ము. నీ అభిమానాన్ని దూరంగాపెట్టి ఇతరులను సమ్మానించడం నేర్చుకో, ఎల్లవేళల హరినామ సంకీర్తనం చేస్తూ వుండు । 3 ।

జగదీశా! నా కోరిక ధనంమీద లేదు, పరిజనం మీదాలేదు; అందెగత్తెమీద అంతకుముందేలేదు. కవితా కౌశలంమీదనూ లేదు. నాది ఒక్కటే కోరిక. ఓ యీశ్వరా! జన్మజన్మలకు నీయందు నిర్వ్యాజమైన భక్తి నాలో కలుగనిమ్ము. । 4 ।

ఓ నందనందనా! నీ యీ సేవకుడు విషమ సంసార సాగరంలో పడి ఊపిరాడక కొట్టుమిట్టాడుతున్నాడు. దయచేసి, నన్ను నీ చరణకమల రేణువుగా తలపోయు మంతెచాలు. । 5 ।

ఓయి భగవంతా! నీ నామకీర్తన మాత్రంచేతనే నేత్రాల్లోనుంచి కన్నీటిధార స్రవించే దెపుడయ్యా! వాణిభావ విహ్వలతలో రుద్ధమైపోయేదీ, శరీరమంతా పులకితమై పోయేదీ మరి ఎప్పుడో! । 6 ।

"గోవింద విరహంలో నాకు నిముషం యుగంగా వుంది, నేత్రాలు అజస్రం వర్షించే మేఘాలుగా వున్నాయి. ప్రపంచమంతా శూన్యంగా కనబడుతోంది" । 7 ।

"కృష్ణుడు నన్ను దాసురాలిని పాదాలతో తాడించుగాక, లేక నన్ను పరిష్వజించుగాక, దర్శనభాగ్యం కలగజేయకుండా మర్మాహతంచేయుగాక, నన్నువీడి ఇటునటు వ్యభిచరించుగాక, ఏమైననేమి అతనే నా ప్రాణనాథుడు, నా సర్వస్వమతడే మరొకడు కానేరడు । 8 ।

# VI

# చైతన్య మతమూ – కీర్తన సంగీతమూ

బెంగాలులోని దేశీ సంగీతం మధ్యయుగంలో అంతా, గౌడీయ వైష్ణవశాఖకు పెనవైచికొని నడిచింది. వంగభూమిలోని కీర్తన సంగీతం, సాంస్కృతిక క్షేత్రంలో ఒక అద్వితీయమైన ఉపహారం. అది చైతన్యుల ద్వారా ప్రతిపాదితమైన వైష్ణవభక్తి పద్ధతిలోని భావాత్మకమైన ఉపాసనతో సంబద్ధమై వుంది. కాని ఒక విషయం మనం మరచిపోరాదు. చైతన్యోదయానికి పూర్వమే బెంగాలులోని సంగీత పద్ధతి వైష్ణవశాఖతో ఒక ఆకర్షకమైన విధంగా జతపడే వుంది. ఈ రెండూ పరస్పర అవిభాజ్యాలుగా వుండిపోయినాయి.

బెంగాలులోని రాధాకృష్ణోపాసన, చైతన్యులకు పూర్వం సుమారు మూడువందల సంవత్సరాలకు ముందే, సుప్రసిద్ధకవి, పదకర్త, సంగీత మర్మజ్ఞుడూ అయిన జయదేవుని ద్వారా ప్రచారమొనర్పబడి లోకప్రీతి సంపాదించుకోగల్గింది. ఈ విధంగా వైష్ణవమతం, బెంగాలులోని సంగీత సంప్రదాయం, ఈ రెంటి సంబంధమూ పంద్రెడో శతాబ్దం చివరిపాదంలో సుదృఢంగా ఏర్పడింది. దీనికి ఆధారస్తంభం జయదేవుని అమరకృతి 'గీతగోవిందం! చైతన్య పూర్వయుగమందు, జయదేవుని చే రచింపబడ్డ శృంగారభక్తి పదాలే, వైష్ణవమతానికి సర్వప్రధమంగా ఉపలబ్ధాలైన రసనిధులు. జయదేవుడు, ఉత్తరభారత దేశమందలి చివరి హిందూనరేశుడైన, లక్ష్మణసేనుని ఆస్థానకవిగా వర్ధిల్లాడు. ఈ లక్ష్మణసేను సంగీత ప్రేమికుడూ, విష్ణుపూజాధురంధరుడూ అయిన బెంగాలు నరేశుడు.

వంగభూమిలో భక్తి, రాధాకృష్ణోపాసన, ఈ రెండూ సమన్వితాలై జయదేవుని సంస్కృత పదావళిలో, కోమలకాంత శైలిలో అభివ్యక్తమైనాయి. 'గీతగోవిందం' పదాలలో ప్రతిష్ఠితమై, కీర్తన పూజలలోని మాధుర్యం భగవదైశ్వర్య సంపత్తి, రెండూ సువ్యక్తమైనాయి.

జయదేవుని ఈ భక్తి పదాలవైపు స్వయం చైతన్యులు కూడా ఆకర్షింపబడినారు. వారు గీతగోవిందాన్ని ఎంతగానో మెచ్చుకొనేవారు. ఆ పదాలను ఆకర్షించడమందే,

వారికి ఆహ్లాదంగా వుండేది. వారు జయదేవుని కృతులవైపు ముగ్ధులగుటేగాక, ఇవి నవద్వీపంలోని యువక సన్న్యాసులచే ప్రారంభింపబడ్డ వైష్ణవ మతశాఖలకు ప్రేరణ స్రోతస్సులుగా కూడ పనిచేసేవి. జయదేవుని పదాలు మానవీయ భావనలను వ్యక్తపరిచే విధానంలో రాయబడినా, వానిలో అంతర్నిహితమై, ఈశ్వరానుభూతికి వీలైన తీవ్రభక్తి భావనకూడ వుండేది. ఈ విధంగా, జయదేవకృతగీతాలు, చైతన్యులు ప్రవర్తింపజేసిన వైష్ణవమతంలోని ఉపాసనా రీతులపై ప్రభావముద్రవేసి రాధాకృష్ణోపాసనా మార్గాన్ని ప్రశస్తంచేశాయి.

జయదేవుని తర్వాత బెంగాలులో వైష్ణవమతం యొక్క సామూహిక సంగీత పరంపరలు వెలకొనసాగాయి. జయదేవుని సంగీత శ్రవణమైన కావ్య ప్రతిభమూలంగా, బెంగాలులో రాధాకృష్ణుల ఉపాసన మిగుల లోకప్రీతిని సంపాదించుకుంది. దాని ఫలితంగా, బెంగాలులోని వైష్ణవ మతానికి చెందిన, తర్వాతి కాలంలోని పదకర్తల కల్పనా జగత్తులో రాధాకృష్ణ పరమైన భక్తి భావనయే దృఢపడిపోయింది. ఇదేవారి సృజన వ్యాపారంలో సర్వాంతర్యామిగా వ్యాప్తమైపోయింది.

జయదేవుని తర్వాత వైష్ణవమతానికి సంబంధించిన అత్యధిక లోకప్రియమైన సంగీతాత్మక రచన చండీదాసుని 'శ్రీకృష్ణకీర్తన! ఇది చైతన్యులకు ఒక శతాబ్ది పూర్వం రచింపబడింది. బెంగాలీ లోని చండీదాసుని 'శ్రీకృష్ణకీర్తన' జయదేవుని 'గీతగోవి ంద' రచనను చైతన్యుల కాలం, తర్వాత కాలంలోని గీత రచనలను మేళవించే ఒకానొక మహత్తరమైన శృంఖలగా మనం గ్రహించాలి.

వారు చండీనామ రచితమైన 'శ్రీకృష్ణకీర్తన' కు పరివర్తనకాలంలోని కీర్తన గాయకులకు నడిమి కాలంలో చైతన్యులుదయించారు.

నవవైష్ణవ మత ప్రచారకులు, 16వ శతాబ్దం ప్రథమ పాదంలో సంకీర్తన పద్ధతిని ప్రారంభించిన గౌరవం చైతన్యులకే దక్కుతుందంటారు. [గీతగోవిందం సంస్కృతంలో రచింపబడింది. శ్రీకృష్ణ కీర్తన వంగభాషలో రచింపబడింది.]

వాదు చండీదాసు మైథిలి కోకిల విద్యావతికి సమకాలికుడు. విద్యాపతి పదావళిని కూడ వంగభూమి తనదిగానే స్వీకరించింది.] చైతన్యుని ద్వారా ప్రచారం కావించబడిన సంకీర్తన పద్ధతి సరళమూ, సమ్మోహనమూ అయి జన సాధారణంలో కృష్ణభక్తి సందేశాన్ని వ్యాపింపజేయడానికెంతో దోహదమిచ్చింది.

నామ సంకీర్తనం, చైతన్యమతానికి, ధార్మికాందోళనానికి, అవిభాజ్యమైన ఉపాసనా భాగంగా ధ్రువపడిపోయింది.

మొదటి కొన్ని అధ్యాయాల్లో చైతన్యుల ఆధిపత్యం క్రింద నడిచిన వారి శిష్యమండలుల సామూహిక మూభావ విన్యాలమూ అయిన కీర్తన గానపద్ధతికి సంబంధించిన ఎన్నో ఘటనల గూర్చి చెప్పుకున్నాం. పురీ రథయాత్రా సమారోహం, జన్మాష్టమి ఉత్సవం మొదలైన సందర్భాలలో ఊరేగే శోభా యాత్రలలో కీర్తన గానం చేస్తూ వెడలే కీర్తన మండలులు, భజన బృందాలు, వంగదేశంలో చైతన్యమతానికి అంగభూతాలయినాయి. చైతన్యులు తామే తమ నవద్వీప లీలావేళలో కీర్తనల బృందంగానానికి కీర్తనల శోభాయాత్రలకు శ్రీకారం చుట్టారు.

కీర్తన సంగీతం చైతన్య ప్రతిపాదితమైన ధర్మానికి అంగభూతమై అవిభాజ్యమై, అభిన్నమై పెంపొందింది. ఈ విధంగా భక్తి పూర్ణమైన ఈ గానపద్ధతి చైతన్య మతవాహినిగా పరిణమించింది.

చైతన్యులకు పూర్వంకూడా ఏదో రకంగా కీర్తనలు జరుగుతూనే వుండేవి. కాని చైతన్యాగమనం తర్వాతనే ఈ గాన పద్ధతి లోక ప్రియతను, జనరంజక శక్తిని సంపాదించుకున్నది.

చైతన్యులే ఒక విధంగా ఈ సంకీర్తన గాన పద్ధతికి మూలపురుషులుగా భావింపబడ్డారు. కీర్తనమూ, సంకీర్తనమూ, ఏకరూపంగానే భావింపబడేవి అనే సంగతి మనం ధ్యానమందుంచుకోవాలి.

ప్రతాపరుద్ర గజపతి మహారాజు ఓసారి 'పూరి'లో చైతన్యుల సంకీర్తన గానాన్ని విని ముగ్ధుడైనాడు. ఆయన రాజపండితుని ప్రశ్నించాడు. "ఇదేమి సంగీతం!" పండిత సార్వభౌముడు బదులు చెప్పాడు. "చైతన్యులే ఈ సంగీత రచన చేశారు" అని.

బృందావన దాసు కూడ తన 'చైతన్య భాగవతం' లో చైతన్యులే కీర్తన పద్ధతిని ఆరంభించినట్లు చెప్పాడు.

ఆయన తన గ్రంథంలో చైతన్యులు కీర్తనగానం చేసే సందర్భంలో ఏ విధంగా ఉన్మాదవస్థ పొందుతూ వుండేవారో వర్ణించాడు. "అప్పుడు ఆయన పాఠశాలలోని విద్యార్థులాయనతో అన్నారు. "'గురుదేవా! మేము కూడా మీతో పాటు కీర్తనగానం చేస్తాం. అయితే మాకా పద్ధతి రాదుగదా! మీరు దయచేసి, మాకు కూడా దానిని నేర్పండి" అని. అప్పుడు శచీపుత్రుడు (చైతన్యుడు) వారికి తానే ఆ పద్ధతిని నేర్పారు. "హరయేనః కృష్ణయాదవాయనమః గోపాలగోవింద, రామ శ్రీ మధుసూధన" గురుదేవులు తామే తాళంవేస్తూ శిష్యులకు గానవైఖరిని నేర్పారు. వారతో పాటు తామూ గానం చేశారు"

బృందావన దాసు చెప్పిన పై ఉదాంతాన్ని బట్టి చైతన్యులు కీర్తన గాన పద్ధతికి నిదర్శకులుగా వ్యవహరించారని మనం గ్రహింపవచ్చు. వారు కేవలం గానమే గాక వాళ్ళకు లయానుసరణ విధానం కూడా నేర్పగల సమర్థులు.

గురుదేవుల మూలంగా నవద్వీపంలోని జనసమూహం సంకీర్తన గానపద్ధతిపై మోహపడింది. వాళ్లకూడా దీనిని నేర్వనారంభించారు. చైతన్యమత చరిత్రలో శ్రీవాసుని గృహాంగణంలో చైతన్యులొనర్చిన కీర్తన గానానికి చారిత్రకో మహిమ కద్దు. అచ్చట అహర్నిశలు తమ సన్నిహిత శిష్యులతో కలిసిమెలిసి, సంకీర్తన గానంలో మునిగితేలుతూ వుండేవారు, దాని ఫలితంగా నవద్వీపంలో తొలిసారిగా, గౌడీయ వైష్ణవమతం యొక్క ప్రధమ కీర్తన భజన మండలి ఏర్పడింది.

కీర్తన గానంతోపాటు చైతన్యులు నృత్యంకూడా చేస్తూ వుండేవారు. వారు శ్రీవాసుని ప్రాంగణంలో, కీర్తనగానం చేస్తూ భావవిహ్వలత్వంతో మైమఱచి, నృత్యం కూడా చేస్తూవుండేవారు. చైతన్యుల జీవిత చరిత్రుల లెక్కలో నృత్యం, కీర్తన సంగీతం యొక్క అంగమే. ఉత్తమమైన ధార్మిక గానంగా కీర్తన సంగీతాన్ని చైతన్యులు ప్రతిష్ఠించడంతో, నృత్యంకూడా దానికంగ భూతమైంది.

చైతన్యులు తామొకరే కీర్తన గానం చేయడంగాక, తమ అనుయాయులు కూడా తమతోపాటు, కలిసిమెలిసి పాడాలని, ఉవ్విళ్లలూరేవారు. నవద్వీపంలో భక్తులు గురుదేవులను ప్రార్థించడానికి వచ్చినప్పుడు వారికందరికీ కృష్ణనామమంత్రోపదేశం చేసి "హరేకృష్ణ, హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే, హరేరామ హరేరామ రామరామ హరేహరే" అంటూ నామసంకీర్తనం చేయవలసిందిగా గురుదేవులు చెప్పినట్లు 'చైతన్య భాగవతం' లో బృందావన దాసు రాశాడు.

చైతన్యులు అరచేతిలో తాళంవేస్తూ "హరయేనమః కృష్ణయా దవాయ నమః, గోవింద గోపాల రామ శ్రీ మధుసూదన' అని గానం చేయమని చెప్పారు.

ఈ విధంగా ఇంటింటా కీర్తనలు, భజనలూ వెలిశాయి. ఊరూరా ప్రాకి పోయినాయి. కీర్తనలతోపాటు ప్రయోగించబడే తాళవాద్యాలు కూడా చైతన్యులే మొదటి సారిగా ప్రయోగించారని అంటారు., పఖావజ్ వంటి ప్రక్కవాద్యం ఖోల్కూడా వీరే వాడుకలోకి తెచ్చారుట. ఖోల్ మట్టితో చేస్తారు. పఖావజ్ కొయ్యలతో నిర్మింపబడుతుంది. ఇదే ఈ రెండింటికి తేడా. మంజీరా కూడా కీర్తన సందర్భంలో ప్రయోగింపబడేది. మంజీరా ఇత్తడితో చేయబడిన రెండు రేకుల సంపుటి. ఈ రెండు సులభమైన తాళవాద్యాలు కీర్తన సంగీతంతోబాటు

వాయించబడతాయి. ఇందువల్ల ఈ సంగీతం సాధారణ జనానికందుబాటులో వుండేది. సంగీతంతోబాటు ఈ విధంగా చైతన్యమతం జనసామాన్యాని కందుబాటులోకి వచ్చింది. కీర్తనల మాధ్యంగా సరళమూ, మనోమోహకమూ అయిన సంగీత పద్ధతి దూరదూరాల వుండే కుగ్రామాలకు కూడా పాకడానికి వీలయింది. సకల గ్రమీణ జనం మధ్యకూడా ఈ విధంగా చైతన్యమతం చోటు చేసికొన్నది.

చైతన్య లే విధంగా పూరీలో రథయాత్రా సందర్భంలో, తమ అనుయాయులతోబాటు, కీర్తన పార్టీలలో పాల్గొంటూ వుండేవారో, లోగడనే చెప్పబడింది. గురుదేవుల ఆధ్వర్యంలో జరిగే ఈ సామూహిక కీర్తనలు భక్తుల హృదయాల మీద రోమాంచకమూ, భావ భరితమూ, ఉపాసనా వాసితమూ అయిన ప్రభావముద్ర వేసేవి.

ఈ విధంగా చైతన్యులు కీర్తన సంగీతాన్ని జనప్రియం గావించారు. అదివారి మతానికే అవిభాజ్యమైన అంగమైంది. చైన్యుల ద్వారా ప్రవర్తితమైన ఈ సంకీర్తన ప్రక్రియ తర్వాత కొన్ని శతాబ్దుల వరకూ అవిచ్ఛిన్నంగా నడిచింది. చైతన్యమతంతోబాటు ఉత్తరోత్తరా, ఈ సంకీర్తన పద్ధతికూడా వికసింపసాగింది. కీర్తన సాహిత్యానికీ, చైతన్యమతానికీ మధ్యగల సంబంధాలలో మరికొన్ని విశేషాలున్నాయి.

గురుదేవుల జీవితకాలంలో నరహరి సర్కారు, మరి ఇతరులు, వారిపై పదరచన చేస్తున్నట్లు లోగడ ఓ అధ్యాయంలో చెప్పివున్నాం. వీటిలో ఎక్కువ భాగం కేవల కవిత్వమేగాక, స్వరపరచబడి గేయయోగ్యాలుగా చేయబడిన సాహితీ సామగ్రియే. వీటిని రచించిన వారు సంగీతజ్ఞులు కూడా. అందుచేత చైతన్యస్తుతివరాలైన ఈ రచనలను పాడుకుంటూ కూడా వుండేవారు. ఈ విధంగా మొదటి నుంచి కూడా చైతన్యవంతం సంగీత సంబంధంగలిగి, రెంటికీ అంగాంగే భావమేర్పడిపోయింది.

అటుపిమ్మట, ఎందరో పదకర్తలు రచించిన ఎన్నో పదాలు, కీర్తన సంగీతాని కుపయోగపడే రీతిగా సంగీతశైలిలోనే రచింపబడినాయి. వీటిలో కృష్ణుడుగాని, చైతన్యుడు గాని వర్ణ్య వస్తువు.

చైతన్యుల పిమ్మట, ఆయనచే ప్రచార భాగ్యం పొందిన గౌడీయ వైష్ణవ మతాదర్శాల ఫలితంగా వంగభూమిలో పదావళీ సంగీతం సఫలమై విజయ పరాకాష్ఠ నందుకున్నవి. వైష్ణవ పదకర్తల భక్తి సాహిత్య కృషి ఫలితంగా,

వంగీయదేశీసంగీత చరిత్రలో ఒక గౌరవమయ యుగమారంభమైంది. గౌడీయ వైష్ణవమతం వంగీయుల భావనాత్మక భక్తితో నిండి తొణికిసలాడి పోయినట్లే వైష్ణవ పదావళిలో కూడ, పదమాధుర్యంతో బాటు భావవిహ్వలతా నిర్భరాలై భక్తి పరిమళాలు చిమ్ముతూవుంటాయి. వంగీయ కీర్తన సాహిత్యం, సంగీత సంస్కృతికి వంగ వైష్ణవులు ప్రసాదించిన విలక్షణమైన కానుక.

చైతన్యుల నిర్యాణానంతరం అర్ధశతాబ్దికి తర్వాత పరిష్కృతమైన కీర్తన సంగీతపద్ధతి ప్రారంభమైంది. ఇది వంగభూమిలోని సంగీత ప్రపంచంలో వాటిల్లిన చారిత్రక సంఘటన. లోగడ చెప్పనే చెప్పినట్లు, చైతన్యులు నామసంకీర్తనం మొదటిగా ఆరంభించారు. అదిలోక ప్రియమైంది. తర్వాతికాలంలో చైతన్యమతంతోబాటు, చెట్టాపట్టాలుగా, వంగభూమిలో సమున్నతమైన సంకీర్తన పద్ధతి వికసించింది. ఈ సంగీతం, వైష్ణవ పదకర్తల పదావళి కీర్తన సంగీతంగా ప్రచారంపొంది పేరు సంపాదించుకున్నది.

ఉత్తర వంగప్రాంతంలో, రాజశాహి జిల్లాలోని పద్మానదీ తటస్థితమైన ఖేతజీలో ఏటేటా జరుగుతూవుంటే ఒక మహోత్సవం కీర్తన సంగీత చరిత్రలో మఱువరాని ఘట్టం. ఇక్కడ గౌడీయ వైష్ణవ మతానికి చెందిన బృందావన గోస్వామి షట్కం తర్వాత, ముగ్గురు ధార్మిక నాయకులలో ఒకడైన నరోత్తమ దాసు నిర్దేశానుసారం పదావళీ కీర్తన పద్ధతి ఆరంభింపబడింది. [మిగిలిన ఇద్దరు నాయకులు శ్రీనివాసాచార్యులు, శ్యామానందు అనేవారు]

ఖేతడీ ఉత్సవం, 16వ శతాబ్దం తొమ్మిదో దశకం మధ్యలో అంటే గురునిర్యాణానంతరం, షుమారు యాభై సంవత్సరాలకు జరిగింది. ఈ వైష్ణవ మహా సమ్మేళనంలో, చైతన్యుల పత్ని విష్ణుప్రియకూడా వుండివుంది.

చారిత్రక మహిమ గల ఈ వైష్ణవోత్సవంలో నరోత్తమ దాసఠాకురు భారతీయ సంగీతంలో శాస్త్రీయ ధ్రువపద రాగంలో విలంబిత ఖయాలు కొత్తపద్ధతి ప్రారంభించారు. నరోత్తముని నిర్దేశానుసారం నిరూపితమైన ధ్రువపద కీర్తన సంగీత పద్ధతి రెండు బాగాలు కలిగి వున్నది. అనిబద్ధము, నిబద్ధమూ అని. అనిబద్ధమనగా గీతంలోని పదాలు లేకుండా స్వర సంగీతం మాత్రమేవుండి, ఏతాళబద్ధము గాకుండా వుండడం. నిబద్ధమంటే శబ్దతాళాలపై ఆధారపడి 'ధున్' జతపడివుండడం.

పదావళీ కీర్తన నిరూపణంలో గోకులానందు, అనిబద్ధ భాగాన్ని పాడుతూవుండేవాడు. ఆయన ఆలాపం – ఉదారం, ముదారం, తార – అనే

మూడు గమకాలలో నడుస్తూవుండేది. ఆయన 'ధున్' విని శ్రోతలు ముగ్ధులై పోయేవారు. ఆలాపభాగం తర్వాత శ్రీఖండవాసియైన రఘునందన ఠాకూరు నరోత్తమ దాసు ఠాకూరుకు కంఠహారంగా మాల సమర్పించేవాడు. అప్పటినుంచి కీర్తన గాయకునకు మాలాధారణంచేసే ఆచారమేర్పడింది. నేటికీ దీన్ని పాటిస్తారు.

నరోత్తమ దాసు కీర్తనలోని నిబద్ధభాగాన్ని పాడేవాడు. ఇంతకు ముందే చెప్పినట్లు, నిబద్ధభాగం కావ్యపదంగా వుటుంది. పదాలను స్వరబద్ధం చేసేవారు. నరోత్తమ దాసు నిబద్ధ భాగాన్ని ఎంచక్కగానో పాడేవాడు. ఆయన కీర్తన సంగీతానికి ఒక స్థాయి నేర్పాటుచేసి కృతకృత్యుడైనాడు. తర్వాతి తరాలవారు ఆయన చూపిన మార్గంపైనే నడుస్తున్నారు.

కీర్తన సంగీతంలో ప్రక్కవాద్యాలు కేవలం ఖోల్, కరతాళం ఇవే వుంటాయి. తర్వాతి కాలంలో, ఈ రెండు వాద్యాలే ప్రయోగించబడుతూవుండేవి. నృత్యంకూడా ప్రయోగింపబడేది. ఖేతడీ ఉత్సవంలో శాస్త్రీయ కీర్తనంలో ప్రయోగింపబడే మరో విశేషముంది. అదిచాలా ప్రధానమైంది. 'గౌరవచంద్రిక' పేరుతో వ్యవహరింపబడే ఈ విశిష్ట ప్రయోగం గమనింపదగ్గది. ముఖ్యపదం పాడడానికి ముందు 'గౌరవచంద్రిక' పాడబడుతూవుంటుంది. 'గౌరవచంద్రిక' చైతన్యస్తుతి పరమైన పదం. అప్పటినుంచి, పారంపరిక కీర్తన పద్ధతిలో, కీర్తన ప్రారంభించడానికి పూర్వం 'గౌరవచంద్రిక' పాడే ఆచారం స్థిరపడిపోయింది. ముఖ్యపద వస్తువు రాధాకృష్ణ లీలాపరంగా వుంటుందని వేరే చెప్పవలసిన పనిలేదు. కీర్తన గానపద్ధతి చైతన్య మతానికి అంగభూతమై, గౌరవచంద్రిక పాడే ఆచారం నెలకొన్న తర్వాత చైతన్యులమీద ఎన్నో పదాలు రచింపబడినాయి.

చైతన్యులపై రచింపబడే గౌరవచంద్రికలు కీర్తన సమయంలో పాడబడేవి. గౌరవచంద్రికా గానం, కీర్తన గానానికి అనివార్యమైన అంగంగా నిలబడింది. కీర్తన గానం చేసే సమయంలో, చైతన్యుల ప్రేరణను పునరుజ్జీవింపజేయడానికి "గౌరచంద్రిక" మంత్రంవలె పనిచేస్తుంది.

సుప్రసిద్ధుడైన నరోత్తమదాస ఠాకూరు ఖేతడీ వైష్ణవ ఉత్సవంలో సంగీతంలో అనిబద్ధ నిబద్ధ భాగాలను గౌరచంద్రిక మొదలైన విశిష్ట రీతులను ప్రవేశపెట్టి, పదావళీ కీర్తన పద్ధతికి ఒక చక్కని రూపకల్పన గావించాడు.

నరోత్తమ దాసు ద్వారా 16వ శతాబ్దంలోని తొమ్మిదవ దశకం మధ్యదాకా సువ్యవస్థితం చేయబడిన కీర్తన పద్ధతి గరన హాటీశైలిగా ప్రసిద్ధి పొందింది. ఖేతడీని

బహుశా ఆకాలంలో గరన హాటి అని వ్యవహరిస్తూ వుండేవారనుకుంటా. అందుచేతనే ఆ శైలికా పేరువచ్చి వుంటుంది.

తర్వాతికాలంలో మనోహర శాహి (బర్ద్వాన్ జిల్లా), రానీహాటి (బర్ద్వాన్ జిల్లా) మందారన్ (మిదనాపూర్ జిల్లా) ఝూర్ ఖండా (జిల్లా మిడ్నపూర్) మొదలైన వాటినుంచి క్రమంగా మనోహర శాహి, రానేతీ, మందారినీ, ఝూర్‌ఖండీ శైలులు, స్థానీయ విశేషాలతో వికసింపబడ్డాయి. వీటి వీటి ప్రత్యేకత వీటికుంది.

రానేతీ మందారినీ శైలులు మనోహర షాహీ కంటె సరళమైనది. మనోహర షాహి కీర్తనం స్వరశిల్పం ప్రశంసనీయమైంది.

శ్రీనివాసాచార్యులు మనోహర షాహి, రానేతకీర్తన శైలుల ఉద్భావకుడుగా భావింపబడుతున్నాడు.

జ్ఞానదాసు, బలరామదాసు వంటి శ్రేష్ఠ సమర్థకుల నేతృత్వం క్రింద పదకర్తల ప్రభావంచేత మనోర షాహి శైలి అచిరకాలంలోనే సంగీతక్షేత్రంలో ఉన్నత స్థానాన్ని ఆక్రమించుకున్నది. వీరిద్దరూ పదావళికీర్తన పద్ధతిని ప్రారంభించిన నరోత్తమ దాసు సమకాలికులు.

ప్రసిద్ధ సంకీర్తన గాయకుడు వైష్ణవ దాసు (గోకులానందసేను), ఆయన సహయోగిమిత్రుడు ఉద్ధవదాసు (కృష్ణకాంతమజుందారు) ద్వారా రానేతి శైలి ప్రసిద్ధి సంపాదించుకున్నది.

కీర్తన పద్ధతిలోని ఐదు శైలులలో నుండి, ఝూర్ ఖండేశైలి కొద్ది కాలమే బ్రతకగలిగింది. తర్వాతి కాలంలో అది లుప్తమైపోయింది. గరనహాటి, మనోహరషాహి, రానేతీ, మందారినీ కీర్తన శైలుల కొన్ని విలక్షణ లక్షణాలున్నాయి. గరనహాటి శైలిని ధ్రుపద యొక్క సరలగాంభీర పద్ధతితో పోల్చవచ్చు. మనోహర షాహిశైలి స్వరవైవిధ్యం దృష్టితో ఉల్లేఖింపదగివుంది. కాని తర్వాతికాలంలో, ఈ విభాజక తత్వాలు ఈ శైలులనుండి లోపించిపోయినాయి.

పశ్చిమ బెంగాలులో ఇతర శైలులకంటె మనోహర షాహి శైలి ఎక్కువ ప్రచారంలో వుండివుంది.

బెంగాలులో, 16వ శతాబ్ది చివరి చరణంనుంచి ప్రారంభమై 18వ శతాబ్దం మధ్య భాగంవరకు, పదావళీ సంగీతానికి ఉచ్చకాలమని చెప్పవచ్చు. ఈకాలంలోనే చైతన్యమతం కూడా సమున్నతంగా, ప్రాణవత్త కలిగివుంది. ఇది సహజమే.

కీర్తనగానం గౌడీయ వైష్ణవ మతాందోళనలతో, అభిన్న రూపంగా పెనవేసికొనివుంది. ఇందుచే పందొమ్మిదో శతాబ్దంనుండి, పదావళీ కీర్తన సంప్రదాయంలో, అంతకుముందటి రెండున్నర శతాబ్దులతో పోల్చిచూసినప్పుడు, పతనదశ రానారంభించింది.

పదెనిమిదో శతాబ్దంలో కీర్తన పదాల రెండు బృహత్సంగ్రహగ్రంథాలు సంకలితాలయినాయి. మొదటి పాదంలో రాధామోహన ఠాకూరు తన విఖ్యాతమైన 'పదామృత సముద్ర' సంగ్రహం సిద్ధంచేశాడు. ఆ తర్వాత కొన్ని సంవత్సరాలకు వైష్ణవదాసు 'పదకల్పతరు' వనే సంకలన గ్రంథాన్ని కూర్చాడు. ఇది కూడా చాల విశాలమైన సంగ్రహగ్రంథమే. వీటిలో కీర్తన సంగీతంలో వాడుకలోకి వచ్చే అనేక పదాలు సంకలింపబడినాయి. కీర్తన సంగీతం యొక్క శోభాకరమైన ఉత్థానం (తరంగం) మరికొంత కాలంవరకు బాగానే వుంది. చిట్టచివరికి, చైతన్యమతం యొక్క ప్రాణశక్తి క్షీణింపసాగగానే పందొమ్మిదో శతాబ్దంలో కీర్తన ప్రభావం కూడా సమాప్తం ప్రాయమైంది.

చైతన్యమత ప్రగతితోబాటు వికసించిన గరనహాటి. మనోహర షాహి, రానేతి మొదలైన శైలుల కన్నింటికి ఆధేయమైంది కృష్ణచరిత్ర అని, రాధాకృష్ణతత్త్వమనీ, మనం జ్ఞాపకముంచుకోవాలి. పదావళీ కీర్తనలను రచించిన మహావైష్ణవ రచయితలందరూ కృష్ణుని దైవీపక్షం, తద్గతమైన భక్తి భావన, వీనినాధారం చేసుకొనే తమకావ్యాలను రూపించారు.

ఈ విధంగా చూస్తే, కవితా పక్షానికి సంబంధించిన కావ్యవస్తువు పదావళీ కీర్తనలో ఉపయోగింపబడ్డది, కృష్ణ విఫలమే అని స్పష్టం. మధురమైన, సంవేదన శీలయైన పరిష్కృతములైన పదావళులు, వాని సంగీత రచన, ప్రబంధనానికి సంబంధించిన ఒక శాస్త్రీయ ప్రక్రియ. దీనిలో ధాతు, తాళం, రాగం, భావం వీటి తత్త్వం ఇమిడివుంది. పదావళి కీర్తన సహజంగానే ఆధ్యాత్మకతత్త్వంతో కూడివున్నది. దీనిమూలంలో చైతన్యమతం ఆధారంగా వికసించిన రాధాకృష్ణుల ఉపాసనయందలి తీవ్రమైన భక్తిభావన పునాది రాయిగా నిలిచివుంది.

బెంగాలీ సాహిత్యంలోని అద్వితీయమైన కీర్తన సంగీతం, చైతన్యుల ద్వారా ప్రారంభింపబడిన కృష్ణభక్తి ఆందోళనా ఫలితం. వంగభూమిలోని సంగీత సంస్కృతి క్షేత్రంలో, చైతన్యుల ద్వారా ప్రవర్తితమైన గౌడీయ వైష్ణవమతం నిర్వహించిన చారిత్రక భూమిక యిది.

ఎంతో ప్రశంసనీయమైన భూమిక!

# గ్రంథ సూచిక

| | బెంగాలీ రచయిత | గ్రంథం ప్రకటన | సంవత్సరం క్రీ.శ. |
|---|---|---|---|
| 1. | బృందావన దాసు | చైతన్య భాగవత్ | 1886 |
| 2. | లోచనదాసు | చైతన్య | 1883 |
| 3. | కృష్ణదాసకవి రాజ్ | చైతన్య చరితామృత్ | 1878 |
| 4. | నరహరిచక్రవర్తి | నరోత్తమ విలాస్ - రాధారమణ ప్రెస్ ముర్షిదాబాద్ | 1925 |
| 5. | నరహరి చక్రవర్తి | భక్తి రత్నాకర్ | 1925 |
| 6. | విద్యానందదాస్ | ప్రేమవిలాస్ | 1911 |
| 7. | దినేశచంద్రసేన్ | బంగభాషాఓ సాహిత్య | 1901 |
| 8. | దినేశ చంద్రసేన్ | బృహత్ బంగ, రెండు భాగాలు | 1935 |
| 9. | దినేశ చంద్రసేన్ | గోవిందదాస్ | 1926 |
| 10. | దినేశ చంద్రసేన్ మరియు ఖగేంద్రనాధ్ మిత్ర | వైష్ణవ పదావళి | 1945 |
| 11. | శిశిరకుమార ఘోష్ | అమియనిమాయచరిత్ | 1- 6 భాగాలు |
| 12. | శిశిరకుమార ఘోష్ | నరోత్తమచరిత్ | 1906 |
| 13. | .. | ప్రబోధానంద ఓ గోపాలభట్ట | 1923 |
| 14. | రసికమోహన విద్యాభూషన్ | గోమ్భిరే శ్రీ గౌరాంగ | 1910 |
| 15. | జగద్బంధు భద్ర | గౌరపద తరంగిణీ | 1902 |
| 16. | అమూల్యధర రాయభట్టు | బృహద్ వైష్ణవ చరితాభిదాన | 1924 |
| 17. | బిపిన బిహారి దాసగుప్త | మహాప్రభుర లీలా వాసన్ | 1929 |
| 18. | ఖగేంద్రనాధ మిత్ర | కీర్తన | 1945 |
| 19. | అచ్యుత చరణ చౌదరీ | గౌరాంగేర పూర్వాంచల పరిభ్రమణ్ | 1922 |
| 20. | బిమాన బిహారి మజూమ్దార్ | శ్రీ చైతన్య చరితేర ఉపాదాన | 1930 |
| 21. | బిమాన బిహారి మజుందార్ | గోవింద దాసేర పదావళి తాహారయుగ | 1961 |

| | | | |
|---|---|---|---|
| 22. | బిమాన బిహారి మజుందార్ | పంచరతవత్సరేర పదావళి | 1962 |
| 23. | ,, | షోడశ శతాబ్దిర్ పదావళీ సాహిత్య | 1961 |
| 24. | సుందరానంద విద్యావినోద | శ్రీ చైతన్యదేవ | 1950 |
| 25. | మధుసూదనవాచస్పతి | గౌడీయ వైష్ణవ ఇతిహాస్ | |
| 26. | హరేకృష్ణ ముఖోపాధ్యాయ | చైతన్యేర సమయేర నవద్వీపేర స్థితిస్థాన బనామ్ మియాంపుర్ | 1934 |
| 27. | ,, | సంపాదక్ పదావలీ పరిచయ | 1956 |
| 28. | ,, | చండీ దాసపదావలీ | 1934 |
| 29. | ,, | సంపాదక్ జ్ఞానదాసేర పదావలి | 1956 |
| 30. | ,, | సంపాదక్ - రసకల్పవల్లి ఓ అన్యాన్య నిబంధ్ | |
| 31. | సతీశచంద్రరాయ్ సంపాదక్ | పదకల్పతరు | 1- 5 భాగాలు |
| 32. | అచింత్యకుమార్ సేన గుప్త | అఖండ అమియా శ్రీగౌరాంగ | |
| 33. | ,, | గౌరాంగ పరిజన | |
| 34. | శారదా చరణమిత్ర | నీలాచలే శ్రీ కృష్ణ చైతన్య | |

ఇంగ్లీషు

| | | | |
|---|---|---|---|
| 1. | దినేశచంద్రసేను | చైతన్య అండ్ హిజ్ కాంటెంపరరీస్ | 1917 |
| 2. | ,, | వైష్ణవ లిటరేచర్ ఆఫ్ మెడీవల్ బెంగాల్ | 1917 |
| 3. | ,, | చైతన్య అండ్ హిజ్ ఏజ్ | 1922 |
| 4. | హరప్రసాదశాస్త్రి | వర్నాక్యులర్ లిటరేచర్ ఆఫ్ బెంగాల్ బిఫోర్ ది ఇంట్రడక్షన్ ఆఫ్ ఇంగ్లీష్ ఎడ్యుకేషన్ | 1891 |
| 5. | యస్.కె.డే. | ఎర్లీ హిస్టరీ ఆఫ్ ది వైష్ణవ ఫైత్ అండ్ మూవ్‌మెంట్ ఇన్ బెంగాల్ | 1942 |
| 6. | మెల్‌విల్ టి.కెనడి | చైతన్య మూవ్‌మెంట్ | 1925 |

